# శ్రీకృష్ణాతిమానుషతత్త్వము

( తృతీయఖండము )



ప్రాణాచార్య, శతావధాని, అభినవ తిక్కన, అభినవ పోతన, విద్యానిధి

దివి రంగాచార్యులు

విద్యాపరిషత్ ప్రచురణ

గుంటూరు - 2.

షష్టిపూర్తి హోమాగ్నినియతులగు

శ్రీమాన్ దివి రంగాచార్యులవారు వారి సతీమణి శ్రీమతి సుభద్రమ్మగారు



షష్టిపూర్తి హోమాగ్నినియుతులగు

శ్రీమాన్ దివి రంగాచార్యులవారు వారి సతీమణి శ్రీమతి సుభద్రమ్మగారు

# భూమిక

"భూషణములు వాణికి నఘ
పేషణములు మృత్యుచిత్తభీషణములు హృ
త్తోషణములు కల్యాణ వి
శేషణములు హరి గుణోపచితభాషణముల్".

—అని భాగవత పురాణోక్తి. భగవచ్చరిత్రను ఎందరెన్ని విధముల వర్ణించినను ప్రతిక్షణమది నవనవోన్మేషమై, సుధామధుసంకాశమై పాఠకుల మానసముల కానందానుభూతిని చేకూర్చుచునేయుండును. శ్రీకృష్ణతత్త్వమును కూలంకషముగా అవగాహనము జేసికొననినాడు అపోహలు కలుగుటకు వీలున్నది. 'అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితం' అని ప్రవచించిన శ్రీకృష్ణపరమాత్మ తత్త్వమును హేతూపన్యాసపూర్వకముగా ఇతఃపూర్వ మెవ్వరును రచించి యుండలేదు. ఆకొఱత దీర్చుటకే నేడీకావ్యము వెలువడినది.

శ్రీమాన్ దివి రంగాచార్యులవారు మా విద్యాపరిషదధ్యక్షులు. ప్రాణాచార్య, శతావధాని, అభినవపోతన, అభినవతిక్కన, విద్యానిధీత్యాది బిరుదాంచితులు. పైగా నాకు పితృతుల్యులు, గురుస్థానములోనివారు. వారి కావ్య ప్రథమ ద్వితీయ ఖండములపై వెలువడిన కవిపండితాభిప్రాయములను పరిశీలించిన ఈ కావ్యమునకు పీఠికతో నిమిత్తము లేదనిపించినది. పలువురు ప్రశంసించిన యీ కావ్యమును గురించి పలుకుట సూర్యుని దివిటీతో జూపుటయే. కావ్యసంప్రదాయాయాయులైన శ్రీ ఆచార్యులవారి ఆదేశమును కాదనలేక ఈ భూమికను వ్రాయసాహసించితిని.

ఈ తృతీయఖండ మైదాశ్వాసముల కావ్యము. ప్రథమాశ్వాసములో నరకాసురుని వధ, పారిజాతాపహరణము గలవు. ద్వితీయాశ్వాసములో హంసడింభకులవధ, దుర్వాసుడు శ్రీకృష్ణుని దర్శించుట, సుభద్రాపరిణయము, ఘంటాసురాఖ్యానము, పౌండ్రక వాసుదేవుని వధ, బలరాముడు మైందద్వివిదుల సంహరించుట మొదలగు ఘట్టములు కలవు. తృతీయాశ్వాసములో జరాసంధుని వధ, శిశుపాలవధ, కుచేలోపాఖ్యానము గలవు. చతుర్థాశ్వాసములో శశిరేఖా పరిణయము, శంబరాసురుని వధ, ప్రభావతీప్రద్యుమ్నము. పంచమాశ్వాసములో దంతవక్త్రుని వధ, శ్రీకృష్ణరాయబారము గలవు.

ఎఱ్ఱన హరివంశమును, సోమన ఉత్తరహరివంశమును, పోతన భాగవతమును వ్రాసినారు. ఆధునికులలో శ్రీపాద, జనమంచి మొదలగువారు భాగవతమును నాంధ్రీకరించినారు. ఇన్ని గ్రంథములుండగా మరలనిదేల? అను ప్రశ్న రావచ్చును. కావ్యవస్తువు ఒక్కటైనను ప్రతిభావిశేషములనుబట్టి భిన్నభిన్న కవులకృతులు భిన్నభిన్న రీతులలో సాగుచుండును. 'కవిప్రతిభలోనుండును కావ్యగత శతాంశములలోన తొంబదియైన పాళ్లు'. ఎవరిరుచులు వారివి. అందువలన నైప్రశ్నకు తావులేదు.

శ్రీయుతులు డా|| దివాకర్ల వేంకటావధాని, నిడదవోలు వెంకటరావు ప్రభృతులు ప్రవచించినట్లు పరిణామముచేతనేగాక వస్తువునుబట్టికూడ ఈకావ్యము మహోన్నతమైనది. ఇందులో ఈనాటిభావములు కొన్ని పొందుపరచబడినవి. వానికొఱకు పౌరాణిక కథాసంవిధానము కొంతమార్పు చెందినది. వైయుక్తికమైన దృష్టిభేదము కారణముగా అవతరించిన రసవత్తరమహాకావ్యమిది.

ఆచార్యులవారు శ్రీకృష్ణునియొక్క అతిమానుషతత్త్వ నిరూపణనే ప్రధానముగా నెంచి రచన సాగించుటచేత దీనికి శ్రీకృష్ణాతిమానుషతత్త్వమని పేరిడినారు. 'అతి' అను శబ్దము ప్రకర్షలంఘనార్థముల రెండింటియందును వాడబడుచున్నను రెండవదానికే ఇందు ప్రాధాన్యతకలదు. ఈకావ్యమున కృష్ణుడు కేవలము భగవంతుడు, సర్వవేది. మచ్చునకైనను మానుషతత్త్వమీయనకు లేదు. ఇతడు దేవేంద్రుని మణిభద్రుని పంపుటలోగల విశేషమును ముందుగనే గుర్తించినాడు. తనమందిరాంగణమున 'కోలాహలంబొప్ప బెన్మునిసంఘంబులు బార్లుదీరినిలువన్ వీక్షించి' 'ఆత్మని జోదంతమెఱింగి' నాడు. పారిజాతపుష్పమును తెచ్చిన 'నారదమునీంద్రు నాగమనమున్ స్వర్లోకవృత్తాంత సర్వంబును' తనమదిలో నెఱిగినాడు. సత్య 'శ్రీపత్యర్ధాంగి యెవారో తేల్తు' నని కోపాగారమున ప్రవేశింపగా ఆ సకలంబెఱిగి 'హరి యింతి విదగ్ధకుమారి వాసమున్ వదలి యిదొక్కమేలునకు వచ్చిన కోపముగాదలచి' బయలుదేరినాడు. పారిజాతవృక్షమును పెకలించినందుకు తనపై దండెత్తివచ్చిన దేవేంద్రుని ఆత్మలో 'ఏరూపుంగొని పారిజాతసుమనో వృక్షంబుమూలంబుతో నారీసంయుతుడై హరించి ఎదుటన్గన్పించెనో' ఆ రూపంబుతోడనే కనిపించినాడు. సత్యాగర్వభంగమునకై నారదుడురాగా 'అబ్రహ్మాత్మజోద్దేశమున్ మనుపేగాంచి మురారి యేదియోమిషన్' గృహోద్గామియై పోయినాడు. సత్యకు గర్వభంగముకాగా 'ఈపటుతత్త్వ పరీక్షకు నీఘటన కల్పించియుంటి' నని చెప్పినాడు. అంతేకాదు—

"నా యంతర్నిజతత్త్వమున్ దెలియు విజ్ఞానాత్మకప్రాణియే
నా యంతస్థితమా; రజోధిక తమోన్మాద భ్రమాలోల నక్ష

డాయన్ జేరి పిఱుందనే మెలగినన్ భావానుబంధక్రియన్
వేయున్ జన్మలకేనియన్ గనునె? తన్వీ! నా నిజోదంతమున్.

—అని తన ఆంతర్యమును విప్పిచెప్పినాడు. ఘంటాసురునకు హరిహర రూపములతో కనిపించుట, శంబరాసురుని మాయను ముందుగా రుక్మిణీదేవితో చెప్పుట, శివకేశవసమాగమము, ద్రౌపదీమానసంరక్షణము, విశ్వరూప ప్రదర్శనము, మొదలగున వన్నియు శ్రీకృష్ణాతిమానుషమునకు ద్యోతకము లగుచున్నవి.

ఈ కావ్యములోని నరకుడు హరివంశములోని నరకునివలె 'మొరటు' కాడు. రసికుడు. 'సురనాథాలయమునన్ బుష్పదనముల్ శోభావిహీనంబులై పరితృప్తిన్ గడియింపజాలమి' మనోవ్యాకులుండైనాడు. ఇతడు 'వనాంతర కాసార సమీపభర్మ్యమయసౌధ ప్రాంగణోద్యాన సుందరరత్నస్థగితోచ్ఛ్రితాసనమునన్ బ్రావిష్టుడై ఊర్వశిన్ రసికనాథాగ్రేసగ ప్రేయసిన్' పరికింపందలంపయి 'సుంతపిలిపింపంరాదె సేనాపతీ!' అని మురునితో చెప్పును. ఈ 'సుంత' లో ఎంతయో రసికత్వమున్నది. హరివంశములో వలె 'మనోజానీక సంక్రీడలన్' సత్కరింపుమని అసభ్యముగా నిందు మాటాడక ఒకానొక రసికావతంసునివలె 'పరిహాసక పరిచయముల' తో సంభాషించును. ఊర్వశీ నరకాసురుల సంభాషణ ఉత్తరహరివంశములోవలె సుదీర్ఘముగాక చమత్కారముగా, పాత్రౌచితికి తగినట్లు హృద్యముగా ఐదుపద్యములలో రసవత్తరముగా వర్ణింపబడినది. 'లంజియ' వంటిపదములను ఊర్వశి ఇందు ఉచ్చరించక నరకుని వేశ్యాసహజ ధోరణిలో 'బావా!' అని సంబోధించును. మురాసురుని ఆజ్ఞను శిరసావహించిన భటులు మున్యాశ్రమములో చేసిన దుండగముల వర్ణనలో [7 వ పే. - 29 ప.] బాధలకులోనైనను 'ఋషిప్రవరుల యుత్కృష్ట పావన నిగమయుక్త శస్త ఋగ్వ్రత యజ్ఞదీక్షాధిరూఢ సిద్ధ పరిశుద్ధబుద్ధి' ని వెల్లడించుట అపూర్వమై, సుందరమై ఆచార్యుల వారికి ఆర్యఋషుల సంప్రదాయములపైనను, వారి దీక్షపైనను గల పవిత్ర భక్తిని ద్యోతకము చేయుచున్నది.

ప్రథమాశ్వాసమున నరకుని కన్నను మురునకే ప్రాధాన్యత గలదు. కృష్ణుడు మురారి. అమరములో 'నరకాసురాంతకు' డని విశేషపాఠాంతర మొకటున్నను 'మురారి' అంత ప్రాధాన్యత దానికి రాలేదు—కనుకనే ఈ కావ్యమున నరకుని కృష్ణుడు బాణముతో సంహరించినను మురుని చక్రముతో చంపును. ఇది వైష్ణవ మర్యాద.

సత్యభామయొక్క రణకౌశలమును పరీక్షించుటకై కృష్ణుడు ఆమెను యుద్ధమునకు తీసికొని పోయినట్లు ఈ కావ్యమున కల్పించబడినది. అంతేకాదు. సత్య

'నేర్పునన్' బెనురథ్యములన్ లాగి పూన్చె" నట ! సత్యకా కౌశలము సర్వజనులకు విదితము కాబోలును. ఎవరును ఆశ్చర్యపడలేదు.

నరకుడు కారనుంచిన పదారువేల కన్యకామణులను కృష్ణుడు పరిగ్రహించినాడు. ఆకాలమున బలవంతుడైనవాడు తీసికొనిపోయిన కన్యను తిరిగి మరియొకడు పరిగ్రహించు ఆచారములేదని అంబాభీష్ముల చరిత్రవలన మనకు తెలియుచున్నది. కాని శ్రీకృష్ణుడు దీనికి విరుద్ధముగా కన్యల బరిగ్రహించినాడు. దానికి కారణము పరిశీలింపగా ఆకన్యలు శ్రీకృష్ణునికొరకుగా భూపాలగర్భములయందు పుట్టినట్లును, ఏదోమిష చేత శ్రీకృష్ణుడే వారిని నరకాలయమునకు చేర్చినట్లును సత్యమాటలవలన (22 పే 114 ప) మనకు తెలియుచున్నది.

నారదుడు శ్రీకృష్ణుని పరీక్ష చేయవలెనని వచ్చినపుడు ఒక్కొక్క గృహము లోని ఒక్కొక్క నాయికతత్త్వము హృద్యముగా వర్ణింపబడినది. రుక్మిణి పతిభక్తి కలిగినదానిగను (24 పే 130 ప) సత్యభామ స్వాధీనపతికగను (132 ప) జాంబవతి ప్రణయినిగను (134 ప) మనకు దర్శనమిత్తురు. ఈపాత్రపోషణ రసోచితమై భావి కథాంశములకు పరిపోషకమై వెలయుచున్నది.

సత్య కోపాగారమున ప్రవేశించిన పతిని 'వామపాదంబునన్ దొలంగం ద్రోయదు' ఇది పారిజాతాపహరణములో తిమ్మన ప్రయోజనసాధనకై చేసినకల్పన. భాగవత, హరివంశములకు భిన్నమై పారిజాతాపహరణ ఛాయలో కథ నడచినను కథాసంవిధానము క్రొంగ్రొత్త రుచుల వెలార్చినది. సత్య 'వాడ్చిప్రుళ్లకడానివా తెరల్ పోడిమిమీర లటాలునన్ హరిని కవుంగలించినది' ఇట్లుచేయుటలో ఒకరహస్యము న్నది. తాను శ్రీకృష్ణుని మనసార ప్రేమించినది. తనకు శ్రీకృష్ణుడు స్వాధీనమై యుండవలయునను మనస్తత్వము కలిగినది సత్య. పారిజాతాపహరణమున 'కనుగవ చిన్నినవ్వు దొలుకన్ మునినాథుని కన్నుసన్న' కృష్ణుడు పారిజాతపుష్పము రుక్మిణికిచ్చినాడు. అందులకు సత్యకృష్ణునిపై అలిగినది. ఇది సమంజసమే. కాని ఈకావ్యమున పారిజాత పుష్పమును రుక్మిణికిచ్చినది నారదుడు. కృష్ణుడుగాడు (29 పే 158 ప) కృష్ణుడు చేయని పనికై కృష్ణునిపై అలుగుట అనుచితము. ఆపారిజాతము తనకుగాక రుక్మిణికిచ్చుట తనకవమానముగా భావించి కృష్ణుడీపనిని చేయకపోయినను 'యథార్థ్యంబుగా చేసినట్లు' ఆత్మాందోళన పొందినది. అంతేకాదు మార్గాలోకనకూడ చేసినదట ! సత్యకు సవతులపై ఈర్ష్య, ద్వేషములు లేవు. పదారువేలకన్యలు తనను ప్రార్థింపగా 'కరుణామతియై' వారిని స్వీకరింపుమని కృష్ణుని ప్రార్థించినది. పారిజాతవృక్షమును గొనివచ్చి పూలను ముందు 'దేవేరి రుక్మిణీదేవికిచ్చి, పిదప సపత్నుల బిలిపించి వేర్వేరబంచి,పిమ్మట

రాజబంధువులకునంపి పురిలోని పెద్దముత్తైదువులకు ప్రీతినిచ్చి, పిమ్మట పురంధ్రీ మణులకునొసంగి' తానుధరించినది. ఇట్లుచేయుట రుక్మిణిపైగల భక్తి భావమునగాదు. కేవలము తనఆధిక్యతను ప్రకటించుకొనుటకే ! సత్యభామ రుక్మిణికడకుపోయి 'రమ్మా ! కపటతులాభారమ్మాలోకించి మాకు ప్రాసముమాన్పన్ సొమ్ములవియున్న గొంకక తెమ్మా !' అనును. ఇందు 'సొమ్ములవియున్న గొంకక తెమ్మా !' అనుపలుకులలోని అమాయికత పాఠకులకు సుస్పష్టమే !

రుక్మిణియే సత్యకు మార్గము చూపించునని నీలచే చెప్పించుట వైష్ణవమర్యాద. ఇది యౌచిత్యముకూడను. ఈ నీల విష్ణువిభూతులలో నొకటైన నీళయేగాని వేరుగాదు. అందువలననే ఇట్లు కల్పించబడినది. రుక్మిణీద్వార (48వ పేజి 263వ ప.) పరతత్త్వ పవిత్రభక్తిసాధన యొక్కటియే విష్ణువును చేపటకు మార్గమనియు, కృష్ణుడు విదురుని గృహమునకు అతిథిగా పోయినపుడు 'అచ్చపుటార్తిహార్తిన హృదంగ సమర్పణాత్మక కృష్ణుడు యాగములను వ్రతములను తపస్సులను మెచ్చడని ప్రవచించుట ఆచార్యుల వారి వైష్ణవాభిమానమును ప్రకటించుచున్నవి.

మనస్తత్త్వనిరూపణ మహాకవుల లక్షణము. కోపాగారమున ప్రవేశించిన కృష్ణుడు సత్యభామ సమీపమున గల 'ప్రియాళిని కనుసన్న ద్రోలును'. నరకుడు ఊర్ధ్వశిరాగా మెల్లన లేచి 'దరహాసద్యుతులు మోము దమ్మినిసుద్వన్' సమీపించును. పదారువేలమంది రాజకన్యలు తమ్ము స్వీకరింపుమని కృష్ణుని ప్రార్థింపగా 'నిరుత్తరుడై కనుగొనలను నిజభామవైపు గూరిచి కృష్ణుడు కలయం గనుగొనును'. రాయబార ఘట్టమున కృష్ణుడు 'యమాత్మజు నావలకంపి మారుతిన్ కనుసన్' జీరును. దుర్యోధనుడు కృష్ణునకు భోజనము నొసగబోవునంతలో 'చిరునగు వెన్నెలల్ చెలగి చిందులు వేయ' మురారి పలుకును. ఇట్టి కావ్యము దంతటను ఈ మనస్తత్త్వనిరూపణ చేయబడి నాటకములలందు నటకుల ఎఱుకకొఱకు చేయబడిన సూచనలవలె పాత్రల హావభావములు అతి నిపుణముగా వర్ణించబడినవి.

ఆచార్యులవారు కృత్రిమ మునివేషమును పూనిన అర్జునుని చేష్టలు (65 పే. 85 ప.) మనోహరముగా వర్ణించినారు. సుభద్రచేష్టలు ప్రౌఢములై ప్రబంధకవిత్వ ఛాయల ప్రతిఫలించుచున్నవి. (66 పే. 86 ప.). జరాసంధుని పాత్రపోషణ (87 పే. 7, 14, 15, 16, 17, 18 ప.) ద్వితీయఖండములోని జరాసంధుని పాత్రకు వన్నెలు దిద్దుచున్నది. భీముడు జరాసంధుని ద్వంద్వయుద్ధమున కాహ్వానించినపుడు పూట్లాడుకొను మాటలు (90 పే. 22 ప.) రసపోషణమునకు శిరోమాణిక్యమనవచ్చును.

భారతమున ధర్మరాజు నారదుని మాటలను విని 'పితృపితామహులకు హితము' చేయుటకై రాజసూయ యాగమొనర్చినట్లుండగా ఈ కావ్యమున ధర్మస్థాపనకొఱకు ఏకచ్ఛత్రాధిపత్యము కొఱకు కృష్ణుడు ప్రోత్సహించునట్లున్నది. (105 పే. 104 ప.) 'యదాయదాహిధర్మస్య' అనిన కృష్ణుని పాత్రకు ఇది 'మెఱుగులు' దిద్దును. భారతమున రాజసూయయాగ సందర్భమున కృపాచార్యుని, భీష్మద్రోణులను, విదురుని, దుర్యోధనుని, దుశ్శాసనుని వివిధ విషయములలో నియమించినట్లుండగా ఈ కావ్యమున దుష్టచతుష్టయమును నియమించుట ధర్మజుని అజాతశత్రుత్వమును చాటుటయే గాక ధర్మజుని వైభవమునకు వారికి 'కన్నుగుట్టుట'కు తగిన సావకాశ మేర్పడుచున్నది. వామాక్షికాపురము దిద్దు విధము (112 పే. 136 ప.) కరుణారసకలితముగా వర్ణింపబడినది. 'మానధనము గోప్యపరచి' కాపురము దిద్దెననుటలో ఉత్తమ గృహిణిత్వము ప్రస్ఫుటమగుచున్నది.

మూడవ పర్యాయము అటుకులు తినబోవుచున్న కృష్ణుని చేయిబట్టి రుక్మిణి నవ్వి 'ఆజీర్ణమయ్యెడి. అనంతరమీ వ్యథ గల్గునాకు' అనిన పలుకులు, 'మందునగానంబడకుండుట' మొదలైనవి (121 పే. 2 ప.) ఆచార్యులవారి ప్రాణాచార్యత్వమును వెల్లడించుచున్నవి. చతుర్థాశ్వాసములోని ప్రభావతీప్రద్యుమ్న వృత్తాంతములోని కథాకల్పన రమణీయము. పాకాలయములో దాసీరూపమున ఉన్న రతినిజూచి మోహించిన శంబరాసురుని చేష్టలు (125 పే. 30 ప.) కీచకుని చేష్టలను జ్ఞప్తి కెలయించుచున్నవి.

శశిరేఖాపరిణయములో సుభద్ర కుమారునితో ద్వైతవనము ప్రవేశించుట, వృకోదరుడు స్వవిషయమును తెలిసికొని ఘటోత్కచుని పిలిపించుట ఔచితీసహితమైన రమణీయకల్పన. ఘటోత్కచుడు సుయోధనాత్మజుని భయపెట్టువిధము (136 పే. 92 ప.) లక్ష్మణకుమారుడు పడిన భయము (93 ప.) పాఠకుల హృదయమునకు గిలిగింతలు వెట్టురీతిని హృద్యముగా వర్ణింపబడినది.

పంచమాశ్వాసములోని శ్రీకృష్ణరాయబార మొక రమణీయ శిల్పఖండము. కొన్నికొన్ని తావులలో ఈ రచన తిక్కన రచనను పుణికి పుచ్చుకొన్నది. కథాసంవిధానములోని రమణీయకల్పన రసోచితముగా నున్నది. భారతములోవలె ముందుగా యిందు అర్జునుడు, దుర్యోధనుడు కృష్ణుని తమకు సహాయముగా కోరుకొనరు. ఇట్లు కోరుకొనుటలో యిరుపక్షముల వారికిని సంధిపై యిచ్ఛలేనట్లు స్ఫుటమగుచున్నది. ఇచ్ఛలేనపుడు కృష్ణుని రాయబారిగా పంపుట కేవలము ధర్మజుని రాజకీయ తంత్రమేగాని మరొండుగాదు. కౌరవసభలో కృష్ణుడు పలికిన పలుకులు దుర్యోధనాదులకు క్రోధమును ద్రేకింపజేసినవేగాని సంధికి దారితీయలేదు. సంధిచేయవలయునను వాంఛయున్నవా

డెవండును ఆ విధముగా పలుకడు. ఈ కావ్యములో ద్రౌపది భారతములోని ద్రౌపదివలె రజోగుణప్రధానయై భర్తల నెదిరించి మాట్లాడు గయ్యాళివలెగాక ఉత్తమ గృహిణివలె సత్త్వప్రధానయై మాట్లాడును. ద్రౌపదిని 'నీ స్వాంతమెఱుంగ జేయు'మని కృష్ణుడు పలుకగా కనుంగవ నీరునిల్పి 'దైత్యాంతక! అంతకాత్మజు డనాదరుడై నను ద్రోసిపుచ్చి సిద్ధాంతమునర్ప గాదని తదన్యువల్కు విరుద్ధధర్మమా' యన్న సాధ్వి ఆమె. పతులకేలేని వ్యథ తనకేల? అని ఆమె భావన. ఇదొక విచిత్ర పాత్రచిత్రణ–యథార్థమునకు సంధికే పాండవులు ప్రయత్నించినట్లును శ్రీకృష్ణుడు దీనికి పూర్తిగా ఆమోదించి ప్రయత్నించినట్లును నీ కావ్యమున గలదు.

శ్రీకృష్ణాగమన సందర్భమున వ్రాయబడిన (70, 71 ప) పద్యములు చంద్ర యుపచంద్రుల తారతమ్యము నెంచుచు ప్రజలనుకొనిన సందర్భమున వ్రాయబడిన సీసము మనోహరములై కవిప్రతిభను వ్యక్తముచేయుచున్నవి. రాయబారసభకు నారదుడు, జాబాలి, భారద్వాజుడు, శుకుడు, వ్యాసుడు, భృగురాముడు, అత్రి వచ్చిరని వ్రాయుటయేగాక నారద, వ్యాస, భృగురాముల మనస్థితిని వర్ణించుట (170 పే 165 ప) పాత్రౌచిత్యమును వెల్లడించుచున్నది.

శ్రుతిమంతుడును ప్రగల్భుడు
కృతకర్మాభ్యాసి, వాగ్మి, కీర్తితశుభస
న్మతి శస్త్రశాస్త్ర నిష్ఠుడు
పతికిన్ దగు దూత గాగ బహుకార్యములన్.

(కామందకము)

ప్రతిభయు, నవ్యవచత్వము
పతిభక్తియు, పలుకువెరవు, పరనృప ధర్మ
జ్ఞతయున్, వినయము, తేజము
నతి శుచియును, దూత గుణము లండ్రు నయజ్ఞుల్.

(నీతిసారము)

ధీయుతు డభయుం డచలు డు
పాయజ్ఞుడు సముచితప్రభాసుండు పతి
శ్రేయోర్థి పరేంగితవిదు
డాయాససహుండు దూతయగు నధిపతికిన్.

(పురుషార్థసారము)

# దృగ్దృశ్యము

దృష్టిద్వివిధము—లౌకికము-లౌకికభిన్నమని - అందు లౌకికము దోషగవేషణా సక్తము-ద్వితీయము ఆచరణాసక్తకము-కాననే లౌకికదృష్టి కిమిదం? కిమర్థమను 'కిం' శబ్దపరాయణము-నేయంపద్ధతిః నేదంయుక్తమను 'న' శబ్దపదాసక్తమును నయియున్నది. లౌకిక భిన్నదృష్టికి లక్షణము తద్భిన్నత-దాని కాచరణలో విఘ్నములు సంశయములుఁ బొడసూపిన తన్నిర్వాణ మాలోచించునే కాని స్వోపజ్ఞా మాత్ర విశ్వస్తమై నిర్ణాయికత నవధరింపదు. అది జీవితమున-సాహిత్యమునను సహజము.

ఇది శ్రీకృష్ణాతిమానుషతత్త్వము-తృతీయ భాగము. ఇది ఆగమమని-గ్రంథయితలు మహర్షులని-దర్శించిరనియు మొదటనే విన్నవించితి. కాన నిం దేవిషయమైనప్రాచీన ప్రసిద్ధభిన్నత నాలంబించిన కారణమాగయవలయునే కాని కిమిదం 'నేద' మ్మన రాదని మనవి.

ప్రాచీనభిన్నమన్నట్లు కానవచ్చు నొక సందర్భము-

(1) 'హంసడింభకలు' అను పేరు. ఇది హరివంశమున హంసుడు, డిభకు డన్నట్లుండ నిందులో డింభకుడని యుండుట.

ఇట సహజముగా డింభకశబ్దమే ప్రయుక్తము కాని ప్రత్తిపలుకువారి వ్రాఁతబడి డిభక శబ్దముగా మారెననియు, లేనిచో నన్వర్థాభిధానముతో నాహ్వానింప మోజుపడు మహర్షి డిత్థ, డబిత్థ శబ్దములవలె డిభకశబ్ద ముపయోగింపడనియు వారి దర్శనము అయితే డింభక శబ్దోపయోగమువలని సార్థకమేమన, 'హంసుడు హంసడింభకుడు' అనే అర్థములో హంసడింభకులని యుపయోగించి యుండనగు కలదుగదా? ఆంధ్రమున సంప్రదాయము ఒకే పేరు సోదరు లుపయోగించునెడల 'పెద్ద చిన్న' యని ముందుపయోగించుట, తుదకు పేరును మాని 'చిన్నయ్య-పెద్దయ్య' యని మాత్రమే పిలచుట. శ్రీకృష్ణదేవరాయలు 'చిన్నాదేవీ హృదయేశ్వరులట'.

ఇట్లే పంచమాశ్వాసమున రాయబారమునకు ముందు శ్రీకృష్ణు నాహ్వానించుటకు నర్జునుని భారతమం దంపియుండ నిందు "మాద్రేయుల నరదముపై భద్రగతిం బంపి రాయబార మొనర్పం భద్రాత్మకు హరిఁజీర" నని మాద్రేయులఁ బంపుటయేమి? అటను దుర్యోధనుని యాగమనము లేకుండుటయేమి? అని—

అంతవర కెవ్వరును బహిరంగముగా యుద్ధసన్నద్ధులగుట లేదు. అట్టి స్థితిలో శ్రీకృష్ణుని ససైన్యపరివారముగా నర్జునుని బంపి యాహ్వానించుట యన, రహస్యయుద్ధ యత్నములు మాని బహిరంగ యుద్ధయత్నము లొనర్చుటయె. ఇటు లొకదిక్కు యుద్ధ సన్నద్ధు లగుచు దౌత్యము నెరవేర్చుట యన 'చంకదుడ్డు-శరణార్థి' విధానముకాదో? అట్టి స్థితిలో దౌత్యము పొసఁగునా? పొసఁగిన రెండవవారు దుర్బలురగుట ననుక్షణము శంకాకులితాత్ములై క్షణక్షణము తమ్ము తాము చంపుకొనుటకాదో? అందులక మాద్రేయులఁబంపి శ్రీకృష్ణు నాహ్వానించె. అందునను నర్జునున కున్నంత బాంధవ్య ఘనిష్ఠత లేకున్నను భక్తి ఘనిష్ఠతలోఁ దీసిపోరు కదా! దానికి తోడు "బాహ్మణులలో బాలుడు బెస్తలలోఁ బెద్ద" యను లోకోక్తి కలదు. ఇందు బ్రాహ్మణ పదము 'బెస్తకంటే వేరు' అను నర్థములోననే కాని కేవలజాతిమాత్ర పరముగాదు. (దీని కనుభూతి ప్రమాణం). ఇదికారణముగనే యిట దుర్యోధనాగమనము లేదు అని బహిరంగముగా యుద్ధసన్నద్ధులగు సమయమున దుర్యోధనార్జునులు కృష్ణసహాయము నర్థింతురు. అది చతుర్థభాగమున గలదు.

దౌత్య నిర్వహణమునందును నందలి కృష్ణుని కన్న యిందలి కృష్ణుఁ డుదాత్తముగా సంధికొరకునే ప్రయత్నించెను కాని సంధిభంజకములగు వక్రోక్తుల-దర్పోక్తులను బ్రవచించడు. భారతము నొరవడిగా బెట్టుకొనియే గాబోలు వీరభారతమున భట్టుదురు సాడబ్రోపుడువడియె.

మరియొకటి మహాభారతయుద్ధమున కాది నిదానము సుహృద్ద్యూతచ్ఛలమున జరగిన దురోదరము. దాని నిర్వాహకుడు శకుని. అట్టివాని ప్రసక్తి యిట్టిపట్టున లేకుంట సమంజసమా? మరియు నీ శకుని తన కిల్లున్ వాకిలి లేనట్లెల్లప్పుడీ దుర్యోధను నేల యాశ్రయించుకొని యుండవలయు? ఉండుగాత దర్పోద్ధత వయోధర్మ ముడిగియు ముందువెనుక లాలోచించక, కలహబీజమగు దుర్ద్యూతము నేల ప్రోత్సహించి నిర్వహించవలె? అను నీ మొత్తము ప్రశ్నలకు సమాధానముగా శకునిని బ్రవేశ పెట్టించి కృష్ణునిమాటలద్వారా శకుని మనో గుప్తాశయము నిట్లు వెలువరించును.

నీ జనకు నిదుర్మ్రతికై
యోజించి కురుకుల మంత మొందించుట కీ
యోజన్ ద్యూతముఁ గూర్చితి
నీ జల్పు మెఱుంగరైరి నృపతియుఁ గొమరుల్

—అని దీనికిఁ గల ప్రాచీన గాథ నెఱింగిననేకాని శకునికైతవమంతయు బయలుఁ

బడగలదు. అప్పుడీ శకునికి భారతయుద్ధమునఁ గల ప్రాధాన్యము, దుర్యోధనుని ప్రోత్సహించుటలో గల యాంతర్యము బోధపడును.

మరియు దురధికారము (దుర్యోధనుఁడు) దర్పము (కర్ణుఁడు) దుష్కార్యారంభము (దుశ్శాసనుఁడు) దురాలోచనము (శకుని) నను దుర్గుణ చతుష్టయమునకీ దుష్ట చతుష్టయము విస్పష్టోదాహరణమను నానుడి కలదే కాని దురాలోచనపరుఁడైన శకుని రూప మింత విస్పష్టముగా భారతమునఁ జిత్రింపఁబడలేదు. అని యిటుఁజిత్రింపఁబడి కొట్టవచ్చినట్లుంట దీని యోగమత్త్వమునకు నిరూపకము.

పారిజాతాపహరణ కథలోని భిన్నతపై కథ పేరఁజెప్పఁగనే "శ్రీకృష్ణుడు సత్యభామా పాదములపై తలమోపి నమస్కరించె" నను విషయము స్మృతికి వచ్చును. ఆ కథ కది మకుటాయమాన మన్నంత ఖ్యాతి సంపాదించుకొన్నది కాని అది యిందుఁ గానరాదు.

ఈ పాదపతన మనునది గురుమాన యగు మానినిఁ దేర్చు చేష్టావిశేషము. దీనిని సంస్కృత కవులు వివిధముగా నుపనిబంధించిరి.

(1) కాళిదాసు—అగ్నిమిత్రుఁ డిరావతి పాదములపైఁ బడును.

(మాలవికాగ్నిమిత్రము)

'శంకరుని శిరస్సత్కారమందుకొను నీపాద' మని పారాణి నలంకరించుచుఁ బార్వతి చెల్మికత్తె యామె నుడికించు— (హాలగాథాసప్తశతిలో)

"పాదపతితస్య పత్యుః పృష్ఠంపుత్రేసమారుహాతి
దృఢమన్యు దూనాయా అపిహాసోగృహిణ్యా నిష్క్రాంతః"

... ... ... ... పతివీపు
చిన్ని కొమరుఁడెక్కి చెలగియాడ
అలుక యెంత తెగని దయ్యును నిల్లాలి
మొగమునందు నవ్వు మొలచెనపుడు.

(గాథాసప్తశతీసారం - రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారు - హిమబిందునుండి.)

ఒకచో నెచ్చలి యిటు లభిశపించును ముగ్ధానాయికను "పాదపతనానాం ముగ్ధేరభసబలాత్కార చుంబితవ్యానాం దర్శనమాత్రప్రసన్నే! భ్రష్టాసి సుఖానాం బహూనాం" (కనఁగాఁ బ్రసన్నవగు నోముద్దరాలా! పాదపతనములు, రభసబలాత్కారకృత చుంబనములు మొదలగు ననేక సుఖములనుండి భ్రష్టురాలవైతివి) అని.

జయదేవుడు - 'యత్ర్త్వణమతి స్తద్ధాసి' అని 'స్మరగరళఖండనం మమశిరసిమండనం దేహి పదపల్లవముదారం' అనియు ననిపించును. అలంకారగ్రంథముల చాటువులనీ ప్రసక్తి కలదు. ఇటుల సంస్కృత గ్రంథముల చోటు సంపాదించుకొన్న పాదపతనము తెలుగుసాహిత్యమున నరుదైనది. ఒక్క పారిజాతాపహరణమునఁ దక్క లేదన్నను నజ్ఞత కాదేమో? ఆ ఘట్టమే జనుల నాల్కలపై నాడును, అట్టియెడ నా ఘట్టమును చిత్రించు నీగ్రంథమునను నదియుండవలదా?

దాని కిది నా యూహ. సంస్కృత ప్రసిద్ధ కావ్యావలోకన మొనర్ప స్త్రీ మనోభావమెరిగిన పురుషవిరహవర్ణనము పురుషప్రయత్నమే కానవచ్చును. కాని తనంత దా వలచినను నచ్చుటమాత్రము కానరాదు. తెనుగునమాత్రము తద్విపరీతము. (1) మనుచరిత్ర (2) ఆముక్తమాల్యద (3) వసుచరిత్ర (4) కళాపూర్ణోదయము (5) ప్రభావతీప్రద్యుమ్నము, పాండురంగ మాహాత్మ్యము, శివరాత్రి మాహాత్మ్యము మొదలగునవి. 'సాహిత్యము జాతిస్వభావమును ప్రతిబింబించు' నను సామాన్యోక్తి నాధారము చేసికొన్నచోఁ బారిజాతాపహరణ కథలో సత్య యంతబిగిసియుండరాదు. అయిన దాన నట్లేల యుపనిబంధింపవలయునన్న లోకము వాకొను కథను విశ్వసింపవలయు. అప్పుడది యాంధ్రులు తెచ్చుకొన్న యరువుసొమ్మని బయటపడును. దీని కుపష్టంభకము. 'అలుకం జెందిన యట్టి కాంత నుచితవ్యాపారముల్ నేర్తురే?'' యను సమర్థనము సరిపోవును. లేనిచోఁ గళావిశేషమైనదానిని సమర్థించవలసిన యవసరము లేదుగదా!

అదియునుగాక ననుక్షణము నతిమానుషవ్యక్తిగా గోచరించు యోగీశ్వరేశ్వరు డెట్టి స్థితిలోనయిన భార్యకుఁ దలవంచినా నిరపరాధియయ్యు నపరాధియను పేరుతో సత్యయు తానలిగి శరించుటయే కాక యవమానించినఁ దనపై నభిమానము త్యజించునేమో తానుగా కోరి ప్రార్థించి భార్యయైనది. [ద్వితీయభాగము - శ్రీకృష్ణాతిమానుషతత్త్వము.]

ఉన్న దొక్కపువ్వమే - దానిని పట్టమహిషి కిచ్చుటయే ధర్మమేమో?

తన కోరిక నెరవేర్ప శ్రీకృష్ణు డెల్లవేళల సంసిద్ధుఁడు కాఁ గదా నవమానించి బావుకొనునదేమి'' అని యాలోచించియు మానుట సంభవించినది.

కోపములో నింతయాలోచన వచ్చునాయన నోడతెలియుంగని సివముండదు కదా!

కాన నాయికనట్లు బాపపతనము, పాదప్రహారమునుఁ దప్పుట యోచితికే నాంధ్ర సంస్కృతికి మాత్రమే కాక కవిగతమైన వ్యక్త్యదర్శనమునకు - మహర్షిత్వమునకుఁ బరిపోషకము.

ఈ ఘట్టమునఁగల సందర్భశుద్ధి - మతకరివేలుపుం దపసి పారిజాతముఁదెచ్చి రుక్మిణికిచ్చుటలో రుక్మిణీ సత్యభామలకుఁ గలహ మాకాంక్షించి యుండవలయు. లేనిచో సత్యకే పూవొసంగి తల్లోభమునఁ బారిజాతమును భువిలో నాటఁదగుగదా ! కాని 'పృష్ఠ తాడినా ద్దంత భంగ' యన్నట్లు స్వర్గమర్త్యములకు యుద్ధము సంభవించినది. దాన లభించినదేమున్నది? పుణ్యకవ్రతమాచరించి వృక్షమును నారదున కర్పించినది.

ఇట్లు నారదుడు రుక్మిణికిఁ బారిజాతమిచ్చి సత్య మనోభావముల వెలికిఁదీసెనే కాని స్వర్గమర్త్యములకు యుద్ధముఁ దీసికొని రావలసిన పరిస్థితిని గాని తానన్నట్లు రుక్మిణియొక్క గొప్పదనమును గాని చాటినట్లు లేదు. (ప్రుక్కకయున్నె నీమహిమ నూచిన)

ఇఁక నిందన్ననో యింద్రుఁడు కృపణుఁడై నారదుఁడు "పేరుజెప్పి యడిగినను నొక్క పూవుకన్న మిన్న నొసంగలేదు. కాన యతని కృపణత్వ పరిహారముఁ గోరి స్వర్గముపైకి సత్యాకృష్ణుల దండెత్తించెను. పారిజాత ప్రాప్త్యనంతరము సత్య-

పతిభక్తిఁ దనకుమించిన
సతిలేదవి సత్యభామ స్వగతంబున (శ్రీ)
పతి తన సొమ్మని యతిగ
ర్వితమతి విహరింపఁజొచ్చె.

ఆమె గరువమ్మ వమ్మగుటకే పుణ్యకవ్రతమ్మఁ గల్పించె.

ఇట్లు నారదుని ప్రతిచర్యకు సందర్భశుద్ధిఁ గల్పించిరి.

పారిజాతాపహరణ ప్రబంధకర్త, కవిదిగ్గజమున కీ వైరుధ్యము తెలియదా ? యన ఏమో ?

సమాధానము వలయునన్నఁ బ్రచారమగు కథ ననుసరించి పొరపాటున జరిగిన చిన్నాదేవి పాదప్రహారము దోషము కాదనియుఁ బెద్దనగారు చెప్పినట్లు (మనుచరిత్ర పీఠిక) కృష్ణత్వమున కవి దృష్టాంతమనియు నిరూపించుచు చిన్నాదేవీ మనోభావములం-చిన్నాదేవి గొప్పతనమును జెప్పుటకే ప్రబంధ నిర్మితి జరిగియుండవచ్చును. పుణ్యకవ్రత ఫలమందు "మానుం బతియున్, మనమున నలుగొలు లెఱుఁగక, యనితరసులభైక సుఖములందుదువు" అని చెప్పుటయు కృష్ణరాయ మనోవైరస్య నిర్వాపణమున కని యూహించెద.

ఇక్లే నరకాసురబంధితలగు స్త్రీలు శ్రీకృష్ణు వివాహమాడ సంకల్పింపఁగా నాతఁడు నిరుత్తరుఁడగు అప్పుడు సత్యభామధర్మ నిర్ణయమొనర్చుటలో నీ పద్యము ప్రధానగణనీయము.

"పైశాచిక రాక్షసగతి
నే సబలుఁడో మనసులేని యింతినిఁగొన ద
త్పాశముఁ దృణీకరించిన
మోహల దుర్గతిఁ దలంచి మోముంగదవే."

ఇట బలవంతముగా చెఱుపఁబడి మతాంతరలగు స్త్రీలు కోరుకొన్నచో మరల సంఘమున యథాస్థితి నుండునట్టి యవకాశముండవలయునని, యట్టి సంస్కారము నీ వలన జరుగనగునని నొక్కి వక్కాణించుటగదా! దీనివలన జరిగిన జరుగుచున్న జరుగగల మతకలహ బలాత్కారములందు సీమంతినుల నుద్ధరించువిధానము నిర్ణయమొనర్పఁబడెనుగదా!

ఇట్లు ప్రసిద్ధ ప్రస్థానభిన్నత కానవచ్చినచోటనెల్ల మెఱుఁగు లురలి యధ్యయనాచరణమందాసక్తిఁ బెంపొందించుచుఁ దన యోగమత్వమును సార్థక పరచుకొనుచున్నది.

కాగా నధ్యయనలోలురగువారీ దృష్టి నవలంబించి "యంతరాంతరముల మణులరసియెత్తి చూడఁ గొన-నిడ-వలయు" నని ప్రార్థించుచు, నిట్టి యవకాశము గల్పించిన-మహర్షులు శ్రీ ప్రాణాచార్య దివి రంగాచార్యుల వారికిని-

అధ్యయన విధానము నేర్పిన మా యాచార్యపాదులకు శిరస్సాష్టాంగ నమస్కారము లర్పించుచున్నాడను.

"ఇదంకవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే
వందే మహిచతాం వాణీం అమృతామాత్మనః కలాం".

ఇట్లు
వారణాసి కోటేశ్వర శర్మ
[కో. వా.]
సాహిత్య విద్యాభాషా ప్రవీణ.

# శ్రీ కృష్ణాతిమానుషతత్త్వము

## ( ద్వితీయఖండము )

# సమీక్ష

## శ్రీ మాడపాటి హనుమంతరావు గారు,

చైర్మన్ ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్, హైదరాబాదు.

చక్కని అచ్చుతో మంచికాగితముపైన వెలువడిన ఈ గ్రంథము యొక్క బహిస్స్వరూపము కూడ దాని అంతస్స్వరూపముతో బాటు అభినందనీయమై యున్నది. శ్రీకృష్ణుని అతిమానుషతత్త్వమును తెలిసికొనగోరువారికి మీ ప్రథమ ఖండమువలెనే ఈ ద్వితీయఖండముగూడ ఉపయోగించ గలదు.

---

## గౌ॥ శ్రీ వి. వి. గిరి గారు, గవర్నరు, కేరళ

మీ గ్రంథం అందింది. చదివి నేను మిగుల ఆనందించితిని.

---

## శ్రీ యస్వీ జోగారావు గారు, M. A., PH. D.

లెక్చరరు తెలుగు డిపార్టుమెంటు, ఆంధ్రాయూనివర్సిటీ, వాల్తేరు.

ఈ కావ్యము నిది ఫలానివారి రచనయని తెలియకున్నచో నదియొక ప్రాచీన కావ్య మనిపించును. ఈ నాడు ప్రాచీనపు బాణిలో నింత బృహత్కావ్యము రచించుట యన్న సామాన్యము గాదు.

---

## శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు,

శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటి, తిరుపతి.

ధారాళమైన సంస్కృతమైన శ్రీ రంగాచార్యులవారి కావ్యశయ్య కమనీయమై యప్రమేయమైన శ్రీకృష్ణ తత్త్వమందు వారికి గల యసాధారణ శ్రద్ధ ప్రతి పద్యమందును ప్రతిఫలించినది.

---

## 'అభినవ తిక్కన' శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు,

తెలుగుపండితులు, అప్పికట్ల

దివి వారి కృష్ణకావ్యము
కవితాసౌందర్యమయము, కావున నేతత్
కవయిత రంగాచార్యుల
కవహిత మతివెల్వరింతు నభినందనముల్.

---

## శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు, కాకినాడ

ఈ కావ్యము నితరులు పఠించుతఱిc జాటుగనుండి శ్రవణించుచో బమ్మెర పోతనామాత్య కృత భాగవతము బఠింపబడుచున్నదను భ్రాంతికి లోనుగానివారుండరు. ఏమన నిందలి ప్రతి పద్యమునగల సమాసగ్రథనము ఆంత్యానియమపద్ధతి, భావము లందలి యనుకరణములును నచ్చముగా పోతనార్యునివే. అమిత ప్రసిద్ధుడగు పోతన కవీశ్వరు రచన కింత సాన్నిహిత్యముగలిగి గ్రంథమాద్యంతము నా కవయిత అడుగు జాడలలో నడచినదనుట నిక్కమగు మాట.

---

## శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు, హైదరాబాదు

ప్రాణాచార్య, శతావధాని రంగాచార్యులవారు - ప్రతిభావంతులయిన కవి పతంసులుగా గనబడుచున్నారు.

---

## 'అర్షవిద్యాభూషణ' శ్రీ జటావల్లభుల పురుషోత్తము, M. A.

సత్యనారాయణపురం, విజయవాడ.

శ్రీకృష్ణాభిమానసత్త్వము చదివినాను. మిక్కిలి హృద్యముగానున్నది.

---

'మహావిద్వాన్'

## శ్రీమాన్ పణ్డిత వేదాన్తం జగన్నాథాచార్యులు గారు,

తిరుపతి-తిరుమల దేవస్థానం ఆస్థాన విద్వాంసులు, అప్పికట్ల.

ఈ ఖండమును ఇక్షుఖండమువలె 'ప్రతిపర్వ రసోదయం' అనునట్లు రససంభితమై యలరారుచున్నది. శ్రీ శుకానుభూత భాగవత భావముల ననుభవించి భక్తిసూక్తుల మేల్కాంచి పేర్కొంచిన శ్రీ పోతనామాత్య కవియె యియ్యెడదల యూపపచ్చును. శ్రీకృష్ణకథామృతము సరసకవితామృతముచే నిబ్బడియై వెల్లివిరియుచున్నది.

---

'సాహిత్యరత్న', 'విద్యాప్రవీణ', 'విద్వాన్'
శ్రీమాన్ తి. కం. తిరువేంగడాచార్యులు గారు,
ప్రధానమంత్రి, సంస్కృతభాషా ప్రచారిణీ సభ, చిత్తూరు.

ఈ గ్రంథము చదువఁ జదువఁ జవులూరుచు కాదంబరీ రసజ్ఞైర్భ్యః కాశ కృష్ణాతిమానుషతత్త్వ రసజ్ఞులకు సరసులకు నీరసాహారముతోఁ బనిలేదనిపించినది. కవిత మృదుమై పృథక్పృథతావిశిష్టమయి ప్రసాదగుణశోభితమయి పాఠకుల కుబలాటము పెంచుచున్నది. కథాంశములు చర్వితచర్వణములుం గాక యనేక విశేషాంశముల తోను నూతనాంశములతోను గూడి ఎంతటివానికిని 'ఆహా!' పుట్టించుచున్నది. శ్రీకృష్ణునియందుగల యమానుషమహిమలను వారి రాజకీయములతో మేళవించి ప్రపంచించుటచే నీ గ్రంథము మరల మరల జదువవలయునను కౌతూహలమును గల్గించుచున్నది. శ్రీ ఆచార్యులవారు రససిద్ధిని గడించిన ప్రాణాచార్యులుంగాన వారి లేఖిని కావ్యమును రసమయ మొనరించుటయే గాక ఆంధ్రలోకమునే సాంద్రానందమున ముంచినది.

---

## శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, నెల్లూరు

ఈ గ్రంథమును పెక్కుపట్టులఁ జదివి మిక్కిలి యానందించితిని. శ్రీకృష్ణుని లీలలే ఆనంద జనకములు. ఆ లీలలు - రచయిత, శతావధాని శ్రీ రంగాచార్యులవారి రమణీయ రచనావిశేష రంజితములై ప్రతి ఘట్టమునను పరమానందము నందించుచున్నవి.

ఆస్తికత అంతకంతకు నడుగంటుచున్న యీ కాలమున కేవల శృంగార కథానికామయమైన యీ కాలమున, భగవత్కథా ప్రబోధములైన యిట్టి పవిత్రరచనలకు దొరకొన్న శ్రీ యాచార్యులవా రభివంద్యులు. పూర్వ కవిసంప్రదాయవిదులైన శ్రీవారి కవితాధార అనర్గళము. భావనిర్దుష్టము - రచన రసతుందిలము - శైలిమనోహరము. ఇట్లు సర్వలక్షణసంపన్నముగా బృహత్కృతి నిర్మాణమును నిర్వహింపగలవారు నేఁడందు అరుదుగా కనబడుచున్నారు.

---

శ్రీ గంటి శ్రీరామమూర్తిగారు, ఎమ్.ఏ.
ఇంగ్లీషు ప్రధానాధ్యాపకులు, ఏ. ఎమ్. ఏ. ఎల్. కాలేజి — అనకాపల్లి

శ్రీకృష్ణాతిమానుషతత్త్వము నేటి కావ్యములందు మేలికమైన రచన. కావ్యము యొక్క వస్తువు, ఆకృతివిశేషమునుగూడ మహత్తరమైనది. ఎఱ్ఱన, సోమన, పోతనాది ప్రాచీన కవిలలాముల కవితాశక్తిని జీర్ణించుకొనిన శ్రీ రంగాచార్యులవారి ముఖనిర్గత

మైన కవితాప్రవంతి యిది. శబ్దమాధుర్యము, సమాససౌందర్యము, వృత్తముల శీవి, ప్రాచీన కవ్యమకృతులు పోషణించుకొనిన యీ రచన హృదయంగమమై, రసవంతమై యలరారుచున్నది. భక్తిరసప్రధానమైన యీ కృతి ఆస్తికులకు కల్పవృక్షము. భక్తులకు తంగేటిజున్ను. కవులకు శ్రవణానందము. ఇది కవిత్వమా? తత్త్వమా? గహనమైన కృష్ణతత్త్వ మిందు సులభముగ ప్రతిపాదితమైనది. శీవిచే నిది కవిత్వమైనది. కేవలము కథాకథనమేగాక కథావైవిధ్యముగలచోట విమర్శకునివోలె కలియువానిని సంగ్రహించి సమన్వయింపజాలుట యీ కావ్యమునం దొక యపూర్వ విశేషము.

---

శ్రీ పోచిరాజు శేషగిరిరావు గారు, B. A.

సీనియరు తెలుగు పండితులు, పరిషత్ మల్టీపర్పస్ స్కూలు, సామర్లకోట.

రసభరితమ్ముగ కావ్యము
పసగలిగిన తెలుగు పలుకుబడులను వెలసెన్
మిసిమిగల కాంతి వల్లీ
విసరము బరపితివి కావ్యవీథిన్ సుకవీ!

ప్రాణము ప్రాణమై-మధుర భావనలో నొకమూసగట్టి, హృ
ద్వీణను మీటి, జీవితకృతిన్ రచియింపఁగఁ జేసె రుక్మిణీ
ప్రాణము-ద్యోధు నీ విమల రంజితమై యొసలార తెల్గు మా
గాణమునందు రంగకవి! కావ్యసుధామధురోక్తి కల్పనన్.

కవితకును జీవగఱ్ఱ మీ కావ్యఫణితి
మధురకల్పనలకు తావు-మణులప్రోవు
ధాత్రి శ్రీకృష్ణ తత్త్వపు దర్పణమ్ము
'దివి' జ కవివర్య! రంగసుధీమహార్య!

---

డాక్టరు సి. సుశీలాదేవి గారు, D. M. & S.

శ్రీ మహాలక్ష్మి నర్సింగ్ హెూమ్, అరండల్ పేట, గుంటూరు

"భూషణములు చెవులకు బుధతోషణము లనేకజన్మ దురితౌఘ వినిశ్శోషణములు మంగళతర ఘోషణములు గరుడగమన గుణభాషణముల్" అనిగదా! భాగవత వాక్యము. శ్రీకృష్ణపరమాత్మ నా ఆరాధ్యదైవము. అందును బాలకృష్ణుని లీలలు నా

కత్యంత ప్రియమైనవి. ప్రథమ ద్వితీయ ఖండములు చదువుచున్నంతసేపు రోమాంచ ఆనందించితిని. కొన్ని కొన్ని వేళలందు ఆనందబాష్పములతో మేను పులకరించు చుండెను. భగవంతుని కథలెంత చదివినను తనివిదీరదుకదా!

---

'ఆంధ్ర సరస్వతి', 'వాచాస్పతి', 'ఉభయ భాషాప్రవీణ'

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు, బాపట్ల

వర్తమానయుగమున ఇంతటి ప్రౌఢకావ్యము రసబంధురముగను సరసవచో విలసితముగను ముఖ్యముగా భగవల్లీలా మాహాత్మ్య ప్రచురముగను వెల్వడుట నిజముగ ఆశ్చర్యకరమే. అంతియేకాదు ప్రస్తుతపాత్రముకూడ. శ్రీ ప్రాణాచార్యులుగారు జగత్ప్రాణాచార్యుడగు శ్రీకృష్ణుని దివ్యవైవాహిక లీలాగాథలను ఆంధ్రసాహితికి ప్రాణమగునట్లు మనోహరముగను మంజులముగను రచించిరి.

---

'ఆచార్యశ్రీ', 'నటరాజ', 'నటశేఖర'

డాక్టరు శ్రీ చాగంటి సన్యాసిరాజుగారు, సామర్లకోట

భక్తిరసప్రవాహమున కేతమెత్తిన పోతనను ఈరచన తలపునకు దెచ్చుచున్నది. మీ హృదయము ప్రాచీనకవికృతములను జీర్ణించుకొని పుష్టినందినది......... కావ్య శయ్యారుచిరలు, లలితము. మీ కావ్యపఠిత 'నవ్యమంజు కలాపకనత్కలాపిజాల మీక్షించి శ్యామపింఛావ చూడుసోగునుమతి కెక్కు మిక్కిలి చొక్కిన లక్షణాకన్యా మణివలె తన్మయత నందితీరును. ఈ కావ్యము 'మంజులవిమర్శనాలాపనినదములు దెసల మసలి' కృతికర్తకుయుగము చేకూర్పగలదని భావింతును.

---

Sri K. V. N. అప్పారావుగారు, M. A.,

ప్రిన్సిపాల్, S. V. J. V. సంస్కృత కళాశాల, కొవ్వూరు

"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజం" అని చెప్పుకొనిన శ్రీరామ చంద్రునివలెగాక 'అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం' అని చెప్పిన శ్రీకృష్ణపరమాత్మ తత్త్వము అతిమానుషము. అది సామాన్యులకు దురవగాహము. దానిని సరిగా తెలిసికొననియెడల ప్రమాదమున కెక్కువ అవకాశముగలదు...... శ్రీకృష్ణుని పవిత్రచరిత్రమును హేతూపన్యాసపూర్వకముగా వివరించిన శ్రీ ఆచార్యులవారి కావ్యఖండములు రెండును తక్కినవాని కెమరుమాచునట్లు చేయుచున్నవి.

పలికెడిది కృష్ణకథనలను
పలికించెడివాఁడు కృష్ణభగవానుండర్
పలుకునది కృష్ణభక్తుఁడు
వలదే పొగడంగనిట్టి వరసామగ్రిన్.

---

శ్రీ నంబూరి శ్రీనివాసరావు గారు, M. L. A. ఏలూరు.

రంగాచార్యుల వారి కృషి అభినందనీయము. గ్రంథరచన చాలమంది చేస్తున్నారు. కాని మానవ అధ్యాత్మిక చింతనకు దోహదమిచ్చే ఈలాంటి గ్రంథములం వ్రాయువారు అరుదు.

---

డా॥ శ్రీ అడ్సుమిల్లి నారాయణరావు గారు, M. B., B. S.
అధ్యక్షులు, ఆంధ్రనలంద, గుడివాడ

—నా కింపుగ నుంట సాంతము పఠించితి నందలి మీ కవిత్వపుం సొంపులం సాహితీ పటిమ జూచితి మెచ్చితి......మీర లుద్దండులు కైతలో-కైతవిధాన మఖండము.—

---

పండిత శ్రీ పి. సత్యనారాయణరాజు గారు, విక్రమ విలాస్, తణుకు.

ప్రతిపద్యము రసోదయమై రమణీయార్థ ప్రతిపాదకమై తమ కావ్యము విరాజిల్లుచున్నది.

---

డాక్టరు శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు, ఎమ్. ఏ.,
ఉస్మానియా యూనివర్సిటీ హైదరాబాదు – ('ఆంధ్రప్రదేశ్ సమీక్ష')

శ్రీకృష్ణుని అతిమానుషతత్త్వము నిరూపించుచు రచింపబడిన యుద్గ్రంథ మీ శ్రీకృష్ణాతిమానుషతత్త్వము, ఆధునిక కాలమున వెల్వడుచున్న పెద్ద కావ్యముల సంఖ్య చాల తక్కువ. సంఖ్యేయములైన అట్టి బృహత్కావ్యములలో నిది యొక్కటి యని చెప్పఁదగియున్నది. పరిమాణము చేతనేగాక గుణవిశేషము చేతను వస్తుమాహాత్మ్యము చేతనుగూడ నిది సహృదయుల దృష్టి నాకర్షింపఁజాలు ననుటలో సందేహము లేదు......పోతనగారి భాగవతరచనవలె నేతత్కావ్యరచనయు భగవత్ప్రేరితమగుట దీనికొక ప్రత్యేకతను గూర్చుచున్నది—ప్రతిభా భక్తిసంపదలు రెండు నిండారియుండు

వారుకాక యన్య లిట్టికావ్యమును రచించుట యసాధ్యము. కథారచనమున కవిగారు చూపిన నేర్పు ప్రశంసనీయమయినది ... వారు శ్రీకృష్ణుని యతిమానుషతత్త్వమును సూచించుచు చేయుచుండు వివర్శ లీ కావ్యమునకు జీవగఱ్ఱలు. పాత్రచిత్రణమున ఆచార్యులవారు కావించిన నేర్పు పరిశీలింపదగినది. ఆచార్యులవారి వర్ణనలు గంభీరములు. సంభాషణలు సహజములును సరళములునై హృద్యములుగానున్నవి. ఆచార్యులవారి శైలి అతి ధారాళమైనది. కావ్యము శరీరాత్మల రెండింట నతి రమణీయమై యలరారుచున్నది.

---

శ్రీ బులుసు వెంకట రమణయ్యగారు, (భారతీ సమీక్ష)

"ప్రాణాచార్యులవారు మూలములోలేని రసోచితమైన మార్పులుచేసి తమ కావ్యము నొక రమణీయశిల్పఖండముగాఁ దీర్చి దిద్దినారు. ఈ కాలములో వెలుఁవడిన ఉత్తమ పద్య కావ్యములలో ఇది యొకటి."

---

శ్రీమాన్ విక్రాల శేషాచార్యులుగారు, కలికివాయి

అతిమానుషతత్వ మూచివా న్య
ద్దివి రంగార్య! భవాన్య దూద్వహాస్య
శ్రివణాంజలి సంపుటైః ప్రపేయం
రసికా నామమృత ధృవం త దేతత్.

కృష్ణస్య తత్వ మతిమానుష మంగలోకే
యుష్మత్కవిత్వమపి భా త్యతి మానుషం సత్
తస్యాఽనువర్ణల విధౌ వినియుక్త మేత
త్తత్పాదదత్త తులసీదళవ త్కృతార్థం.

---

శ్రీ గుండేరావు హర్కార్‌గారు. హైదరాబాదు

అలంకారాః ప్రాయశ్శోత్ర భక్తిభావైక పోషకాః
దృష్టా సమాసా బహులవః దీర్ఘాలిపి రసావహాః
ఆంధ్ర సాహిత్య సంసారే వైశిష్ట్య మిదమర్హతి

ప్రాధాన్యం భక్తిభావస్య రసానామపి యోజనా
సందర్భ సౌకుమార్యంచ త్రివేణీసంగమే మహా
దివి రంగాచార్యవర్యాః స్వకావ్యైర్మతిమాస్తిం
ప్రాణయంతీతి తే ప్రాణాచార్యా అన్వర్థసంజ్ఞవాః.

---

శ్రీ నిడదవోలు వెంకటరావు గారు,

( ప్లవ ఉగాది ఆంధ్రపత్రిక - శార్వరీ సాహిత్య వికాసము )

శ్రీకృష్ణుని మహిమలను నవీనకాలమున బహుకృతుల విమర్శించిరి. శ్రీకృష్ణ చరిత్రమున నీనాటి భావముల కొన్ని పొందుపడినవి. వానికొఱకు పౌరాణిక కథా సంవిధానము కొంతమార్పు చెందినది. వైయుక్తికమైన దృష్టిభేదము రుచిభేదము కారణముగా నవతరించిన ఈ మహాకావ్యము సందలి కవిత రసవత్తరముగా నున్నది.

---

'శిరోమణి' శ్రీ వేదాల తిరువెంగళాచార్యులు గారు

"తెలిసినకొద్ది వ్రాయునది హెచ్చు" అను సామెత కుదాహరణమైన యీ కాలమున నీ "శ్రీకృష్ణాతిమానుషతత్త్వము" వంటి కావ్య ముదయించుట నిజముగా నతిమానుషతత్త్వమే యనక తీరదు. ఏదో చెత్తచెదారములు గాలికి కొట్టుకొనివచ్చు నీ చచ్చుపుచ్చు విచ్చలవిడి తచ్చవలతో మెచ్చులెచ్చు కల్పనలతోడి యనల్పశిల్ప నైపుణ్యము "మనుష్యసంఖ్యామతివర్తితుంవా" యన్నట్లుగా సభ్యలోకైక పూరకము కాదా? ఈనాడు తలాతోకాలేని చీకాకు కాకులగోలమాలగోలగా నుండుటందరు నెరిగినదే. సత్కవిత కాలగోలు బాలగోలుగా నున్న యీ కాలమున నిట్టి 'ప్రసన్న కథాకలితార్థయుక్తి'తోడి యీ కవితయే యరుంధతి. అట్టియెడ తన పవిత్ర వీడకుండ, వీడకుండుటయే కాదు, మెరుగులదిద్దుచు, తన నాయకునిగూడ మెరయించుచు నిట్టి కవిత పవితకుగూడ మిగులు సొగసు పొసగించుననుటలో సందియ మెందుకు చిందును. 'పాప్మభ్యశ్చపునాతి వర్ధయతి చ శ్రేయాంసి సేయంకదా గంగేవమాతేవ చ' అని భవభూతి తన యుత్తరరామచరితమున నన్నట్లుగా భగవానుడగు శ్రీకృష్ణస్వామి దివ్యకథ అతిమానుష శ్రీకృష్ణతత్త్వసుధాలహరిలో ప్రవహించి తాపత్రయార్తుల కాసాద్యమైనది. తాపత్రయమును శాన్తింపజేయు నీ హరికీర్తిని భావతో గానమొనరింపజెల్లును గాని తదితరమును గాదనుటను "భాషాగానం న గాతవ్యం హరికీర్తిం వినాఽనఘ" యను శ్రీసూక్తియే ప్రమాణించును. శ్రీహరి నిట్లు ప్రసన్న గంభీరపదములతో

సుఖావహముగా గాన మొనరింప గావ్యబన్ధమగును (ప్రసన్న గంభీరపదాః కావ్యబన్ధాః సుఖావహాః) గాని వట్టిమాటలపోగు కవితగ్గైన నగునా? అర్థములేని పలుకుల కులుకులు అర్థములేని పొలతుల కులుకులే. ఏదైన, లేక, ఏమైన గొంత యర్థమున్నను సొగసు మిగుల నెవరవగోలయే. వట్టిమాటలపోగు వైదికపు ముత్తైదువయే. "పచ్చని చెట్టుక్రింద పిచ్చిక సమర్త్తాడినద"న్న ఆరవీస ౯ నత్తుతోడి కాసలనాటి వారి కనకాంగిని ఏ శ్రీనాథుడు మెచ్చును? రసమునం దుపకరింపని గుణమే రసికు నలరించును? రసభావములందు బర్యావసింపని దసలుగుణ పదమును స్పృశింపగల్గునా? తనకును బరునకును బ్రక్కవానికిని గూడ నొక్క యక్కరమైన నవగతముగాని అద్వైతపుటుపన్యాసమే సన్యాసికో దక్క దక్కినవారి లెక్కలో కెక్కగల్గునా? అంటి ముట్టని అనర్థకపు పలుకులు ములుకులట్లు కలుకుమనునేకాని తళుకు కనజాలవు కదా! "తేనెపోక నోరు తీయనయగు భంగి" గానివానినోరు తీరుకానివానినోరు తీపువలె నోరువబోరుకదా! బహిరన్తరముల భావములు మొలుచు ద్రాక్షాపాకములో నిలువనిదే కవిత యెట్లగును? అదియిక రుద్రాక్షపాకమే. రసైకరూపుడగు పరబ్రహ్మ నారాధించు వైష్ణవవిబుధుల కది రుద్రాక్షవలె నంటనైన ముట్టనైన దలపనైనను బనికిరానిదే యగును. అట్లుగాని కవిత తులసిదళమువలె తొలచి నొసగుల బహిరన్తరముల బరమానన్దమునే కాక పవిత్రతనుగూడ గూడించును. రుదురాకపాకములో అథవా "ఈకలబీకు పాకములో వాకులపోక కొత్తకుండలో గచ్చకాయలుపోసి త్రిప్పినప్పటి చప్పుడువలె చెవులను గొప్పగా త్రిప్పలు బెట్టుగల్గునేకాని ఒప్పుల కుప్పవలె మెప్పు కల్గించునా? "చెప్పవలె రసము చిప్పిల గవిత" యన్నదాని ననుభవించినపు డుప్పతిల్లవలె "అప్పప్ప! బళిబళీ" యను మెప్పుల చప్పుడులు. ప్రకృతములోని "శ్రీకృష్ణాతమానుపతత్త్వము" నందలి రెండవ ఖండములోని మూడవ యాశ్వాసము నొక్కశ్వాసముగూడ విడువకుండ జదివితిని. మొట్టమొదట నెట్టయెదుటి కొట్టి పుట్టు కవిత బేరము గిట్టుట పుట్టుక పున్నెపు గట్టిదనమే కదా! యని మదమెదవినది. 'కవిత' యన నిదికదా! ఇట్లుకదా ఉండవలెను! ఇట్లుకదా హృదయములరింపవలెను! ఇట్లు మలచినకదా లోకకథయు నౌపనిషదగాథయు బుధులసుఖల నవధరింపజేయ గల్గును! "తన్నెన్నక చిన్నజూచిన సహింపక యల్కవహింపగా" అప్తులీ యన్నల మిన్న కెట్లు కుశికాత్మజు కోపము వచ్చెనో" యనుకొందురట! ప్రాక్తనమగు ప్రకృతి జనాన్తరమందైనను విడువబోవదనియే కదా మాఘుడన్నది. "సతీవయోషిత్ప్రకృతి స్సునిశ్చలా పుమాంసమభ్యేతి భవాన్తరేష్వపి" అన్నాడతడు. ఇట లోకస్వభావము, ఉపనిషత్తుల పురాణములలోని విశ్వామిత్రుని స్వభావము, సత్యభామ స్వభావము ఈ త్రితయమును త్రివేణీ సంగమమువలె బవిత్రమై నారాయణపదమున నేగ్పడి

అతనిచోటికి జేరి తద్రసమయముగా బర్యవసించుచున్నది. సుధాధారాధారాళమగు కవితాస్రవన్తియు నిండుకు తోడ్పడగల్గి వెల్గుచున్నది. చూడుడు—

జనకుని యీప్సితమ్మెఱిగి సత్య, స్వకీయవివాహవృత్తముఁ
దనకెరిగింపకే ప్రకటనం బొనరించుట కల్గి తండ్రిపై
గినుక నిరాకరించె, జలకేళి, ప్రియాళి, వినోదనక్రియల్
వనకుసుమాపహార పరివారవిచార సువర్ణహారముల్. (౩. ౧౮.)

ఇచటగూడ కవితాధారతోబాటు, సత్యభామ స్వభావధారయు, విశ్వామిత్రుని కోపధారయు నిరర్గళముగా నేకీభవించి ప్రవహించుచున్నవి. "స్వభావో దురతిక్రమః" యందురుకదా! భావములు ప్రతియంశమునందును విస్తరించి ఉజ్జ్వల మొనరించుచున్నది. "భావోభావంనుదతి విషయాద్రాగబన్ధస్స ఏవ" అని పరిభావించుడు. ఈ భావములన్నియు నుజ్జ్వలములై శృంగారరస సద్విపసానమునొంది మనమనసుల సులభముగా నలరింప గల్గును. ఉజ్జ్వలరస (శృంగార) మున నుజ్జ్వలభావముల పరిణామమావశ్యకమే కాక స్వాభావికమును గూడ గదా! ఆ జాలంన కాధారము కథాస్రవన్తి. ఆ సూత్రము స్థాయి సూత్రము. అది బహుముఖముల విస్తరిల్లి యనుబద్ధమై అంతటను వ్యాపించి స్వాంశములతో బరస్పర పరిపోషమొంది రసపర్యవసితమైతీరును. ఈ తీరు వేరువేరు రసముల మేళనమున నొకవింతరసముగా బరిణమించి ఇక్షు క్షీర సితామృతాదుల మేళనమున నేర్పడు మధువు వలె రతిఫలమై "రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనన్దీభవతి"యను యర్థమును ప్రత్యక్షీకరించును. అపుడుకదా శబ్దము ప్రత్యక్షముగా ననుభవమగునది. ప్రకృత గ్రంథములోని అష్టభార్యల పరిణయపుకతలు షోడశసహస్రకన్యకలకు కితకితలు పెట్టినవి. భావములు రేగి వారిని తచ్చిస్తా విమలాహ్లాదముగ్ధల నొనర్చినవి. వారి సకరుణ ప్రార్థనము సవినయ శృంగారమున బర్యవసించి "సహస్రానేక నారీమణుల్ హృదయేశుండని శౌరిజేసికొని సంప్రీతిఁ సపత్నీత్వముఁ మదముఁ మత్సరముఁ దలంగెనుచుటల్ మార్మ్రోగె ముల్లోకముల్" ఈ మార్మ్రోగుట నారదునకు గలహశీలునకు త్రిలోకసంచారికి అవమానముగా దోచినది. అతని మనసు కలతతో నలతబెట్టినది. ఒక వనితకు (ద్రౌపదికి) అయిదుగురు పురుషులుం (పాండవులు)డుటవలన గలతలేర్పడుననికదా యితడొకని కొక యేడుగానడపె కలతలనుడిపి పాండవుల కేడుగడనైనది. ఇపుడు యిచట వేనవేలు వెలదులు ఒకనిని జేసుకొని "సపత్నిత్వాదికమును" వీడి సంప్రీతితో, నున్నారన్నచో తన కట్టడి యట్టడుగున బడి తాను గుట్టుచెడిగట్టయినట్లేకదా! ఏమనగా —

"జగములు పదునేడు నొక తెను
నగణితముగ నిద్దరైన నంబుధిపడకున్
ముగురాడువారు గూడిన
సుగుణాకర! పట్టపగలు చుక్కలు వొడుచున్

—గదా! ఒకరా? ఇద్దరా? ఇక్కడ పదునారువేలంపైన నార్గురు. అవీకాక ఇంకను ఎన్మిదిమంది. ఇదెట్టి కూడిక? అని, ముల్లోకముల గాలించపడదిరిగినను గనుపడనిదియు నెటను వినపడనిదియు నిది—యీ వింత యెంత కలతపెట్టెనో దీని గుట్టుగన్గొని రట్టు సేయ గట్టి పట్టుపట్టినాడు. అట్లు సేయనినాడు తనయునికి కునికినట్లై యనుకొనినాడు. నారదుడు శ్రీకృష్ణుని కాపురపు గుట్టుమట్టుల యట్టడుగుగట్టి తనము గనుగొన ద్వారకాపురము జేరి అన్తఃపురమునందలి పొందిక నరసితీరవలెనని అరసిమునివలె పట్టుబట్టి గట్టిగా వెదకినాడు కాని పాపము అతని కెచటనుగూడ నీ పదునారువేలలో కలతగన్పడలేదు. ఇక నెట్లు? నారదునకు గౌరవము నారదబ్బకాయకున్నంతమాత్రము కూడ నుండదా? గౌరవమంతయు నీరు కారిపోవలసినదేనా? అయితే ఇతనిని నారదుని—జ్ఞానదాతను కవిగానీ (డాక్టరు దివి. రంగాచార్యులు గారు) కవులకు గనియను (కవింకవీనాం) శ్రీకృష్ణస్వామిగానీ వానికానివానిని జేయబూనలేదు. అతని (నారదుని) తలపుగూడ మొదటి యెన్మిదిమందిలో అందులోను మొదటివారైన సత్యా రుక్మిణులలోతులో పాతుకొన్నది. ఆ లోతుపాతుల నారదు డరయుట పారిజాతాపహరణపు కథాఘట్టమునకు బీజమైనది. అంతేకాక ఆజోక ఆజోకగా వారిరువురేమి? సపత్నీమండల మంతటికిని గుండెలలోని చండిమను బోద్రోలి సామరస్యైకరస్యమును డిండిమప్రదండితో మెండుగా నిండించినది. ఇట్టి కథాభాగము లొకదానితో నొకటి పైనవైచుకొని పరస్పరము మూలమూలీభావాది ప్రమాలికతో విడువక కలియుటయే కాక ఆ యా ఘట్టములలో శృంగార కరుణ వీరరౌద్రాదిరసములు తమ తమ మతంబుల తమ తమ తలములతలను నలుగసరీవాహములతో సవరించి చివరకు అద్భుత రసాబ్ధిలో బర్యవసించి అట గురు తెరిగి సెజ్జనొరిగియున్న శ్రీకృష్ణుని అతిమానుషతత్త్వమును ప్రత్యక్షీకరింపజేయుచు గ్రంథనామమును సార్థకమొనరించుచున్నవి. ఇట్టి యీ గ్రన్థము సర్వేసర్వత్ర వాక్యార్థక వ్యంగ్యప్రధానమైన కథలవలన రసములు వ్యంగములగుటయు, వాని వాని పర్యవసానమున నద్భుతము పరిస్ఫూర్తి నొందుటయు యీ విశిష్టసమ్మేలనమున గథానాయకుని అతిమానుషత్వమును – వస్తువును సువ్యక్తమొనర్చుటయు నను నొక విచిత్రపుతోవ కావ్యములలో అతిమానుషతత్త్వముతోబాటు కవిలో గూడ అతిమానుషతత్త్వమును పరిస్ఫుట మొనర్చుచున్నది.

శ్రీరస్తు

శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీ కృష్ణాతిమానుష తత్త్వము

## ప్రథమాశ్వాసము


మదఖిలాండభాండమ
హామండన! భువనమండలాఖండల! దు
ర్దామదనుజఖండన! బ్ర
హ్మామరవిభుశివకిరీటమండితచరణా!

శా. "నా చారిత్ర సమాప్తిచేయకయ, విఘ్నాయత్తచిత్తుండవై
యోచింపంబనియేమి? తత్ప్రచురణోద్యోగంబు సాధించి నే
నాచంద్రార్కమొనర్తు నీకృతిఁ దదీయాంతర్యమూహించి సా
మీచీన్యామలమాధురీఫణితి నిర్మింపంగదే! కావ్యమున్.

కం. అను స్వప్నోక్తుల కలరుచుఁ
బ్రణుతించుచు నిందిరావరానుగ్రహశ
క్తిని మగిడి పూనితిని లే
ఖినిఁగొని, కొనియాడి హరిని గృతి సాఁగింపన్.

వ. దేవా! యవధరింపుము

# కథా ప్రారంభము

ఉ. ఖ్యాతమనోజ్ఞ దుర్గ పరిఘావృత వప్రవిశేషమై, వియ
ద్ద్యోతక చంద్రకాంత రచితోజ్జ్వల గోపుర సౌధహర్మ్యమై
శాతవిచిత్రరత్నకలశద్యుతి దిక్తటి నింపి క్రాలుఁ బ్రా
గ్జ్యోతిష సంజ్ఞ నొక్క నగరోత్తమ మైంద్రపురీంద్ర రూపమై. ౧

ఉ. ఆపురమేలు, "మేలుభళిరా! బలిరాయుని కీడు వీఁడు సం
తాపిత సర్వదేవదమనక్రియ విక్రమలీలలందు; నీ
ద్వాపర వీనిమార్కొ నెడు వారలు లే"రను ఖ్యాతిఁబొంది వృ
ద్ధీపతు లొగ్గి కొల్వఁ, బృథివీసుతుఁడౌ నరకాసురాఖ్యుఁడై. ౨

ఉ. రాజస తామసంబు లొకరాసిగఁ గూడిన మూర్తియో! సము
ద్భ్రాజిత శౌర్య విక్రమవతారమొ! నాఁ దలపించి సద్యశ
శ్శ్రీజయభాసురుండు, నతశీర్ష సురాసురభూసురుండు, ఘో
రాజి జితామరుండు, నరకాసురుఁ డేర్చు వృతాసురుండునై. ౩

చం. అతనికి సైనికప్రవరుఁ డర్మిలి సోదరుఁడై గురుండునై
హితపరుఁడై యమాత్యవరుఁ డిష్టతరుండు శివంకరుండు హృ
ద్గతచరుఁడై మురుండను నొకానొక చండతరాసురుండు గ
ర్వితరిపుభీకరుండయి చరించుఁ బ్రతాపధురంధరుండునై. ౪

మ. పరదేశీయ ధరామరాంగనల సంబాధించునే కాని యీ
నరకుం డేమనఁ డాశ్రితాళి; మురసేనానాథుఁడో! ఘోరము
ష్కరుఁడై ధర్మమధర్మమున్ నిజపరజ్ఞానంబు వర్జించి య
ర్థరతుండై పరిమార్చి పేర్చుఁ బ్రజ నిర్దాక్షిణ్యభావాంధుఁడై. ౫

సీ. సంకల్పమాత్ర దేవాంకుశుఁడౌచు ది
గీశ బృందముల బంధించి తెచ్చుఁ
గనుసన్న నేచి యఖర్వ సర్వంసహా
సకల సంపద్రాశి సంగ్రహించు

భావమూహించి దుర్భావుఁడై సుందర
కన్యామణులఁ బట్టి కారనుంచు
సంతుష్టిఁ గనఁ బతి సంయమి యజ్ఞహ
విస్సు హరించి యర్పించి మించు

గీ. ఉర్విసురలచేఁ జేయించు నూడిగంబుఁ
జొచ్చి సాధువాటికలందుఁ జిచ్చుఁ గొలుపు
నరకభూజాని సేనాని ఖరకృపాణ
పాణి భువన హాని మురదుర్మాని పూని! ౬

కం. మురుఁడను పేరు విన్పడిన మ్రాల్గు ధరాధరకోటి; ధారుణీ
సురతతి కంపమందుఁ; బ్రజ క్షోభముచేఁ దలక్రిందులౌ; మునీ
శ్వరులు సురల్ కలంగుదురు భ్రాంతిని; సూరులు నాత్మ నెంతురీ
మురు నెదురించి త్రుంచ హరి పుట్టఁడె లోకహితాభికాంక్షియై? ౭

కం. నరకువశంకరుగాఁ గొని
పరిపీడకుఁడై జగంబు బాధించుచు నా
మురుఁడు దురాసదుఁడై భీ
కరుఁడై యఘభరుఁడు తాపకరుఁడై పొలిచెన్. ౮

మ. నిజభూజాని సురాధినాథుఁ జలుపన్ జింతించి దండెత్తి యిం
ద్రజయంతాదులఁ బాఱఁద్రోలి, సురసామ్రాజ్యంబు నిర్జించి ది
గ్విజయ శ్రీకరుఁడై మురుండు సకలోర్వీజైత్రుఁ గావించెఁ బం
కజగర్భాప్త వరప్రభావగతి నాత్మోపుత్రు సుత్రామునిన్. ౯

గీ. అమ్మ భూదేవిచేఁ దనయంత మొఱఁగి
"శ్రీహరినిఁ దక్క నొరులఁ గారింపు"మనుచు
నరకసురవైరి మురున కానతి యొసంగఁ
దలఁగి విరమించె ద్వారకాదళన చింత. ౧౦

చం. నరకసురారి చొచ్చె శ్రవణశ్రుతదిక్కిబిడారిశోకముల్
బరపరిపీడితాకులిత ఘర్జితవర్జిత నాకలోకముల్
బరివృతనిస్వనచ్చటుల నాద దివాంధ సృగాల ఘూకముల్
నిరసితమానినీ సురధునీ మునికల్పకశాఖి నాకముల్. ౧౧

మ. సురనాథాలయమున్ పురీసదనముల్ శోభావిహీనంబులై
వరితృప్తింగడియుంపఁ జాలమి మనోవ్యాలోలుఁడై తద్వనాం
తర కాసారసమీప ధర్మమయ సౌధప్రాంగణోద్యాన సుం
దరరత్న స్థగితోచ్ఛ్రితాసనమునం బ్రావిష్టుఁడై తుష్టుఁడై. ౧౨

మ. మురసేనాని బిరానఁ జేరి యిటు భూపుత్రుండనెన్ "శ్రీపురం
దరహృద్వాసిని సద్విభాసిని సువిద్యాభూషణిన్ జారుసుం
దరసంభాషిణి, నూర్వశిన్ రసికనాథాగ్రేసర ప్రేయసిన్
బరికింపం దలపాయె, సుంతపిలిపింపన్ రాదె సేనాపతీ!" ౧౩

చం. అని నృపుఁడానతిచ్చిన మురాసురుఁడంతటఁ బిల్చి భృత్యునొ
క్కనిఁ 'గనియూర్వశిన్ గొని యెకాయెకిఁ దె'మ్మనిపంప నాతఁడున్
గనకని పోయి యాపెనుఁ జెకాచెకఁ జేరిచి భూమిజాని కన్
సనఁ జనె నాభటుండు జలజాక్షినిడించి పరాకు చెప్పుచున్, ౧౪

ఉ. బెబ్బులితార్కొనన్ బ్రిదిలి భీతిని గుండెలు ప్రీల నిల్చి త
బ్బిబ్బులఁజూచు లేడివలెఁ బిన్నతనంబువహించి యెంతయో
యెబ్బెరకంబు దిగ్భ్రమణ యేవయు ముప్పిరిఁగొన్న యుల్లమం
దబ్బురపాటుఁగూర్చి నడయాడదు లేమ పసిండిబొమ్మయై. ౧౫

కం. నరకుండు లేచి మెల్లన
దరహాసద్యుతులు మోముఁదమ్మి నిగుడ్పన్
దరిసి, లతాంగిం గనుఁగొని
పరిహాసక పరిచయముల భాషించె నిటుల్, ౧౬

మ. "లలనా! నీవొక ముద్దరాలివలె నేలా కన్నుఁ బ్రామంగ? నీ
కులుకుంగల్కితనంపుఁ దళ్కులును నాకుంజూప సిగ్గేల? తొ
య్యలి! నీజాణతనంబు లోకవిదితంబౌఁ గ్రమ్మినన్ బెన్మొగుల్
దెలియంబోలదె నిండువెన్నెలల లాలిత్యంబు? చంద్రాననా!" ౧౭

చం. "మగఁటిమిఁదూలి పోరి మొనమార్కొనఁ జాలనితొత్తు నీకుఁ బెన్
మగఁడుగదా! పురూరవుఁడు మానవమాత్రుఁడు నీప్రియుండుగా!
మగసిరి విక్రమక్రమణమాన్యత నన్నెదిరింపఁ జాలు నే
మగఁడుగలాఁడొ? యింత యనుమానమ దేల? వచింపరాద టే!"

మ. అను నాత్మస్తుతి నన్యనిందలకులోనై కామలోలుండు దు
ర్జను భూపుత్రునిపాటుచూచి యమరాచార్యుండు గోప్యంబుగాఁ
దనకుం దెల్పిన బోధయున్ స్మృతికిరా, ధైర్యంబుఁ బూరించి యా
తనితో నా నెఱజాణ యిట్లనె సుధాతారుణ్యా ధీరోక్తులన్. ౧౯

శా. "బావా! పౌరుషశాలి నేడొకఁడు సంప్రాప్తించుటం జేసి నా
భావంబుల్ ఫలియించె; నిశ్చయము నాభాగ్యంబె భాగ్యంబు; బా
వా! వారాంగన నొటఁ బణ్యమొకటిన్ వాంఛింతుఁ, జేకూర్చి యా
భావంబున్ నను నేలికొమ్మిది స్వభావంబెన్న మావృత్తికిన్".

సీ. "నీకృపాకలన ననిందిత దివ్యహా
ర్మ్యనేకమింట నేనడుగఁబోను
ప్రాక్తనభవగతిఁ బ్రాప్తించె ధనధాన్య
చేలముల్ వాని యాచింపబోను
దైవవశంబునఁ దార్కొనె నణిమాది
సిద్ధులు వానిఁ గాంక్షింపఁబోను
యాదృచ్ఛికముగ నాకబ్బె మహైశ్వర్య
కోటిసుంతయు దాని గోరఁబోను

గీ. కాని సతతానుభోజ్య సంకలితమైనఁ
దృప్తియిడదు యోగీశ్వరోద్దిష్ట వేద
మంత్రపూత నిర్దిష్ట హోమాగ్నివచిత
నవ్య సవన హావిర్భక్షణంబువలన." ౨౧

కం. "శతయాగ హావిర్భక్షణ
గతిగలిగిన పిదప నిన్నుఁ గలియుదు; నాకీ
వ్రతమును జెల్లించి మనః
పతివై చిరసౌఖ్యమిమ్మ పావనచరితా!" ౨౨

ఉ. నా నలినాయతాక్షి వచనార్థగభీరత, యించుకేని త
న్మానసమం దెఱుఁగక క్షమాసుతుఁ డిట్టనె "సుందరీ! వరి
జ్ఞానములేక కోరితివె స్వల్పము? బొగ్గులఁ గల్పశాఖి న
జ్ఞాని స్తుతించి కోరినటు, నాకొక లెక్కయె యాగహవ్యముల్!"

కం. "నీవడిగిన యర్థము నా
సేవకులే కూర్చి తృప్తి చేసెద రికఁ నే
నావలఁ గలిసెదనుమ్మా
భావజకేళీవిలాసభావమున సఖీ!" ౨౪

చం. అని మురదైత్యునిన్ బిలిచి "యంగనకిచ్చి హవిశ్శతంబులన్
దనుపుము; యంతదాఁక సురధామము సౌఖ్యమొసంగలేమికై
చనెద మదీయపత్తనము; సైనికనాయక! యిందనిల్చి పా
లనమొనరింపు" మంచుఁ జనె లాలసమొప్ప సురారియంతటన్.

మ. అని సందిచ్చిన పాటునన్ మురుడు గర్వాంధుండు చాటించె "నే
మునియే, భూసురుఁడే, మఱెవ్వఁడయినన్ ముమ్మం దపృధ్వీసుతున్
దనుపన్ జేయని యజ్ఞకర్మములు విధ్వంసంబు గావించి కా
ల్తు" నటంచున్ భువనత్రయంబునను గ్రుద్ధుండై యసంబద్ధుఁడై.

వ. నాటంగోలె మురాసురుని యాజ్ఞ శిరసావహించి గూఢచారులు మున్యాశ్రమసీమలందును విప్రవాటికలందును, దపోవనోపాంతంబులను సర్వవ్యాపకులై మూఁగి డాఁగి యున్నంత – ౨౭

మ. ఎవఁడే నెచ్చట నేని గూఢగతిమై నెట్లో ధృతిన్ బూని, యే
సవనంబో తలపెట్టి దీక్షితుఁడుగా సాక్షాత్కృతిన్ గూర్చె యా
భువనద్రోహి మురాసురానుచరు లున్మూలింత్రు యాగక్రియల్
దివిజారిన్ నరకాసురున్ గొలిచి తృప్తిన్ గూర్చుచున్నన్ దొలిన్.

సీ. మీసలు గడ్డముల్ మాసి పెంజెట్టుకుఁ
ద్రాటఁగట్టినను నేర్పాటు విడరు
దంతముల్ బెఱికి నోరంత మాంసముదూర్చి
వ్రేలాడఁగట్టిన విధులవిడరు
కల్లువెల్లువజల్లి చల్లార్చి హోమాగ్ని
దండించి తగిలినఁ దగులు విడరు
యజ్ఞపదార్థంబు లాగడం బొనరించి
కాల్దన్ని చిమ్మినఁ గడఁక విడరు

గీ. సకలదేవసంప్రీత కంజాసనాస్య
నిర్గతోత్కృష్ట పావన నిగమయుక్త
శస్త్ర ఋస్వ్యతయజ్ఞదీక్షాధిరూఢ
సిద్ధ పరిశుద్ధ బుద్ధి ఋషిప్రవరులు. ౨౯

చం. ఇటు నరకాజ్ఞ నామురుఁడు ఋగ్విదులన్ మఱి వేదధర్మవి
స్ఫుటపథగాములన్ మునుల సూరివరేణ్యులఁ బట్టువట్టి సం
కటమొనఁగూర్ప వారు పెనుగాసిలి తాలిమిఁగోలిపోయి యు
త్కటపరిపీడితాత్ములయి కంజదళాక్షు స్మరించి రిమ్ములన్. 30

చం. స్మరణకరా మురారి, నిగమాగమమార్గవిహారి, శౌరి, వి
స్ఫురదురుచక్రధారి, దితిపుత్రవిదారి, పరోపకారి, సం
గరవిజితారి, సూరి, సురమానిమహార్తినివారి, యెంచిరా
హరిపురిఁజేరి సత్యగతి నార్తియుఁ జక్రికి విన్నవింపఁగన్. ౩౧

ఉ. ఇంతకుమున్నె దేవవిభుఁ డింద్రుఁడు గోల్పడి స్వర్గభూమి దు
ర్దాంతనిరంతచింత హృదిఁ దార్కొని దుస్సహమానవంత దై
త్యాంతకు నొద్ద కంపెను యథార్థము దెల్పఁగ మాణిభద్రు న
త్యంతముఁ గూర్చు నొక్కభటు నాదట ద్వారకకేఁగ నమ్రుఁడై.

గీ. వ్యోమయానాధిరూఢుఁడై పోయిపోయి
ద్వారకాపట్టణముఁ జేరి త్వరితగతిని
మాణిభద్రుండు వీధులు మాడువులును
దాఁటి శ్రీకృష్ణసదనంబు దరిసినంత. ౩౩

కం. హరి యెఱిఁగి మాణిభద్రుఁడు
హరిహయుచేఁ బంపఁబడుట, స్వాగతమిడి సుం
దిరసీమకుఁ దోడ్కొని రాఁ
బరమాప్తుని భృత్యు ననిపెఁ బరమప్రీతిన్. ౩౪

కం. భటుఁడరిగి స్వామిసౌధ ని
కటసీమను మాణిభద్రుఁగని యెదురై ప్రా
కట భక్తిస్వాగతంబిడి
"యిటులిటు"లని చేర్పఁ గృష్ణగృహముఖసీమన్. ౩౫

మ. మణిరత్నస్థగితప్రభారుచిర హేమాంచత్సభామందిరాం
గణ మధ్యంబున మాణిభద్రుఁడు సుధర్మాపీఠి దర్శించెఁ బా
వన సమ్మోహన వేషు, మంజు మృదు సంభాషున్, మణీంద్రస్ఫుర
ఘనభూషున్, బహుమన్మథప్రకృతి సంకాశున్ త్రిలోకేశునిన్.

కం. దర్శించి బత్తిఁ బ్రణమిలి
పార్శ్వంబున నిలిచి మాణిభద్రుఁడు చింతా
కర్శిత సురపతిగతి నా
దర్శప్రాయోక్తి నిటులఁ దడఁబడ కనియెన్. ౩౭

శా. "దేవా! పర్వతకందరస్థితుఁడు నుద్వేగార్తిఁ జింతార్తుఁడై
శ్రీవిన్ గోల్పడి భుక్తికై నెమకుఁ గుంఠీభూతచేతస్కుఁడౌ
దేవేంద్రుండు; తదీయభృత్యుఁడను నే; దృష్టంబు సర్వంబు నా
యీవిజ్ఞాపన మాలకింపఁగదె! శ్రీకృష్ణా! జగత్పావనా!" ౩౮

ఉ. "మాకడగండ్లు దుర్భరము; మమ్మొక యొద్దునఁ జేర్పకున్న ని
ట్లాకలముల్ గ్రసించి గిరులాటవులన్ జరియించి జీవముల్
సాకుట కల్ల; మర్త్యగతి సాధ్యమయేని యొసంగుమన్న! లో
కైకశరణ్య! నీ వెఱుఁగవా గతిమాలిన మాయుదంతముల్!" ౩౯

కం. అని యవనతవదనుండై
కనుఁదోనలను బాష్పవారి కణములు దొరలన్
వనజోదరు పదమంటెను
మణిభద్రుని లేవనెత్తి మధుమథనుఁ డనెన్. ౪౦

ఉ. "కాలము దీఱె; భూసుతుని కైతవనాటక ఘట్టమెంతయో
కాలము పట్టఁబోదు; సరికాలము దార్కొనితీరు; నేల వ్యా
లోలత దేవరాణ్మణికి? లోకములన్ సహజంబులౌను గ
ష్టాలు సుఖానుబంధములు; జాబిలి సంక్షయ వృద్ధులన్ బలెన్.

కం. "లెమ్మా! మణిభద్రా! వే
పొమ్మా! విబుధేంద్రుకడకుఁ బోయి యిటుల వా
క్రుమ్మా! "శుభోదయం"బని
నెమ్మనమున దిగులు విడిచి నెమ్మదిఁ గనుమా!" ౪౧

మ. అని పంపించిన మాణిభద్రుఁడు మహాహర్షంబుతో శౌరి వీ
డ్కొనుసంతన్ హరిమందిరాంగణమునన్ గోలాహలంబొప్పఁ బెన్
ముని సంఘంబులు బార్లుదీరి నిలువన్ గోపాలుఁ డీక్షించి యా
త్మ నిజోదంత మెఱింగి వెల్వడియె హర్మ్యద్వారమున్ నమ్రుఁడై.

చం. వినమితగాత్రుఁడై గృహము వెల్వడి వచ్చి మునీంద్రపాళికిన్
వినయముభక్తిగౌరవమునింపుచుఁ గేలు మొగిడ్చి మ్రొక్కి "యో
యనఘవరేణ్యులార! నరకాసుర బాధితులార! మీతపో
ధన మది రిత్తయౌనె? పరితాపముఁ బాపముఁ బాపకుందునే!"

కం. "మీ యాశీఃఫలమున నే
నా యసురచేష్టితముల నడగించెద; మీ
చేయూఁత యున్నఁ జాలును;
మీయానతి నడచుకొంటె మేలుంగలదే?" ౪౫

శా. "మీ యాజ్ఞా పరిపాలనక్రమణ సామీచీన్య భాగ్యంబు; వి
చ్చేయంబోలునె మీర లిచ్చటికి? మీ చేసన్నరానే! కృపన్
జేయన్ వచ్చితిరింతె కాదె!'' యనుచున్ హృష్టాత్ములం జేసె నా
మాయాజాలకపండితుండుచితసన్మానక్రియాకల్పనన్. ౪౬

కం. ఇటు సత్కరించి మునివర
పటలము వీడ్కొలిపి, నరకవధ నెఱవేర్పన్
ఘటికను బ్రతీక్ష సేయుచు,
దటుకున నొక దివసమందుఁ దరలఁ గడఁగినన్. ౪౭

గీ. మాణిభద్రుని రాకయు, మానివరుల
పోకడయు, శౌరిపెన్ గాక, సోఁకఁ జెవుల
వీఁక సాత్రాజితీదేవి లోకనాథు
ముందు కరుదెంచి ప్రణమిల్లి మోకరించి, ౪౮

మ. అనఁ బాదద్వయి నంటి యిట్లు, "యదునాథా ! భక్తమందార! నీ
చనువున్ బ్రేముడి నండఁ జేసికొని యాశావేశతన్ వేఁడి కొం
దును; యుష్మద్రణకేళికా ప్రళయభీమోదగ్ర రౌద్రాకృతిన్
గనులన్ గూర్చి కృతార్థఁ జేయఁగను, సాక్షాత్సర్వలోకేశ్వరా !"

శా. "మీ సౌందర్య విలాసహాస శశిరశ్మిచ్ఛాయలన్ గూడుచున్
మీ శృంగార మనోజ్ఞమూర్తిఁ బెనుగల్మిన్ జూఱగొన్నాను; గో
టీశాన ప్రతిమాన ఘోరరణవాటీ భీషణాకార చే
ష్టా సామాన్య విభూతిఁ జూపి పరితుష్టప్రాప్తిఁ గావింపవే!" ౫౦

కం. అని వినమిత వదనంబునఁ
బ్రణమిల్లిన నెత్తి సత్యభామాలకముల్
బుణుకుచు యదునందనుఁ డి
ట్లనియెన్ మాధుర్యపేశలాలాపములన్. ౫౧

మ. "రమణీ! కొండొకనాటి రేయి ననుగోరన్ నాకు సారథ్యమున్
సమరక్షోణి వహింప, నట్లయని నే సంప్రీతితో నంటి; నీ
సమరం బెట్లొ పరీక్షకై కలిగె; నీ సామర్థ్యమున్ జూపి దు
ర్ధమవై తేశు నెదుర్కొనం దగును; సత్యా! సిద్ధమై రాఁగదే!".

మ. అని భర్మస్ఫుటవర్మ్మముల్ దొడిగి దివ్యాస్త్రాసిశస్త్రాదులన్
దోనలన్ గూరిచి సింహమధ్యములకున్ హొంబట్టుదట్టీలఁ జు
ట్టి నిబద్ధోద్ధతధర్మ్మపాణులగుచున్ ఠీవిన్ శిరస్త్రాణముల్
గణనాతీతములై వెలుంగ గుణకల్పవ్యాప్తి దిగ్భేదిగా. ౫౩

చం. రథమును సంతరించుకొని రా, భటుఁ డొక్కఁడు, సత్యభామ సా
రథియయి లాగిపూన్చెఁ బెనురథ్యములన్ గడునేర్పునన్ మహా
రథికుని రూపుదిద్దిన మురారి బిరాన రథస్థుఁడైన నా
రథమధిరోహమున్ జలిపె రామ కరంబులఁ బట్టి పగ్గముల్. ౫౪

ఉ. మాగధవందిబృందములు మాధవ లీలల సన్నుతింపఁ, బు
న్నాగులు భోజయాదవు లనంతముగా వెనుముట్టిరా, పురం
ధ్రీగణ మాఁగి సౌధతతి నివ్వళులీయ, మృదంగతూర్యభే
రీగుణరావముల్ మొరయ శ్రీహరి వెల్వడె జైత్రయాత్రకై. ౫౫

ఉ. దూతను మున్నె పంపెను యదూద్వహుఁ డాసురవైరి పాలికిన్
"ఏతదురాగతుండయి వివేకముతోఁ జరియింపకున్న సం
ఘాతమృతిన్ గనంజనుట కార్యమటం" చని చాటిచెప్పఁ; బ్రా
గ్జోతిని జొచ్చి దూత మధుసూదను సూక్తు లెఱుంగఁ జేసినన్.

మ. పృథివీపుత్రుఁడు క్రోధ ఘూర్ణితచలద్భ్రూగ్రోచులన్నింపి స
ర్వదిగంతంబుల నట్టహాసమున సంభాషించె నీభంగి "నా
కెదురే కృష్ణుఁడు గిష్ణుఁడున్! సకలలోకేశుండ నేనేడ? నా
యదు గోమాయువదేడ! భీతిల కుపన్యాసంబు సాఁగించుటన్."

కం. "చూతము రమ్మను పోరికి
భూతంబులు పోతరించి మొరసెడి; నిదె వి
ఖ్యాతి నొకవ్రేటునన్ బలి
వైతును హరిగిరిని వాని బలఁగము ననుమీ." ౫౮

మ. అని దూతం దరలించి క్రోధమునఁ దైత్యాధీశుఁడు గ్రాహవాం
గణ సన్నద్ధత నిల్చి యామురున కాఖ్యానింప నీవార్త భృ
త్యుని బంపెన్ భటయుక్తుఁడై మరలిరా నుత్సాహమున్ గూర్చుచున్
రణరంగంబున దైత్యులన్ నడపి జైత్రప్రాప్తి సేకూర్పఁగన్. ౫౯

కం. మురుఁడెఱిఁగి యాయుదంతము
సురపురి విడనాడి సైన్యశోభితుఁడగుచున్
దరలి నిజనాథు నానతిఁ
బరిరక్షకుఁడగుచు సేనఁ బన్నె ననిమొనన్. ౬౦

ఉ. ఇంతటిలో ముకుందుఁడు దరించి పయోధి నదీవనాద్రిదే
శాంతరముల్, గమింప నరకాసురభూధవ రాజధాని, దే
వాంతకుఁ డాముఱుం డెదిరి యచ్యుతు దాఁకి భటాళిఁ గ్రమ్మ దు
ర్దాంతశితాశుగంబుల ధరాగగనంబులు గప్పి పుచ్చినన్. ౬౧

చం. తిమిరపరీతమై నిగిడి దిక్తతి యాదవసైన్యమెల్ల ది
గ్భ్రమగనఁ బాంచజన్యము మురారి ముఖంబుననిల్పి యూఁది ధ
ర్మమున శరంబు గూర్చి నియమంబున నేసిన తూలి వాసి యా
తమము విభిన్నమై తలఁగె ధైర్యమునింప యదుప్రకాండముల్.

మ. సురవిధ్వంసి మురాసురుం డలిగి రక్షోమాయ వర్షించె ని
ష్ఠురతీవ్రాశ్మకఠోరవర్షమును, సంక్షోభించుచున్ యాదవుల్
బరువన్ దిక్కుల విష్ణుమాయ హరి యావర్షంబు వారించి యా
మురు నొప్పించి కలంచె, సంధిత ధనుర్ముక్తేషు ధారోద్ధతిన్. ౬౩

కం. కలగుండువడియు హృది భీ
తిల కసురప్రవరుఁ డోర్చి ధృతిమతియై ని
స్తుల సమ్మోహనవిద్యా
బలమున మోహమున ముంచె వైరిబలంబున్. ౬౪

మ. నిజతేజోనలదీప్తి యాదవుల నున్నిద్రాత్ములం జేసి సా
మజయూథంబు రచించె రక్కసులసమ్మర్దింగాఁ జక్రి యు
ర్విజుసేనాని మురుండు చిత్రగతిఁ బారింద్రాళి గల్పించి య
గ్గజ సంఘాతముఁ బాఱద్రోలె నిజవిఖ్యాతంబు ద్యోతంబుగాన్.

కం. ఇటులా సురమాయావి
స్ఫుటచర్యకుఁ దరుణమిచ్చి పురుషోత్తము డా
కటకప్పాల దూలెడి నిజ
భటపటలము గతిఁ దలంచి పదవదినమునన్. ౬౬

చం పంపి సుదర్శనంబు పరిపంథి కుమారక దర్శనంబు నై
లింప నిదర్శనంబు మురళీధర విక్రమ దర్శనంబు, స
త్యంపుఁ బ్రదర్శనంబు, చటులాఘ నిశాచర కర్శనంబు, నా
కంపనమొందఁ ద్రుంచె మురకంధరముర్విఁబడన్ దదంగముల్. ౬౭

మ. మురసంహార మెఱింగి భూసుతుఁడు సమ్మూర్ఛాగతుండై మురా
సురవిధ్వంసి నిజాసుహర్తగమనస్ఫూర్తిన్ విలోకించి త
స్కరలీలన్ దలదాచుకంటె రణరంగక్షోణి మారొడ్డి యా
హరి సామర్థ్యముచాటి మేన్ దొఱగు టర్హంబంచు నుద్యుక్తుఁడై.

చం. కదలిచనెన్ ధరాసుతుఁడు కార్ముకమార్గణముల్ ధరించి సా
రథిగొనిరా శతాంగమును రథ్యములం దగిలించి దాఁటి రా
ట్పథములు దుర్గముల్ గడచి ద్వారములన్నిటి నుత్తరించి సా
యుధ పటుఘోర సైనిక మహోగ్రరణస్థలికిన్ నిరాశుఁడై. ౬౯

ఉ. చొచ్చె మృధాంగణంబు మధుసూదనుధాటికి నిల్వలేక వె
న్నిచ్చిన యాత్మసైనికుల నేరుపడన్ మరలించి దిక్కులన్
విచ్చిన వారిఁ జీరి రణభీరువులన్ బురిఁగొల్పి యిట్లు వా
క్రుచ్చె మురారి కట్టెదుటఁ గోపముతో నెదురై హుటాహుటిన్.

ఉ. "గొల్లల కొంపలన్ వెరిగి గొల్లెతలం గనుఁబ్రామి ఘోష ఘో
షిల్లఁ జరించి రాజు ననిపించుకొనం బలుగాకిమూక సం
ధిల్లఁగ వచ్చినంతనె మదీయులు నీవు తరాజువౌటఁ దా
రుల్లమునం దెలుంగరె? సురోన్మథుఁ డుర్విసుతుండు" గోపకా! ౭౧

ఉ. చక్రి ధరాసుతుండు భటచక్రముఁ బర్విడకాఁపినిల్పి యు
ద్ధక్రియ కున్ముఖత్వము పదంపడి కూర్చుటఁ జూచి వాని దో
ర్విక్రమ సాహసక్రియలు రేఁగ శరాసనమెత్తి దర్పితా
వక్ర పరాక్రమక్రమణ బాణపరంపర నాఁటె నెమ్మెయిన్. ౭౨

గీ. దండతాడి తోరగలీల మండిపడుచు
చండ శుండాలమట్లు దోర్దండ మెత్తి
గండుమగఁటిమిఁ బెను గదాదండ మొండు
పుండరీకాక్షుపై నరకుండు విసరె. ౨౩

కం. నగవున గద హరియొక యా
శుగమున దెగ నేసి తొడిగి సుగమముగను నా
శుగ వింశతి గురిపించి నఁ
బగతునిపై నంత నరకపతి బిట్టలుకన్. ౨౪

ఉ. సైఁచి శితేషువేదన యచంచలుఁడై పదఘట్టితోగ్రమాఁ
ద్రాచు విధంబునన్ నెగసి దండడిఁ గార్ముక మెత్తిపట్టి చే
సాఁచి ధరానభోంతరదిశాంతరముల్ విశిఖమ్ము లల్లుచున్
దోఁచి ప్రచండదండధరుదుర్దయదుర్ణయనిర్ణయాకృతిన్. ౨౫

మ. ధృతి సంధించి రణోన్ముఖుండగుచు నుద్రేకుండుగాఁ జూచి శ్రీ
పతి లీలాగతి నేసి బాణతతి బర్వన్ దిక్తతిన్ నిల్ప భూ
సుతచాపోద్గతభూనభోవృతశరాక్షుద్రప్రవాహోద్ధతిన్
స్తుతియింపన్ యదుసైనికుల్, రిపులు నస్తోకార్భటిన్ వ్రీలఁగన్.

శా. నిస్తబ్ధుండయి సుంత తృళ్ళిపడి క్షోణీసూనుఁ డుద్రిక్తరా
ద్రస్థాయిం గని మంత్రపూర్వక మహాస్త్రంబేసి సమూర్ఛితా
వస్థుండౌ హరిఁ గాంచి గర్వమున నార్వన్ సత్యసామర్థ్యశౌ
ర్యస్థైర్యప్రతిభల్ వెలుంగఁ బతి సంరక్షింప నుద్యుక్తయై. ౨౨

సీ. అరిఁ జురఁజురఁజూచి కఱకుటమ్ముల వైచు;
హరి వాఁడిచూపుల మరులు గొలుపు;
దుర్నిరీక్ష్యాననద్యుతి వైరి వేధించు;
హాసచంద్రికల నోదార్చు ప్రియుని;

గుణధనుష్టంకార గణన శాత్రవు నొంచు;
సరససల్లాపాబ్ధి సఖుని ముంచు;
ప్రళయరుద్రాణియై పగతు నల్లాడించు;
శృంగారలీల లాలించుఁ పతిని;

గీ. కలికి యాసురు నెఱుల చీఁకట్లు ముంచు;
మగని నీలాలకాళి బెన్ వగలఁ దేల్చు;
ఖండితనిశాచరస్తోమ కదనభీమ;
సత్య పతిభక్తిగుణధామ సత్యభామ ౭౮

మ. అదలించున్ బరసైన్యసంచయము; సింహారావవిస్ఫూర్తిఁ గ్ర
క్కదలించున్ రథరథ్యవీరుల నసంఖ్యాకాస్త్రధారాగతిన్;
విదలించున్ మదకుంభికుంభవితతిన్ బీభత్సశస్త్రోద్ధతిన్;
వదలించున్ సతి వైరివన్నిగడలన్ సామర్థ్య మేపారఁగన్. ౭౯

చం. మురరిపు మూర్ఛఁ దేర్చి మురముఖ్యపతిన్ ధృతిఁ దూలనేసి యా
హరిఁ బరితుష్టుఁ జేసి పరిహార మొనర్చి యరిప్రకాండముల్
బరవశుఁ జేసి శౌరి రణపాటవమున్ బ్రకటించి వైరులన్
బరవశులం బొనర్చె శితబాణ పరంపర దిగ్భ్రమక్రియన్. ౮౦

కం. అవకాశమిచ్చి యీగతి
జవరాలికి సత్యవతికి సమర మొనర్పన్
భువనాధారుండగు మా
ధవుఁడనె దరహాస మొలుకఁ దనముఖశశిపై. ౮౧

మ. "నెలఁతా! నీరణకౌశలం బరయ నన్వేషించి కాలంబు నీ
కలనంగూర్చి పరీక్ష చేసితిని; నీకౌశల్య, చాతుర్య దో
ర్బలముల్ మాన్యము లప్రమేయములు; నీరక్షోధినాథుండు ని
స్తుల తేజోతిశయుం డజేయుడగుటన్ దూలింతు జంద్రాననా!"

మ. అని చాపంబునఁ గూర్చి బాణచయముల్ జ్యాటంకృతుల్ మ్రోగ నే
సెను దైతేయునిపై ధరాసుతుఁడు నిస్త్రింశోగ్ర పాతంబునన్
వనజాక్షాశుగ సంతతిన్ దునిమి యార్వన్ శంఖముల్ బూని ది
గ్గణముల్ భూతవితానముల్ సెదరి యాకంపించె నల్లాడుచున్. ౮౫

మ. హరి పూరించు మ పాంచజన్యమును భూమ్యాకాశముల్ మ్రోవ్పడన్
గర కేయూర సువర్ణ కంకణరుచుల్ గాంతిల్ల నుద్దండ దు
ర్ధర దుర్దాంత దురంత సిన్ధుర గదాదండమ్ము వేసెన్ శిర
స్సరదస్రారుణ వారివాహినులు విస్ఫారంబులై పాఱఁగన్. ౮౫

చం. నరకుఁడు వ్రాల నేలఁ గరుణామతి తల్లి ధరాలలామ యా
దరమున లేవనెత్తుచు గతశ్రమ సల్పిన లేచినిల్చి భీ
కరగతి నేచి యార్చి పరిఘం గొని వైచెను శౌరివక్షమున్
గుఱిఁ గొని సత్య భీతిని విఘూర్ణితచిత్తమునం జలింపఁగన్, ౮౬

చం. కదియఁగ వచ్చు నా పరిఘ కంజదళాక్షుడు ద్రుంచి కోల నె
మ్మదిఁ గలిగించి సత్య శరమార్గణపంక్తిఁ దగిల్చి వింటికిన్
బాదివి మురారిఁ జేరిచి నభోంతరవీధి మఱొక్క వ్రేటునన్
జదిపె శిరంబు వ్రక్కలయి నాశము జేఁగ తదీయ జీవముల్. ౮౭

మ. నరకుం డీల్గుటఁ జూచి శౌరి యిటు లాజ్ఞాపించె సేనానికిన్
"పురిలోఁ జొచ్చి భటాళి, రాజ్యసదనమ్ముల్ గ్రమ్ముఁడీ! దుర్గముల్
జెఱసాలన్ విడిపింపుఁడీ! యచట నిర్జీవాత్ములై యున్న సుం
దరులన్ భూపతులన్ మునిప్రవరులన్ దేవతా సాధులన్".

చం. "శరణని యన్న శాత్రవు వశంవదుఁడైన సురారి నేని, మి
త్రరసి భయంబునన్ వెడలునాతని, భర్తృవియోగతప్తలై
పె వెలార్పు భామినులఁ దాఁకక వెండియు మేలుగూర్చి మా
నవు చిరస్థితంబుగను బాఁదుకొనన్ ఘటియింపఁగాఁ దగున్."

శా. "సమ్మానంబున రాజపుత్రకుని నాశ్వాసించి నాయొద్దకున్
దెమ్మా! మిమ్మెదిరించి యుద్ధగతి నుద్రేకించినన్ మిన్నకే
రమ్మా! పైవిషయంబు నేఁగనియెదన్; ప్రాగ్జ్యోతిషీరాజ్యనా
శమ్మో!రక్షణమో!" యటంచుఁబలికెన్ సైన్యాధిపున్ సేనతోన్.

వ. ఇంతలో — ౯౦

కం. పగపునఁ గన్నీరొలుకఁగఁ
బగతుఁడు నరకాత్మజుండు భగదత్తుండున్
నగధరు శరణము వేఁడఁగఁ
దెగి పురివిడనాడి వచ్చె దీనాననుఁడై. ౯౧

ఉ. వచ్చి మురారి పాదములపైఁబడి యేడ్వఁగ శౌరి కౌఁగిటన్
గ్రుచ్చుచు నాదరించి యసురోత్తము నెంజలిభీతిమాన్పి పెన్
మచ్చిక నివ్వటిల్ల ననుమానముఁదీరిచి పల్కెనిట్లు "నీ
సచ్చరితంబుఁ దేటపడె శాంతగతిన్ భగదత్త పొందుమీ!" ౯౨

కం. "నీజనకు దుర్ణయమ్ముల
యోజన్ నేనింతదనుక నోర్చితిఁ దునుమన్
యోజింప నీ పితామహి
పూజించుటఁ దొల్లి నన్నుఁ బుత్రకుఁ గావన్." ౯౩

కం. "పాపంబు లుత్కటములై
యేపాఱిన కతమునన్ వధించితి; జగమున్
గాపాడుట నాధర్మము;
యీపాడి యెఱుంగుచున్ శమింపుము తండ్రీ!" ౯౪

మ. భగదత్తుండు ముకుందు మాధుర సుధావాక్యంబులన్ దృప్తుఁడై
పగపున్ భీతిన్ ద్రోలి యుల్లసియెన్, "స్వామీ! మురారింగదా!
పగవాఁడన్ శరణంటిఁ; బ్రోచెదవొ ? నన్బంధించి కొంపోయి నీ
పగ సాధింతువొ? నీయధీనుఁడ సుమా! భక్తావనా! పావనా!"

చం. అను భగదత్తు కూర్మిఁ దనుకాడ శిరంబును మూరుకొంచు ని
ట్లనె "భగదత్త యిచ్చితి సురాలయు మొక్కటిఁదక్క సర్వభూ
మిని, జనకార్జితంబది యమేయము, రాజ్యము నేలుకొమ్మి, స
ద్గుణగణ! పాలితానుమతితోఁ గలకాలము ధర్మపద్ధతిన్" ౯౬

కం. నరకాత్మజుఁ డసియెన్ హరి
చరణాబ్జములంటి "నాకు జనకుఁడు లేమిన్
గరుణించి పట్టమును నీ
కరములతో నొసంగు నెడలఁ గైకొనుదుఁ బ్రభూ!" ౯౭

చం. అను భగదత్తభక్తుని గృతార్థుని జేయఁగ నిశ్చయించి ప
త్తనమునఁ జొచ్చి రాజ్యసభఁ దా భగదత్తునికిచ్చి పట్టమున్
మును ధరణీసుతుండు బిలభూబిలకారల దాఁచినట్టి స
జ్జనతతి సుందరీవితతి క్ష్మాపతులన్ విడిపించి పుచ్చుచో. ౯౮

మ. వదునార్వేల ధరాధరాత్మజలు దొల్భవంబునన్ శ్రీశు నే
హృదయాబ్జాంతర కర్ణికాధిపతిగా బ్రేమించుటన్ జేసి నేఁ
డుదయింపన్ నరకాధినాథుని దురుద్యోగంబునన్ వారికిన్
వ్యథచేకూర్చి మురుండు గారనునిచెన్ గన్యామణుల్ గావునన్.

ఉ. బంధవిముక్తలన్ జలువ భామినులన్ నళినాయతేక్షణుం
డందుఁ గలట్టి చాయఁ గలయుంగని యెట్లొ ముకుందు నొద్దకున్
సుందరు లేఁగుదెంచి మధుసూదనుఁ జూచి నమస్కరించి మో
హాంధలుగా శిలాప్రతిమలై నిలువంబడి పల్కి రీగతిన్. ౧౦౦

ద్రు. "మదనమోహన! మారరూపకుమార! జన్మకు నేఁడె కా
నుదినమాయెఁ ద్వదీయ దర్శనశోభ దీనజనావనా!
వెదకుచున్ దొలిజన్మలన్ నినుఁ బ్రేముడిన్ గనఁజాలమీ
సదవకాశము గల్గె; దేవ! విషాదమున్ సడలింపవే!" ౧౦౧

ఉ. "నీ మహనీయమూర్తి హృదినిల్పి తొలిన్ దపమాచరించి క
న్నాము త్వదీయమూర్తి నయనంబుల పంటగ నిన్నినాళ్ళకున్;
మా మొరలాలకించుచు రమాపతి! నీదరిఁ జేర్చుకోఁగదే!
స్వామి! యెఱుంగజాలవె భవత్ప్రియగాఢ మనోజతాపముల్ ?"

కం. అని కన్నీటి దొనల్ వెలిఁ
దొణఁకన్ హరి పదములంటు తోయజముఖులన్
వనమాలి యనునయించుచుఁ
జనువును, ననునయము నెసఁగ సంభాషించెన్. ౧౦౩

శా. "కన్యారత్నములార! నాకెఱుక మీకామ్యంబు; సద్దాని సా
మాన్యుల్ మెత్తురె? యింతెకాక బహుభామాలోలుఁడన్ సైచియీ
యన్యాయంబు సపత్నులీకొనెదరే? యాశించినారేల నా
శూన్యానశ్వర దేహసంగతిని తేజోభూతి వర్జించుచున్?" ౧౦౪

ఉ. నా రమణుల్ చలించి నయనాంబువు లేఱులుగాఁ ద్రవించి పు
న్నీరుగ బాఱ నిశ్చలతనిల్చి వెలార్చుచుఁ బల్కిరీగతిన్
"శ్రీరమణా! ధరారమణ! శ్రీకర! కోరినవారికోరికల్
దీరుతువన్న పొల్లునుడి లెస్సబయల్పడె నేఁడు గోపకా!" ౧౦౫

ఉ. "ఎందుకుఁ బక్షపాతగతి యీగతి శ్రీపతి నీకు? రాధికా
సుందరి చుట్టుమాయెనెటు? శూద్రకులీనవికారి కుబ్జ యే
బందుగు నీకు? నీల వనపాలకులాంగన కూర్చునెట్లు? మా
పొందు సహింపఁజాలవె? ప్రభూ! పరిశోధన చేయఁగాఁదగున్."

శా. "మా చిత్తంబుల కీవ నేతవని సన్మానించి యర్పింపఁ జై
శాచిత్వంబున రక్కసుండు చెఱలో సంబద్ధలన్ జేయుచో
వైచిత్ర్యంబగు మమ్ము దూషితలుగా భావించినన్; స్వామి మీ
రే చేయూఁత యొసంగకున్న మఱి దిక్కేదీ త్రిలోకంబులన్?"

మ. "నగమున్ ద్రుంచి మరుత్త్వమిచ్చితి మహానాగంబు కాపాడి వ
పన్నగమున్ ద్రొక్కితమోంధమూడ్చితివిపున్నాగా! వ్రజప్రీతికై
నగమున్ గందుకలీలనెత్తితివిగా నాగేంద్రశాయీ! యసుల్
నగుబాటుల్ గృపఁబ్రోవకున్న నగధన్వ్యాంభోజగర్భాధిపా!"

కం. "దిక్కుల నెల్లెడ నీవై
పిక్కటిలి పరిభ్రమించు పేదలపాలన్
నెక్కటి దొరవగు నీవే
దిక్కై రక్షింపకున్న దిక్కేది? హరీ?" ౧౦౯

కం. అనిన నిరుత్తరుఁడై కనుఁ
గొనలను నిజభామవైపుఁ గూరిచి కలయం
గనుఁగొనెడి పూవువిల్తుని
జనకుని యుద్దేశ మరయు సత్రాజితికిన్. ౧౧౦

కం. ప్రణమిల్లి రాజకన్యలుఁ
బ్రణుతించుచుఁ బల్కి రిటుల "భామామణి! నీ
ఋణ మీఁగలేము ధర్మవు
గణింగి విశదీకరించి కడతేర్పు నెడన్." ౧౧౧

కం. అను కన్యాసంఘముపై
గనికర మనుకంపనింపి కరుణామతియై
దనుజారి తనువుఁ బుణుకుచుఁ
జనువును వినయంబుఁ గదుర సతి యిట్లనియెన్. ౧౧౨

శా. "గోపాలా! శ్రితలోకపాలన! ప్రభూ! గోవర్ధనోద్ధారకా!
గోపీమోహన! నందనందన! హరీ! గోలోకపాలా! మదో
ర్వీపాలాసురభంజనా! యఘవిదారీ! వేదసంచారి! యీ
భూపాలాత్మజలన్ గృపార్ద్రమతివై ప్రోవంగ దే ప్రేమమై." ౧౧౩

శా. "నీయందే హృదిఁ జేర్చి తొల్భవమునన్ ప్రేమించి పూజించి నీ
భూయోఽనుగ్రహకాంక్షఁ బుట్టిరిగదా భూపాలగర్భంబులన్!
మాయామేయ! యెదో మిషన్ బఱచి కన్యావార మిచ్చోటికిఁ
శ్రేయఃప్రాప్తికిఁగాదె చేర్చితివి నీరేజాక్ష! కాపాడుమీ!" ౧౧౪

శా. నీసంకల్పము కానిచో నెటులఁ దన్నీరత్నముల్ నీపద
ధ్యానాసక్తులు వేనవేలొకటఁ గారాబద్ధులై యుందురే?
త్రాసన్ దైత్యవశంబుగా కచలలై, స్థైర్యంబునన్ నిల్తురే?
నీసౌందర్యము నాసచేసికద! కన్నెల్ బన్నముల్ సెందుటల్."

కం. "పైశాచిక రాక్షసగతి
నే సబలుఁడో మనసులేని యింతినిగొనఁ ద
త్పాశముఁ దృణీకరించిన
యోషల దుర్గతిఁ దలంచి యోమంగదవే!" ౧౧౬

శా. "ఈ సంస్కారముఁ బూని చేయఁదగు శ్రీకృష్ణా! జగన్నాథ! సం
త్రాసన్ ఘూర్ణిలు స్త్రీ ప్రపంచమున కాదర్శంబుగా నీవ యీ
యోషా రత్నములం గ్రహించి ఋజుధర్మోద్బోధ గావించి మి
థ్యా సందేహముఁ బాపి సంస్కరణ దిగ్వ్యాప్తంబు గావింపవే!"

ఉ. "జాలకుశీలవా! సరసిజాక్షులపాణి గ్రహించుచో వ్వని
ల్లా లెవరేని నీప్రకటితాద్భుత నూతన ధర్మవిస్ఫుర
ల్లీలలు నన్యథా తనహృదిన్ దలపోయదటం చెఱుంగవే?
యేలికవై గ్రహించి కరుణింపుము బాలికలన్ దయానిధీ!"

కం. అనిన నగి నలిననయనుఁడు
వనజముఖుల స్యందనముల ద్వారావతికిన్
గొనిపోవ సమ్మతించిన
జనపతి భగదత్తుఁ డిచ్చె స్యందన శతమున్. ౧౧౯

కం. అరదములపైన మఱియును
ద్విరదంబులఁ దురగ కారభేయంబులపై
వరదుండు ద్వారకకు నా
యరవిందాక్షులను జేర్చె నవలీలమెయిన్. ౧-౨౦

ఉ. చేరిచి యార్యులం బిలిచి చెప్పి యుదంతము పెండ్లియాడె నా
వారిజనేత్రలన్ సుభగ వారముహూర్తముఁగూర్చి యొండు నా
ద్వారకనున్న పౌరజనవారము గన్నుల పండువౌనటుల్
చీరి తదీయ బాంధవుల స్నేహితకోటి నిజాప్త మిత్రులన్. ౧-౨౧

కం. ఇటు వైవాహిక కార్యముఁ
బటుతరగతి నెఱపి యంత ప్రతియువతికి నా
దట నొకనూత్నగృహము సం
కటముం దొలఁగింప నొసఁగెఁ గరుణామతియై. ౧-౨౨

కం. పదునారు వేల మేడలఁ
బదిలంబుగఁ బాదుకొలిపి ద్వారావతిలోఁ
బదునాఱు వేలముదితల
హృదయేశుండయ్యె జక్రి శ్రితరక్షకుఁడై. ౧-౨౩

చం. సవతులు పెక్కురుండియు నసహ్యముగాఁ గలహింపఁబోక యే
సవతు నొనర్పకొండొరులు సఖ్యముగా హృది సర్వలోకబాం
ధవు ధవు మాధవున్ నిలిపి ధ్యాననిమగ్నతఁ దేలి భక్తిమై
యువతులుగొల్చిరచ్యుతుని యోగివరున్ బరితుష్టచిత్తలై. ౧-౨౪

వ. ఇట్లు కాలము గడుపునంత — ౧-౨౫

మ. పదునార్వేల పడంతుకల్ గడఁగి కొల్వన్ బుద్ధిమద్బంధుఁడై
యుటు సింహాసనాలంకారుఁ జొప్పును సహస్రానేకారియుణుల్
హృదయేశుండని శౌరిఁ జేసికొని సంప్రీతిన్ సపత్నీత్వముం
మదముల్ మత్సరముల్ దలంగి మనుటల్ మా[illegible]గముల్లోకముల్

ఉ. నారదమౌనిసత్తముఁ డనారతనారతృషాపరుండు త
న్నారులభక్తితీరు, నలినాక్షు గృహస్థవిధానలీల గ
న్నారఁగ నారయన్ దలఁచి నారక, నాక, ధరాదిలోకసం
చారముచేసి వచ్చెను విచారపరీక్షలొనర్ప ద్వారకన్. ౧౨౭

కం. పరిపరిలీలల జీవుల
బరిశోధనఁ జేయుమేటి పరిశోధకుఁడౌ
పరమాత్ముఁడని యెఱింగియుఁ
బరిశోధనకుం గడంగె వాణీసుతుఁడున్. ౧౨౮

మ. హరి సంకీర్తనతో మనోజ్ఞ మృదుగానాలాప నృత్యంబుతో
సురమౌనీంద్రుఁడు ఋక్షరాజమనఁ దేజోద్దీపితానల్పుఁడై
ధరపై డిగ్గి నభంబునుండి, యదునాథావాస సామీప్యమున్
దరియం జేరి విదర్భరాజతనయాధామంబు గుర్తించుచున్. ౧౨౯

ఉ. చొచ్చి నిలింపమౌని యటఁ జూచెఁ బ్రియాళి నిర్మలాంబువుల్
దెచ్చి యొసంగఁ బీఠికనధిష్ఠితుఁ జేసి మురారి భక్తిఁ ద
త్సచ్చరణాబ్జముల్ గడిగి త్రాల్చి తదీయజలంబు మస్తమం
దచ్చసుగంధ పుష్పతతి నర్చనచేయు విదర్భరాట్సుతన్. ౧౩౦

ఉ. వచ్చిన దేవమౌనిఁ గని వారిజనాభుఁడు లేచి పత్నితో
వచ్చి నమస్కరించి పరిభావనఁ బూజలఁ జేసి ప్రశ్నలన్
గ్రుచ్చి సమాదరించిన దిరోహితుఁడై చని సత్యభామ యిల్
సొచ్చెను నారదుండు మధుసూదనుకీర్తి నుతించి పాడుచున్.

మ. అటఁ గాంచెన్ సురమౌని నారదుఁడు బాహాబాహు రంగాంగ వి
స్ఫుట సంరంభణఁ బ్రావృడంబుదచలచ్ఛోభాయమానోజ్జ్వల
సుకేశీబంధము విస్ఫురింప నిజకాంతాస్యాబ్జసౌరభ్య మా
దట నాస్వాదనచేయు భక్తజన హృద్పద్మాంతరాళున్ హరిన్.

ఉ. నారదమౌని గాంచి నలినాక్షుఁడు దిగ్గనలేచి భామతో
నీరము నర్ఘ్యమిచ్చి మహనీయ సుగంధ నివాళులిచ్చి యా
హార మొసంగి తుష్టహృదయాత్ముఁ డొనర్చుచు సాఁగనంపినన్
నారదమౌని ఋక్షజననాయకపుత్రి గృహంబుఁ జొచ్చినన్. ౧౩౩

చం. అచట విరించి సూనుఁడు వయస్యలు పెక్కురు వీవ వీవనల్
రచిత నవాంగముద్ర, సవిలాస వికాస, శుచిస్మితానన
ప్రచురితరాగ జాంబవతి ప్రక్క నిలంబడఁ దూఁగుటుయ్యెలన్
ప్రచలితుఁడై యనంగ శరబద్ధుఁడునైన హరిన్ గనుంగొనెన్.

మ. హరి దేవర్షిని గన్న మాత్ర దిగి పర్యంకంబు సద్భక్తిమై
సురమానీంద్రున కర్ఘ్యపాద్యముల నౌత్సుక్యంబుతో నిచ్చి యే
డ్తెఁ బత్నియుతుండై ప్రణామగతి నద్దేవర్షిఁ బూజించినన్
బరితుష్టుండయి పాసె నచ్చటితరావాసంబు శోధింపఁగన్. ౧౩౫

ఉ. అచ్చొటు వాసి షోడశ సహస్రవయస్యల సౌధహర్మ్యముల్
సొచ్చి నిగూఢయుక్తిఁ బరిశోధన చేసిన నన్నిచోటులన్
బచ్చనివిల్తుతండ్రి కనువందువ చేసి సతీద్వితీయుఁడై
యచ్చతురాస్యనందను సమర్చన చేసె విచిత్రవైఖరిన్. ౧౩౬

చం. ఇదియొక దివ్యసంఘటన మీదృశదృశ్యమనన్యమౌట, నా
రదముని విస్మితుండయి పరాభవమంది వివేకమేర్పడన్
హృదిఁ బరమాత్మ సత్వగతి యెల్ల బయల్పడినన్ నిగర్వియై
పదముల వ్రాలి యచ్యుతుని ప్రార్థనఁ జేసెను భక్తిమై నిటుల్.

ఉ. "నారద నామధేయము యనర్హము నాకు; నవజ్ఞుడన్ జుమీ!
నీరదనీలదేహ! హరి! నీ మహనీయవిభూతిసార మే
పారు నపారమై; తరమె పారము ముట్టఁగ బమ్మకేని సం
సారిని రిక్తనైతిఁ గద సారసలోచన! సారహీనతన్." ౧౩౭

మ. "భవకంజోద్భవదేవరాడ్వరులహంభావాంధులై నీవిభూ
తివిశేషం బిసుమంతయున్ గనక యంధీభూతులై యుంట నా
చెవికిన్ సోఁకియు శోధచేసితిని లక్ష్మీనాథ! నీతత్త్వమున్
లవమేనిన్ ననుబోటికిం దెలియు నేలా? జాల గోపాలకా!" ౧౩౯

మ. "నిను శోధింపఁగ నెంతవాఁడను ప్రభూ! నీబోధచే సర్వ స
ద్గుణగణ్యంబయి సర్వమున్ వెలుఁగు; నీ కోపాగ్నిచే శూన్యమై
చనుఁగా; నీపరిశోధనన్ నిలుచుచో సర్వంబు సంపూర్ణమై
ఘనతన్ గాంచుఁ; ద్వదీయరక్షణమె ముఖ్యంబెన్న భూతాళికిన్."

సీ. "నీయండ నేమఱి నిదురించు విజ్ఞాని
యజ్ఞానియై యపఖ్యాతిఁ గాంచు;
నీదండ నాసించి నిలని బలిష్ఠుండు
దుర్బలుండై త్రుటిఁ ద్రుంగిపఱచు;
నీ యఖండ విభూతిఁ బాయు మహేంద్రుండు
ధనహీనుఁడై దరిద్రమునఁ గ్రుంకు;
నీ చండగతిని ధ్యానింపని ధీరుఁడు
భీరువై దెసఁజెడి పాఱిపోవు;

గీ. నీ మహోద్దండ గుణము గణింపలేని
యోగి రాగానుబంధుఁడై భోగియగును;
నిరతిశయ గుణ! నిర్గుణ! పర! పరేశ!
పరమకరుణాలవాల! గోపాలపాల!" ౧౪౧

శా. "స్వామీ! నీ దగు నింద్రజాలిక కళాపాండిత్యపారంబు మా
యామేయాంబుధి మగ్నజీవుల కసాధ్యం బారయం జేర బ్ర
హ్మోమేశేంద్ర ముఖాదిదేవతలు నీ యుద్దామ మాయాసము
ద్రామోఘాద్భుత భంగసంగతులుగారా! దేవ! దేవాధిపా!

కం. "పుట్టింతువు ముజ్జగముల;
గిట్టింతువు వాని మగిడి; క్రీడగ వెలికిన్
నెట్టింతువు; కర్మలతో
దట్టింతువు భూతకోటిఁ; దామరసాక్షా!" ౧౪౩

ఉ. "కాలముగాని కాలమునఁ గన్పడ వెంతని వేఁడికొన్న మా
మ్రోలనె నిల్చి కష్టసుఖముల్ గుడిపింతు వదృశ్యసంగతిన్
బేలలఁ జేసి, కర్మమిషఁ; బేదయె రాజగు, రాగి యోగియౌ
నీ లవవత్సలత్వమున నీరజలోచన! పాపమోచనా!" ౧౪౪

మ. అని ప్రార్థించి ముకుందు వీడ్కొని హరిధ్యానంబుతో నామరు
న్ముని యంతర్హితుఁడయ్యె; శౌరిసతు లత్యుత్సాహయుక్తాత్మలై
వనమాలిన్ ద్విగుణీకృతార్చనల గొల్వన్ వారి యన్యోన్యభా
వన దిగ్వ్యాపితమై జగన్నుతమునై భాసిల్లె నానాఁటికిన్. ౧౪౫

ఉ. అంతటఁ బోక నారదుఁ డహర్నిశముల్ పరికించి రుక్మిణీ
కాంతయు సత్యభామ సహకారముతోడ మెలంగకుండుటన్
జింతనచేసి తెన్నొకటి, నిర్జరలోకముఁ జేరి కోరె, వృ
త్రాంతకుఁ బారిజాతసుమదామము శౌరికొసంగఁ బ్రీతిమై ౧౪౬

కం. దేవేంద్రుఁడు కృపణుండై
దేవఋషిని జూచి యనియె "దివిజార్హంబౌ
పూవుం దండను మనుజుల
కేవిధి నీఁదగును? నీకె యిచ్చెద సుమముల్." ౧౪౭

కం. "అమరతరు పుష్పదామము
లమరులకే యరిది పడయ; నది మర్త్యులకే
సముచితమె? యడిగినందుకు
సుమమొక్కటి నిత్తు నీకు సురముని కొనుమా!" ౧౪౮

కం. అని కల్పకసుమ మొక్కటిఁ
గొని తే భటుఁబనిచె; దానిఁ గొని తెచ్చిన, నా
మునికిచ్చి "యిచ్చితిని నీ
యనఁగును దీనిఁ ద్వదభీష్టుఁడగు నెవ్వని కేన్." ౧౪౯

మ. అని వీడ్కొల్పిన నారదుండు సురలోకాధీశు కార్పణ్యగ
ర్వనిరూఢిన్ వనమాలిపత్నుల యమర్షత్వంబు నిర్వాపణం
బును గావింపఁ దలంచి దేవముని యాపుష్పంబుతో ద్వారకన్
గన విచ్చేసి విదర్భరాజతనయాగారంబునం జొచ్చినన్. ౧౫౦

సీ. కనకంపుటుయ్యాలఁ గనుగూర్కు కమలాక్షు
వింజామరంబుల వీవ సఖులు
మదనమోహనమూర్తి మదనగోపాలు సం
భావించి ప్రియులు నివాళు లెత్త
నీలమేఘశ్యామలీల లభినయించి
నారీమణులు నర్తనం బొనర్ప
కేశవునామముల్ గీర్తించి రుక్మిణీ
భామ రమ్యగతి విపంచి మీట.

గీ. ద్వారకానాయకుండు మురారి శౌరి
చొక్కి యఱఁగన్నుమోడ్చుచోఁ జొచ్చె నంత
దివిజముని హరికీర్తన దేవకుసుమ
ఘుమఘుమల్ ప్రాఁక నద్దెస ల్గొమరుమిగిలి. ౧౫౧

శా. సర్వాంశమ్ము లెఱుంగఁగూర్కి త్రిజగత్సంచారమున్ జేయు నా
సర్వజ్ఞుండు మునీంద్రు నాగమనమున్ స్వర్లోక వృత్తాంతమున్
సర్వంబున్ మదిలో నెఱింగియును, నజ్ఞాతత్వ మేర్పాటుగా
నిర్విణ్ణత్వముఁ దోఁపఁ దొట్రువడుచు న్నిద్రాళుఁడై లేచుచున్.

శా. ప్రత్యుత్థానమొనర్చి దేవముని కర్ఘ్యం బర్చనల్ పాద్యముల్
స్తుత్యంతంబుగ గూర్చి మజ్జనగతిం దుష్టిప్రదున్ జేయుచున్
బ్రత్యేకంబగు భోజనంబొసఁగి పర్యంకంబునన్ నిల్పి యా
సత్యావాసి విరించిపుత్రకునితో సంభాషణోద్యుక్తుఁడై. ౧౩

కం. పలికె నిటు "దేవమునివర !
నిలింపపతిఁ జూచినావె ? నిర్జరుఁడై ని
స్తుల సర్వదాయ కల్పక
ఫలయుతుఁడై యున్నె గర్వభావ విముఖుఁడై ?" ౧౪

కం. "ఆతని యాచించినచోఁ
బ్రీతి నొసఁగఁగలఁడు కల్పవృక్షము కలిమిన్
జేతస్సమ్మోదము నా
నాతులకున్ గలుగుఁ గల్పనగ పుష్పములన్." ౧౫

కం. దురదృష్టవశమునను నీ
నరజన్మము గలుగుకతన నాకేశునకే
యిరువగు దేవసుమము; మా
తరమే వడయంగ ? రిక్తభావన విధిజా !" ౧౬

మ. అనునంతన్ సురమౌనిపుంగవుఁడు నాస్యాబ్జంబుపై నక్కజం
బును నానందముఁ దోఁప నిశ్చలత సంపూర్ణంబుగాఁ బూసఁగ్రు
చ్చిన భంగిన్ వచియించి సర్వమును నిక్షిప్త ప్రసూనంబు రు
క్మిణి కర్పించి సురేంద్ర గర్వితమదోక్తుల్ చాటె నిర్భీకుఁడై.

మ. "భవదీయాప్త సతీమతల్లులకు నీ వాంఛించితిన్ గాదె ! వా
సవుఁ గల్పద్రుమదామ మాతఁడు తమస్సంఛన్నుఁడై యర్థలు
బ్ధ వశావేశముతోఁ గృతఘ్నుఁడయి సంభాషించి తెప్పించి యీ
పువు నాకై యొసంగెన్; విదర్భసుత పూర్వున్ దాల్పగా నర్హురా
లవు నీ రేడుజగాల; నిచ్చితిని గృష్ణా ! దీని వైదర్భికిన్. ౧౭

కం. హరి నారదవచనంబునఁ
బరఁగెడు ఫలితం బెఱింగి బాగని మదిలోఁ
బరికించి పైకి నిట్లనె
దరహాసముఁ దొఁటఁక వదన తామరసముపై. ౧౫౯

చం. "కలహము పెట్టి చూచుటయుకా పని నారద! నీవు, రుక్మిణీ
లలన కనన్యలభ్యమగు లాభము గూర్పఁగ నేల? దాన బెఁ
జలమును వైరముఁ గలుగు; నారులు దీని నెఱింగి యిందుకై
యలిగినఁ గోర్కె తీర్పఁగలనా? యిది దుర్లభమై యెసంగుటన్."

కం. ఈనొడువుల విని సురముని
యాననమున నగవుఁజిలుక ననె నీగతి "స్త్రీ
పూనికొనఁ గల్పకద్రుమ
మా నాకు లోసంగరే! భయాకులమతులై." ౧౬౧

చం. అని హరినామసంస్మరణ మర్థి ఘటించుచు మింటికేఁగె నా
యనిమిషమాని రుక్మిణి మహార్హ్వత యెంతయొ యుగ్గడించి; యా
వనజదళాక్షుసన్నిధిని బద్మజసూనుఁడు కల్పసూనమి
చ్చిన తదుదంతమంతయును జేరె సపత్నుల శ్రోత్రమార్గముల్.

శా. సత్యాదేవి యెఱింగి యీగతిని రాగక్రోధచేతస్కయై
దైత్యధ్వంసకుఁ డీపరాభవము యాథార్థ్యంబుగా జేసిన
ట్లత్యంతోళనపొంది యిందులకు మార్గాలోకనం జేసి "శ్రీ
వత్యర్ధాంగి యెవారో? తెల్పు"నని కోపాగారమున్ జొచ్చినన్.

చం. ఇది సకలం బెఱింగి హరి యింతి విదర్భకుమారివాసమున్
వదలి, యిదొక్క మేలునకు వచ్చిన కోపముగాఁ దలంచి, యా
సుదతి యుదగ్రకోపగురుశోకభరాన్వితయై పరున్న యా
గదిని సమీపతఁ జేసి, చనెఁ గంజదళాక్షుఁడు లోనికిన్ వెసన్.

మ. చని లోఁగాంచెను శౌరి చందనవిచర్చాలిప్త, కస్తూరికా
వన, నాపాదశిరఃపరీతమృదుచీనావస్త్రవిన్యాస, దృ
క్కణసంసిక్తకపోలికాముకుర, రూక్షాక్రోధసంరంభని
స్వన సంమ్లానితపల్లవోష్ఠఁ బరితాపాటోప భామామణిన్. ౧౬౫

చం. కని మది జాలినంది కనకాంగి యవజ్ఞతఁ గాంచి, సస్మితా
ననశిశిరాంశుఁడై తటుకునన్ గనుసన్నఁ బ్రియాళిఁ ద్రోలి మె
ల్లన శయనంబు డగ్గఱి విలాస సలాలస మందహాసముల్
దనుక నొయారి మేల్ముసుఁగు లాఘవలీలఁ దలంగఁ జేసినన్.

చం. మొగిచిన కన్నుఁదమ్ముల లఱమోడుపుగా సవరించి వేఁడిమిన్
బిగిసిన మోవిఁ గ్రోలి మొలిపించి, సవంకములైన గల్లముల్
నిగనిగఁ బాదుకొల్పి, ముఖనీరజమంటి పెనంగు ముంగురుల్
దగిలి ప్రసన్నతన్ నిలిపి, తాలిమిఁ దూలక రాము కిట్లనున్. ౧౬౭

మ. "చెలి! యేలా బ్రతిమాలినన్ బలుక? పీశీలంబు మేలా? మనో
నిలయంబౌ చెలువంబు ప్రాలి నిలిచెన్ లీలాగతిన్ గన్న యీ
యలుకం దూలక, కోలఁ ద్రోలినను బాయం జాలునే హేల ని
శ్చలమై నిల్చెడిఁగాక నైజగతి నీచాపల్యముల్ చాలుఁబో! ౧౬౮

కం. "వినిపింపుము నీ పలుకుల;
గనిపింపుము నీదు బెళుకుగలికితనంబుల్;
దనిపింపుమి నవరసములు;
మనిపింపు దయాబ్ధిఁ దేల్చి మానిని నన్నున్." ౧౬౯

ఉ. "మానిని యేటికీ దురభిమానము? నీ కనుమానమేల! నీ
మానస గుప్తకామ్య మభిమానము మాని సరాగ వాసి నా
మానసమందు నాటిన, నవమానము మేని బిరాన గూర్చి నీ
మానపతీత్వ సంపదను మానితమౌ గతి నేనొనర్చనే?" ౧౭౦

కం. అని సాత్రాజితికిని హరి
యనునయ నయ వినయ విలసదనురాగాంభః
కణశీకర సంస్పర్శను
ఘనరోమోద్రేకశిఖలఁ గడఁకఁ నడంపన్. ౧౭౧

చం. హరి ప్రియభాషణన్ సడలి యాత్మవికారము బాహుకాండవి
స్ఫురణ నడంగి, చల్లపడి పూర్ణశశాంకమనోజ్ఞకాంతులన్
గరఁగి కరాబ్జమార్దవసుఖంబున సంచలనంబునంది సుం
దరి నయనారవిందగతి దాఁటి స్రవించెఁ బ్రవాహసంగతిన్. ౧౭౨

ఉ. మోడిచి మోడ్వకున్న జలపూరితనేత్రయుగంబుతోఁ బసల్
వీడక పీకు బాష్పకణలిప్తకపోల విలాసలీలతో
వాడియు వాడ కింపెసఁగు వాడిచివుళ్ళ కడానివా తెఱల్
పోఁడిమి మీరఁ జేడియ కవుంగిట గ్రుచ్చెఁ దటాలునన్ హరిన్.

కం. డగ్గుత్తికతో ముడిఁబడి
సిగ్గున సుడివడిన మోము జెలువము తోఁ ది
ర్యగ్గమన దృగ్రుచులతో
దగ్గఱఁ గూర్చుండి యిటు పదంపడి పలికెన్. ౧౭౪

శా. "లేవా గోడలకేని కర్ణములు? మీ లీలా ప్రసంగమ్ములున్
రావా నా చెవి సోఁక? మెప్పులకు స్వర్మానీశుఁ డేతెంచుచున్
దేవా! యీఁదగు భూరిశుల్కములు మీ దేవేరికే యిట్లు దు
ర్భావం బేటికిఁ గల్గు నన్నుఁ దమ భావాధ్వంబునన్ నిల్పనే?"

ఉ. "మీ దయ సుంతయున్న యెడ మేదినికిన్ సురశాఖ నేని సం
పాదన చేసి తెచ్చి ఫలవంత మొనర్చి తదీయ పుష్పముల్
మోదమునన్ సపత్నులకు మోదుపనే కబరీభరంబులన్!
యాదవరాజధానివని నాటనె తత్సురశాఖ నెల్లెడన్!" ౧౭౬

ఉ. "నీ శపథంబు చొప్పు గరుణింపుము నాకు వరంబొసంగి లో
కేశ! సురద్రుమంబు గొనియిమ్మది యెట్టుల నేని; మీరు సం
దేశము నంపఁ గల్పకము దేఁడె! కృతజ్ఞత మేలుగన్న నా
కేశుఁడు; విస్మరించునె చరించిన మీ యుపకారకృత్యముల్!"

ఉ. సత్యవతీ వచః ఫణితి సాదర మొప్పఁగ నాలకించి యా
దైత్యవిరోధి యిట్లనియెఁ "దామరసానన! దుర్లభంబ; యే
క్షిత్యధిపుండు పూని కృతకృత్యతఁ గాంచెను పారిజాత సాం
గత్యముఁగోరి నాటి? తొలికానిపనిన్ సలుపంగ నేర్తునే!"

కం. అనినన్ సాత్రాజితి యి
ట్లనియెన్ బాదంబులంటి యబ్జాక్షుని తోఁ
బెనఁగొని భక్తియు రాగము
గనుపింపగ నాననమునఁ గమ్రరవమునన్. ౧౭౯

సీ. "ఏ వాఁడు గలిగెను భూనాయకంబైన
ద్వారావతీ పురీ స్థాపనంబు;
ఏ మహీనాథ సభామండపం బయ్యె
నద్భుతామర సుధర్మాలయంబు;
ఏ యోధవరుఁ డెక్కె భూయోచ్చలద్ధామ
ప్రస్తుతపక్షి రాడ్వాహనంబు;
ఏ ధరేంద్రునకు యదేచ్ఛ సంప్రాప్తించెఁ
బాంచజన్య రథాంగ లాంఛనములు;

గీ. ఇన్ని దివ్యాంశజాలంబు లెందు నిలుచు?
అఖిలలోకావనుఁడవు నీయందకాక;
కల్పకము నీయు నల్పసంకల్పభూతిఁ
దలుగు, నీ వికల్పోద్ధతి విలయమమరు." ౧౮౦

మ. "సురనాథావన! శ్రీహరీ! త్రిభువన స్తోత్రార్హమై ద్వారకా
పురి శోభిల్లుఁ దదీయ పట్టణ సమీపోద్యాన మధ్యంబునన్
సురశాఖిన్ గొని తెచ్చి నాటి సుమనశ్శోభాయమానంబుగా
నెఱపన్వేడెద నాయభీష్టగతి మన్నింపంగదే! ప్రేముడిన్."

క. "నేనేకాదు సపత్నులు
నీ నాటంగలుగు నెల్లరింతులు గూడన్
శ్రీ నాక కుసుమ పరిచయ
మానసులై నెగడఁగలుగు మాన్యత యమరన్." ౧౮౨

క. అని పదములంటి పలికెడు
తనుమధ్యను లేవనెత్తి దాశార్హుండి
ట్లనెఁ "గోమలి! నీ వరమి
త్తును స్వార్థముగామి లోక తోషణమగుటన్." ౧౮౩

క. "ఎల్లి ప్రయాణము చేయఁగఁ
జెల్లును; దిధివాసరములు శ్రీదములై రా
జిల్లుట-భటనివహముతో
నెల్లను సంసిద్ధపఱుప నెఱుకపఱుపుమీ!" ౧౮౪

చం. అనివచియించి రేపకడ నండజవాహను నెంచి నంత వ
చ్చినిలువ నానతిచ్చె సురసీమకు దోడ్కొనిపోవ జెచ్చెరన్
వనజదళాక్షు సత్యవతి భద్రముగా మెడపైననిల్పి పా
ఱెను విహగేశ్వరుండును గరిష్ఠజవాన్వితుఁడై యదృశ్యుఁడై.

ఉ. నాకముఁజేరి నందన వనాంతరమందున డిగ్గఁబంచి చీ
కాకునహింప దోటగఱు కాఁపరు లట్టిటుగూడిచూడి మా
ఱాకులసీవి ప్రమాకులనసంతలతాంతనిరంతరస్థితిన్
ప్రాకు నికుంజపుంజముల వల్లులయల్లిక లెల్లజూచుచోన్. ౧౮౬

మ. వనపాలప్రకరంబు లత్తఱిని దుష్ప్రాప్యామరోద్యానవీ
క్షణకౌతూహలి మానినీసహితు సాక్షాత్కారసంభ్రాంతి లో
ననుమానించియు స్తబ్ధతన్ గనిరి చిత్రావస్థలోఁ జిక్కి యే
మన నోరాడక నివ్వెఱంగనుచు నత్యాశ్చర్యమగ్నాత్ములై.

చం. చెరచెర సంచరించి వనజేశుఁడు కల్పక మున్నచోటికిన్
బిరబిరపోయి యచ్చటనె నిల్చి యొకానొక పారిజాత పుం
దరుస్పృశించి వంచి కరతామరసద్వయిఁ బెల్లగించుచున్
జెఱజెఱలాగినంత గమనించి తటాలున మూఁగి కాఁవరుల్. ౧౮౮

ఉ. "మానవదుర్లభం బమరమానితమై సురరాజపాలితం
బౌ నమర ద్రుమంబు నెవడంటఁగలాఁ డసువుల్ద్యజించి? నీ
ప్రాణముమీఁది యాసలను బాసితె? యక్రమలీల గల్పకం
బానిహరింతువేల? మనుజాధమ! యేగతిఁ జొచ్చితిచ్చటన్?"

కం. అని యశ్లీలోక్తుల నా
వనపాలు రవజ్ఞులగుచుఁ బలికిన, హరియున్
గినుక వహింపక ముఖచం
ద్రునిపై దరహాసకాంతి తొణుకఁగ ననియెన్. ౧౯౦

ఉ. "నూటిగ వచ్చి నాముగద! సోదరు వాసవుఁజూడఁగోరి; మీ
వీటికి పోయి రాక వినుపింపుఁడవశ్యమ యున్నగారితోఁ
దోటఁగలట్టి కల్పకముఁ ద్రుంచినభంగి వచించి రండు మా
బోటులతోఁ బ్రసంగములు పోలునె? మర్త్యులమాకతంబునన్."

కం. ఇటులన నావనపాలకు
లటమటపడి నోరురాక యమరేశ్వరు పా
లిటికేఁగి విన్నవించిరి
కటకటపడి కల్పవృక్షకస్సైన్యంబున్. ౧౯౨

చం. అమరవిభుండు కాఁపరుల యారటపుంబలుకాలకించి కో
పముగదురన్ వచించెనిటు "పాలకులార ! భ్రమించినారె ? బం
ధము లెటుసాధ్యముల్ దివిజనాయకమర్త్యుల కెన్ని వేఁజ
న్మములకునేని ? క్రమ్మకొని ఘానవుఁ గీటడఁగించి తోలుఁడీ !"

కం. "ఇదిగో! నే మీావెంటన
రథమునకుం బూనిపించి రథ్యంబుల ద
న్మదమడఁగించెద, వానికిఁ
గదనమ్మున నీతిబోధఁ గఱపెద గనుఁడీ !" ౧౯౪

ఉ. పంపి యిటాడి కాఁపరుల, వారువముల్ దగిలించి తేరనై
లింపశతాంగమెక్కి యవలీల శరాసనమెత్తి మూఁపుపై
సంపదొనన్ గలట్టి నిశితాశుగదీధితిదిక్చయంబులన్
నింపి భటత్రయుక్తుఁడయి నిర్జర నాథుఁడు పోఁగడంగినన్. ౧౯౫

మ. అమరోర్వీజముఁ బెల్లగించి త్రుటి సత్యాదేవి మోదింపఁ బ
త్పుమ గుచ్ఛంబులఁ గోసియిచ్చి మది సంతుష్టిం బ్రసాదించి త
ద్ద్రుమమున్ జంకనిమిడ్చి యాత్మసతి సంతోషింప నేతద్వనో
త్క్రమణోద్యుక్తుఁడుగా, వెనుందవిలి వృత్రారాతి విచ్చేసినన్.

కం. కక్షంగల యాకల్పక
వృక్షము నిజసఖి కొసంగి కృష్ణుఁడు వజ్రిన్
వీక్షించిన రాజసహృద
య క్షేత్రుం డింద్రు డంబుజాక్షుఁ దెలియమిన్. ౧౯౭

మ. కోపావేశముతో మహేంద్రుఁడు తమఃకోపాతిరేకంబునన్
జాపంబందునఁ గూర్చి యేసె మదమాత్సర్యాంధచేతోరజః
చాపల్యంబునఁ గాండ సంతతులు; హాసజ్యోత్స్న దీపింప నా
గోపాలుండు శరాళిఁబట్టి మరలన్ గోత్రారిపై వైచినన్. ౧౯౮

చం. శిఖిశిఖ లేర్చి క్రక్కుచును జెచ్చెర నాశుగముల్ జ్వలించి ది
జ్ముఖముల విస్ఫులింగముల స్ఫూర్తియఖండముగా ధ్వనించుచున్
మఖశత నిర్వహున్ గదియ మార్గణపంక్తిఁ జలించి భీతుఁడై
నిఖిల చరాచరాత్మకుని నిల్పి మనంబునఁ గన్మొగిడ్చెనన్. ౧౯౯

శా. ఏరూపుం గొని పారిజాత సుమనోవృక్షంబు మూలంబుతో
నారీ సంయుతుఁడై హరించి యెదుటన్ గన్పించెనో! యాత్మలో
నారూపే కనిపించి స్త్రీ సహితుడై యాశీర్వచస్స్ఫూర్తి వృ
త్రారిన్ జూచిన భంగి దోఁచిన మదాద్ధత్యంబు భిన్నంబుగాన్.

చం. డిగి యరదంబు వజ్రి ప్రకటీకృత సత్త్వవిశేషుఁడౌచు దృ
గ్యుగమును గూర్చి చూచిన ముకుందుని దివ్యతమ ప్రభావముల్
మగమము లై కనంబడిన సూటిగ వచ్చి నమస్కరించుచున్
విగళిత గర్వమై యిటుల వేఁడఁదొడంగె గళద్దృగంబుఁడై. ౨౦౧

చం. "నిగమవిహారి! శౌరి! రజనీచరకోటివిదారి! కోరి నీ
యగణితసత్కృపారసమునంటి పదాబ్జము లాశ్రయించితిన్
విగతతమోంధమై పిసిని వేదురుమానె; క్షమింపుమన్న! ప
న్నగశయనా! శ్రితార్తిహరణా! నిఖిలావన! ధర్మపాలనా!"

శా. "కల్పోర్వీజముపైని గల్గు మమతన్ గాదంటి మీకంచు నా
వేల్పుంజోగి ప్రసూనదామముడుగన్; విచ్చేయ మీరందుకై
యల్పజ్ఞుండను గాన మార్కొని యమర్యాదన్ బ్రవర్తించితిన్;
గల్పాంతంబుల కేనిపోని యఘమున్ గావించితిన్ గావవే!" ౨౦౩

ఉ. "సిగ్గగు మీరొనర్చిన విశిష్టవిశేషమహోపకారవుం
బెగ్గ స్మరింపకే చెనకు బేలఁ గృతఘ్నుఁడనౌట; దేవ! యీ
యెగ్గునకున్ బ్రతిక్రియ ఘటించి మదాత్మను సంస్కరింపవే!
యగ్గలమై తమోవికృతి యాఁచెను సత్త్వవిశుద్ధతత్త్వమున్."

శా. "ప్రాయశ్చిత్తమొనర్పకున్న భరమైంద్రత్వంబు భావింప న
న్యాయంబింతరజస్తమోమతికి దేవాధీశ్వరత్వంబు వి
జ్ఞేయార్థంబులఁ గూర్చి యర్హతముఁగా జేయంగదే! సంతత
ధ్యేయా! చిన్మయదివ్యకాయ! త్రిజగత్సేవ్యా! వికుంఠాధిపా!"

మ. విలపింపన్ జరణాబ్జమంటి యటు దేవేంద్రుం; డుపేంద్రుండు వె
న్నెలనవ్వుల్ దెసలెల్లెడన్ వెలిఁగి రాణింపన్, నునుందేటసో
నలుగాఁ దీయనిపల్కువెల్లువలు దొణ్కన్ గన్నుఁగెంగలల్వల్
విలసిల్లన్ శిశిరాంశుసంతతులు సంప్రీతాత్ముఁడై యిట్లనెన్.

కం. "నీకల్పకము హరించుట
కై కాదు మదాగమనము; కల్పకము లసం
ఖ్యాకములన్ మొలిపించుచు
సాఁకనె నాకేశ! నాదు సంకల్పమునన్." ౨౦౮

ఉ. "నిన్నుఁ బరీక్ష చేయుటకు నిర్జర సన్మునివచ్చియున్న యా
తెన్ను గ్రహింప లేవకట! తేటగ నాకయి పుష్పదామ మి
మ్మన్న నిరాకరించితి రజోంధుఁడవై యధికారయుక్తి. నే
మున్నొనరించినట్టి కృతముల్ స్మరియింపక; వేఁగనుల్ ప్రభూ"!

ఉ. "నేనిటురాకయున్న రజనీచర రాజ్యసమంబు నాకభూ
జాని! త్వదీయరాజ్యము; రజః కలుషాంబుధిమగ్నులై యఘా
జ్ఞానతమోవశాత్ములయి నాకులు నీ వెను నంటియున్న నే
మా నరనాకలోక నరకాదుల యంతరముల్? సురాధిపా!"

ఉ. "ఇప్పటికేని పూర్వసుకృతేచ్ఛ లభించిన యీశతృత్వపుం
జొప్పు గ్రహించి కీర్తిని విశుద్ధగతిన్ సురభాగ్యభోగ్యముల్
దప్పక నిల్పుకోఁదగుఁ; దదన్యగతిన్ జరియింపఁ బూనినన్
దప్పదు స్థానవిచ్యుతి; యథావిధి దుర్గతియున్ శచీపతీ!" ౨౧౦

కం. అనినఁ "గనుఁగలిగి మెలంగెద"
నని వాగ్దానంబు సలిపి యమరేశ్వరుఁడున్
గను నీరు నిలిపి నిల్వఁడ
వనజాక్షిని గూడి యెక్కె పక్షీంద్రునిపై. ౨౧౧

కం. వేఁడికొను దేవపతికిఁ
బోఁడిమిఁ దగు బుద్ధి గఱపి పురుషోత్తముఁడున్
వీడ్కొని ద్వారకాపురిఁ
జేడియతోఁ గల్పతరువు జేకొని చేరెన్. ౨౧౨

సీ. ఒక సుముహూర్తంబుఁ బ్రకటింపఁ బండితుల్
ద్వారకాపుర బాహ్యవనమునందు
స్వస్తివాచక శుభవాద్యముల్ చెలఁగ ద
న్నాకద్రుమంబును నాటి, సత్య
సాఁకి ప్రసూనముల్ సంతరించిన, ముందు
దేవేరి రుక్మిణీదేవి కిచ్చి,
పిదప సపత్నులఁ బిలిపించి వేర్వేరఁ
బంచి, పిమ్మట రాజబంధువులకు

గీ. నంపి, పురిలోని పెద్ద ముత్తైదువులకుఁ
బ్రీతినిచ్చి, పిమ్మటఁ బురంధ్రీమణులకుఁ
నొసఁగి, సంతుష్టిఁ గావించి కుసుమముల్ ధ
రించి నిజపతితోడఁ గ్రీడించునంత. ౨౧౩

కం. "పతిభక్తిఁ దనకు మించిన
సతిలే"దని సత్యభామ స్వగతంబున "శ్రీ
పతి తన సొమ్మే"ని యతిగ
ర్వితమతి విహరింప దేవఋషి నారదుఁడున్. ౨౧౪

మ. కనిసర్వం బోకపారముగా గఱపి చక్కంజేయ సాత్రాజితిన్
జనుదెంచెం దమి ద్వారకాపురికి శ్రీ నారాయణాలాప కీ
ర్తనలన్ సత్యవతీ గృహంబునకు; నా బ్రహ్మాత్మజోద్దేశమున్
మును పేకాంచి మురారి యేదియొ మిషన్ బోయెన్ గృహోద్గామియై

కం. నారదుఁ డొంటరి పాటున
నారీమణి సత్యఁజూడ నయముగ బూజా
చారములఁ దనిపినం ద
న్నారీ తిలకంబుతోడఁ దాపసి యనియెన్. ౨౧౬

శా. "సత్యాదేవి! త్రిలోకసంచరుఁడ నీతన్మాజాలమం దెద్ది నా
కత్యాశ్చర్యము లేదనేక శతకల్పాయుష్కుఁడన్; సర్వదాం
పత్యాదంతవిదుండ; బోలరెవరున్ భామామణీ! నిన్ను భ
క్తి త్యాగప్రకటీకృతప్రణుత పాతివ్రత్య ధర్మంబులన్." ౨౧౭

ఉ. "ఎన్నియుగంబు లేను గమనించితి నెంతటిదాఁకఁ గాంచినా
నెన్ని జగంబు లేను మఱియెన్ని కుటుంబము లింతదాఁక నా
కన్నులఁ జూచియుంటి నెటఁగాని మఱెన్నఁడు నేని లేరు నీ
కన్న ప్రతివ్రతామణులు గల్గుటఁ, గానమిఁ కెన్నఁ డేనియున్."

కం. "ఊహింపు బహుసతీయుతుఁ
డో హరి నీవింత భక్తి నర్చించిన సం
దేహము నీపై మతి నీ
గేహము నెడఁబాయనట్టి కిటుకుఁ దలపుమీ!" ౨౧౯

మ. అనినన్ శ్రీపతిచాకచక్యగతి మాయాజాలవిద్యావిచ
క్షణసాకల్యము గా నెఱింగియు రజస్సంక్రాంత యక్కాంత కాం
తుని సంబద్ధునన్కుఁగా సలిపి తన్మోహాంబుధిన్ నిత్యమున్
మునుగన్ గోరిక సందడింపఁ ద్రుటిలో ముగ్ధాత్మయై యిట్లనెన్.

కం. "వృద్ధుండవు; లోకపరిచయ
బుద్ధుండవు మాలికాసమృద్ధుండవు, నీ
బుద్ధి గొనియాడఁదగు; శ్రీ
వృద్ధదేవమునీ! సెలవిచింపు మణిమంత్రవిధుల్." ౨౨

చం. సురమునిచంద్రుడిట్లనియె "సుందరి! యావధమంత్రతంత్రముల్
వరదుని బద్ధు సల్పుటకు వ్యర్థము లేకద! వ్రూని చేయుచోఁ
బరమరహస్య మున్నదది వారకొనర్చిన సిద్ధిబొందఁగాఁ
దరమగునే కొము? యీకొనిన దానిని నీకు వచింతుఁ బ్రీతినై".

సీ. దేవర్షి మాటల తీపి కున్మత్తయై
భామ రహస్యమున్ బలుకఁ గోర
నతఁ "డిదిగోప్యంబు నన్యుల చెవిసోఁకఁ
జేటని యీరీతిఁ జెప్పఁదొడఁగె
"వనిత! తులాభరవ్రతమ నెదరు పతి
నొక్క పాలునకమ్మి యూని పిదపఁ
బతిఁదులమించి యాభరణభరంబునఁ
దూఁచి తదర్థంబు యాచకులకు

గీ. "బధిర పంగ్వంధ వికలాంగ బాధితులకుఁ
బంచి విడిపించి పాలునివలన భర్తఁ
బతిని బూజింప నాతఁడా పడఁతి నెపుడుఁ
బాయఁడని యావ్రతము సతుల్ సేయుచుంద్రు." ౨౩

కం. "పతి మున్నొండఁబరుపనిచో
గతికి విరుద్ధంబుగానఁ గాంతా! యీసం
గతిని వినిపించి పతియా
పతిఁగొని సాగింపు వ్రతము నళినదళాక్షీ!" ౨౪

ఆ. వె. అనిన సత్యభామ యనె నిట్లు మానితో
"నారుల నమ్మి దాన మొసగఁ; బ్రియుని
నీక దానమిత్తు నీరజేక్షణునాజ్ఞఁ
బడసి; నిలువు మంతవఱకు నిచట." ౧౨౫

మ. అని యచ్చోఁ గలహప్రియున్ నిలిపి సర్వాంతర్గతాలోలుఁ డా
య్యనరా సర్వమెఱింగి యచ్చటికి; సత్యాదేవి పూజించి యి
ట్లనె "నాకోరికలెల్లఁదీర్చితిరి; ధన్యన్ నేఁ దులాభార క
ల్పనమున్ మంచివ్రతంబుఁ బూనితిని; సాఫల్యంబు గావింపరే!"

కం. అనినన్ ముసిముసి నగ వా
ననమునఁ దళుకొత్త శౌరి "నళిననయన! యీ
కొని యేమి నీవు శేయం
జను?" ననినన్ బలికె నిటుల సాత్రాజితియున్ ౧౨౭

కం. "మునిపతికి దానమిచ్చెద
మును మిము నా నగలఁ దులను బోసి విలచి త
ద్ధనమును యోగికి నార్తుల
కు నొసఁగి విడిపించుదాన గోపాలమణీ!" ౧౨౮

కం. నగి యీమాటలువిని యీ
తెగ వెట్టులఁదోఁచెనో యతీశ్వరునకు నన్
దిగనాడు తలఁపు గలిగెనె?
వగపేటికినాకు? నీవ పతి విడుచునెడన్" ౧౨౯

కం. సాత్రాజితి నగి యిట్లనె
"బాత్రుండా నారదుండె వడయును మును; నే
మాత్రము పుయిలోడకు నా
గాత్రాభరణమ్ము లొసఁగి క్రమ్మఱఁ గొనెదన్." ౧౩౦

చం. కనులు మొగిడ్చి శౌరి యనెఁ "గాంత! సదా యొకదారి రావు యో
జనఁ; లవి క్రిందుమీఁదులగుఁ; జాలక కర్మ మెఱొక్క దారి లా
గినఁ జెడు దాన వీవ! యెఱిఁగింతు నిజంబును; నీవకాని యా
మునియును నాకు నొక్కటియ, మూర్ఖము చేయకు మోతలోదరీ!"

వ. అనిన నగి యామాయలమారి శౌరికి నమాయకురాలగు నాయిల్లాలిట్లనియె— ౧౩౨

చం. "ఎఱిఁగి శమంతకమ్మున గడించిన నా పితృభాగ్యరాశి నా
పరమున నుంట నీతనువు భారము నేన యెఱింగియుండుటన్
దొరకొనియుంటి; నీవ్రతము తోషణతోడ సమాప్తిఁ జేయ నా
చరితమదెల్లయుం దెలిసి సందియమొందెద వే! పరాత్పరా!" ౧౩౩

కం. అని డాఁగియున్న నారదుఁ
గొని ముందుకుఁ దెచ్చి పీఠిఁ గూర్చుండఁగఁ బె
ట్టిన శౌరి యడిగె నారదు
వినయోక్తులఁ దెలియునట్లు విధి నియమములన్. ౧౩౪

చం. సకలమెఱింగి నారదుఁడు సత్య సమర్థనఁ జేయునట్లుగాఁ
బ్రకటనఁ జేసె నాఁటి వ్రతపద్ధతి సాంగముగా మురారితో;
నకలుష చిత్తయైన కమలాక్షికి గర్వము డింపఁబూని నాఁ
టికి హరి యానతిచ్చెఁ బరితృప్తిగఁ దద్వ్రత మాచరింపఁగన్.

కం. నిర్ణీత ముహూర్తంబునఁ
బూర్ణాహుతిఁ బూర్తిఁ జేసి మురహరునిఁ దులా
నిర్ణయపణమునఁ దూఁపఁగఁ
బూర్ణేందుని భాస్య సత్య పూనెన్ గడఁకన్. ౧౩౬

ఉ. ఒక్క తులన్ ముకుందుని మఱొక్కట భూషల నిల్పి దోఁపుగాఁ
దక్కెఁడయందు వైచి యది తద్దయు మీఁదికిఁబోక యున్నఁ బెన్
గక్కసమూర దాఁచిన నగల్ కనకంబును వేయునంతకున్
దక్కటఁ జూచి రత్నమణి దామములన్ గురిపించి తూఁచినన్,

ఉ. భూషలు స్వర్ణమున్ రతనముల్ మణిమౌక్తికవజ్రదామముల్
వేసిన క్రిందికిం దిగక త్రేఁగగు నావలసిబ్బె; దీనికై
గాసినిఁ జెంది సత్య సరికాంతల భూషల వేఁడి పైచినన్
మోసమె కల్గె; దేవముని మోమున నవ్వొలయంగ నిట్లనెన్,

శా. "సత్యాదేవి! భవత్పితృప్రదములౌ సౌవర్ణఖండమ్ములన్
ప్రత్యేకించి ధరాగృహాంతరములన్ భద్రంబుగా దాఁచితోఁ
బత్యర్థంబు బహిర్గతంబు సలుపం గర్జంబహో! నేఁడు వి
ఖ్యాత్యర్థంబులుగాని యర్థవితతుల్ వ్యర్థంబు లబ్జాననా!" ౧౩౯

మ. అన భూక్షిప్తమొనర్చి దాఁచిన హిరణ్యంబెల్ల దెప్పించి త
ద్వనితారత్నము లోకనాయకుని స్వార్థంబైన యర్థంబుతోఁ
గొన నూహించిన స్వామివై వుతులఁ వేఁగున్ దోఁచెఁగా! లోకసా
ధనముల్ నాఁడెముల్ నగల్ సమమె వేదాంతాధ్వసంచారికిన్!

ఉ. త్రాసునఁ గూరుచున్న నగధారి నిజాంగనఁ జూచి దైన్యసం
త్రాసము లన్నటించియనె "దైవవిధిన్ బెడఁద్రోయఁ నౌనె? ఖల్
మోసముగల్గె; నన్ను మునిపొట్టను బెట్టితి; వింక వీనికిన్
దాసుఁడ; నీవిపచ్ఛరధి దాఁటఁగఁ జేయు మసీషిఁ గానవే!"

ఉ. నావిని సత్యభామ కరుణామయి గావున దుఃఖవార్ధివీ
చీవివరంబు ద్యోతకము చేయ గళన్నయనాంబుబిందువుల్
లావును జేవఁ గోల్పడి విలాపముతోఁ బిలిపించె రుక్మిణీ
దేవినిదక్కఁ దక్కఁగల దేవుల దేవర నుద్ధరింపఁగన్ ౧౪౧

మ. పదునార్వేలపురంధ్రులష్టమహిషుల్ భ్రాంతస్థితిన్ వచ్చి స
మ్మదమార న్పతిదాస్యమోచనకు సంప్రాప్తార్థముల్సర్వమున్
వెడఁజల్లన్ సరి సుంతదోఁప దకటా! విత్తంబు శ్రీనాథుతో!
సుదతుల్ తద్గతిఁ గాంచి యాకులితలై శోకాబ్ధిలోఁ గ్రుంకఁగన్.

శా. నీలాదేవి సమస్తమున్ దెలిసి తన్వీన్ సత్యభామామణీ
వ్యాలోలత్వముఁజూచి జాలిపడి డాయంబోయి భాషించె నీ
లీలన్ "సత్యవతీ! విదర్భతనయాశ్లేషంబు శ్రేష్ఠంబగున్;
బాలారత్నముఁజేరి తేఁదగును సంభావించి యిప్పట్టునన్".

ఉ. "నీవు స్వయంబుగానరిగి నీరజనేత్రకుఁ బూసగ్రుచ్చిన
ట్లీ విషయంబుఁ దెల్పఁ గరుణించు దయాహృదయాంతరంగయే
కావున భర్తపై మమత గల్గుట; నెవ్వరి నెట్టి శక్తితో
నా విధి చేసెనో తెలియునట్టిద కాదుగదా! తలోదరీ"!

ఉ. "అందును రుక్మిణీ రమణి యందఱికంటెను బెద్దభార్య; గో
విందునిఁ దారుకొన్న స్థితి వీనులకున్ వినిపింపకున్న నే
సందియమంది యేమనునొ? సత్యవతీ! పరిపాటిఁదప్ప కా
సుందరి డాసి చెప్పినను జూపు నొకానొక తెన్ను సమ్మతిన్."

శా. నీలామార్దవ ధీరభాషణ సుధాసిక్తాశమై సత్యభా
మా లాలిత్య హృదబ్జ నిస్తుల వసంతంబై విరాజిల్ల నే
మాలోచింపక రుక్మిణీగృహము చాయంబోయె రక్షింప గో
పాలున్ మానపరాభవంబుల మదిన్ బాటింపకే యొంటిమై.

ఉ. మానిని రుక్మిణీగృహ సమాగమనంబొనరించి దాసితోఁ
బూని నిజాగతిన్ దెలుపఁబుచ్చి నిరీక్షణసేయునంతలోఁ
దోన లతాంగి భామను నెదుర్కొని కౌఁగిటఁగ్రుచ్చియెత్తి స
సమ్మానమొనర్చె; సత్యవతి ప్రాన్పడి నింప దృగంబుపూరముల్.

శా. కన్నీరొల్క వచించె సత్యవతి రుక్మాంబన్ విలోకించి "నీ
కన్నన్ దిక్కు లభింపమిన్ గనితి దుష్కార్యంబు గావించి; నా
తెన్నాలించి క్షమించి తోడ్పడనిచో దేవాదిదేవేశుఁ జే
బన్నంబందు; నదేని పన్నుగడ నిర్బంధంబు లూడ్పింపవే!"

శా. "అక్కా! మాయలమారినారదుఁడు డాయన్ వచ్చి నాగీముఁ గై
పెక్కన్ గొన్నిముఖస్తుతుల్ వలికి జీవేశున్ దులన్ దూఁచు నా
రొక్కంబిచ్చిన పుణ్యమున్ బతిమనోరాధత్వ సంప్రాప్తియున్
దక్కన్ నాకని మోసగించి పతికిన్ దాస్యంబుఁ గల్పించెఁగా!"

కం. "తక్కనని ప్రియుని ప్రేమ, గ
టక్కన లోఁబడితి నకట! టక్కరినుడికిన్
దిక్కేది? యిటుల వచ్చితి;
అక్కా! యీయార్తి నెటుల నడఁగించెదవో?" ౨౫౧

ఉ. "నిక్కము చెప్పెదన్ విను; తృణీకరణంబొనరించి యింటియం
దెక్కడనున్నవిత్తము మఱెక్కడ దాఁచిన హేమరత్నముల్
మక్కువ నాథు లోఁగొనఁ దులన్ బడవైచిన నాథుఁడున్న యా
దిక్కునుమంత నిక్క దది దేవరశక్తియొ! మానియుక్తియో!"

కం. "రమ్మా! కపటతులాభా
రమ్మాలోకించి మాకు ద్రాసముమాన్పన్;
సొమ్ములవియున్న గొంకక
తెమ్మా! యీడిగము మాన్పి దేవరఁ గొనఁగన్". ౨౫౩

కం. వలు తెఱఁగులఁ బదములఁ బడి
విలపించు సపత్ని సత్యఁ బ్రియవచనములన్
దలఁకుఁ దలఁగించి చనె నా
వెలఁదియు భామాగృహంబుఁ బ్రియు దర్శింపన్. ౨౫౪

ఆ. వె. వెలఁది సత్యభామ పిఱుదంటి రుక్మిణి
సవతి గీమునకును జనిన నచటఁ
దులను వెలయు హరిని బలియు సపత్నుల
నీసడించు దేవఋషిని గనియె ౨౫౫

కం. కలయుం గనుఁగొని నిజమున్
దిలకించి సభక్తి వాసుదేవు పదమ్ముల్
దలకలఁది దేవముని కా
వలఁ గేలుందమ్ము మొగిచి పదపడి నిలువన్. ౧౫౬

చం. నిలిచిన రుక్మిణీరమణి నీరజగర్భభవుండు చూచి "యో
కలికి! తులావ్రతానుగతి గాంతుఁడు నావశమయ్యె; నిందరున్
గలిసి పణంబొసంగని ప్రకారముఁ జెల్పితి; నింక నీవు గా
వలసిన విత్తమిచ్చి విలువందగు నాథు"ననన్ స్మితాస్యయై.

సీ. వైదర్భి తలవంచి వాసుదేవునికొగ్గి
కలహభోక్తకు నమస్కార మొసఁగి,
తులఁజుట్టి మూఁగిన తొయ్యలిపిండుల
ప్రేమాభిమాన మర్థించి ప్రీతి,
నావలి తులనున్న యర్థరాసుల డించి
యొక దెస నుంప భృత్యులకుఁ జెప్పి,
యెదుటనున్న తులసి వృక్షమ్ము కడ కేఁగి
యేమేమొ ప్రార్థించి హృదయమందు,

గీ. దళము నొకదాని గోసి వందన మొనర్చి
తిరిగి తులయొద్ద కేతెంచి యొఱఁగి బత్తిఁ
బట్టి తక్కెడసిబ్బిలోఁ బెట్టి తులసి
చేతులను మోడ్చి యెత్తి వచించె నిటుల. ౧౫౮

కం. "అణువులలో నణువును నతి
ఘనములలో ఘనమునై జగత్త్రయిఁ గుక్షిం
గొని సూక్ష్మగతిని వెల్వడ
వనకణమున దేవ! నీక వశమగుఁగాదే?" ౧౫౯

శా. "నీవే సర్వచరాచరుండవయి శ్రీకృష్ణాఖ్య, సన్మార్గులన్
గావన్ గూలుప దుర్మదాంధులను, సంకల్పించి జన్మించి యే
భావంబందున వారివారి కెది సంబంధంబు, యట్లే పున
ర్భావంబిచ్చుట సత్యమానెడఁ, దులాధారం బదృశ్యంబగున్."

చం. "భువనచతుర్దశంబులు ప్రభూ! ప్రభవించి నశించి డిందు యే
ప్రవిమలినేత్రచేఁ దృణము పర్వతమై సకలోర్వియాట సం
భవము, తదీయసత్కృప, మదర్పితమౌ తులసీదళంబు మా
ధవ! సరితూఁగదే భవదుదంచితనూత్నశరీరసామ్యమై!" ౨౮౧

ఉ. "ఎల్ల ధనంబులున్ మణులు నెల్లెడనున్న హిరణ్యరాసులుం
గల్ల; త్వదీయవిస్ఫురదఖండతనూపమమై యెసంగుటల్
పల్లవచూర్ణమైన సరివచ్చు భవత్పరిపూర్ణనిస్తులోత్ఫు
ల్లకటాక్షవీక్షణవిభూతి యొకించుకఁ సంతరించినన్". ౨౮౨

చం. మణులను నిన్ను బట్టఁగలమా! మఱి దానవిశేషభాగ్యభూ
షణముల నిన్నుఁ గట్టుటకు సాధ్యమె? మంత్రజపాదియోగసా
ధనమును నిన్ను గట్టగలదా? వరతత్త్వపవిత్రభక్తి సా
ధనమునగాక; యన్యగతి దామరనేత్ర! పాపమోక్షణా! ౨౮౩

కం. "ఏ నూత్నరూపి నామెద
లో సతతము నిలుచు, నట్టి లోకేశుండే
భాసిలి తులసీ దళమునఁ
దాసును నెక్కించుఁగాక! తనసమముగాన్" ౨౮౪

మ. అనునంతన్ సరితూఁగె నాదళము పద్మాక్షభారంబునై
మునివర్యుండు సపత్నులెల్లరును సమున్నిద్ధాంగులై నిల్వ రు
క్మిణి చేయూఁతయొసంగి డించె నను శ్రీకృష్ణున్ దులాద్వంద్వముల్
ఘనమున్ హీనము గాక యొక్కగతితూఁగన్ విస్మయంబై చనెన్.

చం. బిరబిర ముందుకున్ దరలి వేఁజనుదెంచిన సత్యభామ డ
గ్గఱిలి విదర్భరాజసుతఁ గౌఁగిటఁ గూరిచి పాదయుగ్మమం
దెఱఁగి దృగంబు బిందుకణ మేర్పడ నింపిన నంఘ్రిపంకజాం
తర మకరందమై చెలఁగినన్ సతి సత్య వచించె నీగతిన్. ౨౬౬

శా. "దేవేరీ! యవివేకనై సమదబుద్ధిం గ్రోధచేతస్కనై
నీవిద్యామహిమం బెఱుంగక సపత్నీ ద్వేషమాత్సర్యదు
ర్భావస్ఫూర్తి మెలంగితిన్; భవ దపూర్వజ్ఞానముఁ గాంచి నీ
సేవల్సేసి తరింపనెంతు భవదాశీర్భాగ్యసంప్రాప్తనై." ౨౬౭

ఉ. "ఎన్నిదినాలనుండి మదభీష్టసఖుండుగ జీవితేశుఁగా
నెన్ని, తదీయనిర్వహిత కృత్యములద్భుతముల్ నిరంతముఁ
గన్నులగాంచుచున్, మదిని గాంచ ముకుందుని గూఢతత్వసం
పన్నతఁ; గాల్పనే బ్రతుకు! పాపరజోగతి సంస్కరింపవే!" ౨౬౮

కం. ఇటు వగచు సత్యభామను
ద్రుటి డాసి మురారి యొత్తి దువ్వుచు ననె "నీ
పటుతత్వ పరీక్షకు నీ
ఘటనం గల్పించియుంటిఁ గమలదళాక్షీ!". ౨౬౯

శా. "నా యంతర్నిజతత్వముం దెలియు విజ్ఞానాత్మక ప్రాణి యే
నా యంతస్థితమౌ; రజోధిక తమోన్మాద భ్రమాలోలనఁ
డాయం జేరి పిఱుందనే మెలఁగినన్ భావానుబంధక్రియఁ
వేయున్ జన్మలకేనియుం గనునె? తన్వీ! నా నిజోదంతముఁ."

ఉ. నారదుఁ డంతలో బ్రణవనాద పురస్సర కృష్ణనామమే
పారఁగ గీరితించి హరియానతిఁ గైకొని యభ్రభాగసం
చారముఁ జేయుచు న్నిగమసారముఁ గృష్ణకథా విచారముం
గేరుచుఁ బాడుచుం జనె గణింపఁ ద్రిలోకులు తత్వవేత్తలై.

లయవిభాతి—

నిగమ పరిపాలన! విహగమపతి వాహన! యు
రగపతి శయాన! ముని సుగమ మృదుగానా!
అగణిత చరిత్ర! వరనగయుగలవిత్ర! పద
యుగళసుపవిత్ర! నత నగరిపు సుమిత్రా!
విగళిత తమోగుణ! వ్యపగత సురశత్రుగణ!
సుగుణమణి! మండన సుభగ నిరుపమా! వ
న్నగమథన! సర్వజన జగదవన! ద్విగుణి
త యశశ్చరణ యుగ! జనిత గంగా! ౨౭౨

## గ ద్య ము

ఇది శ్రీమదిందిరానాథప్రసాదలబ్ధ సహజకవితా విరాజమాన శ్రీమద్గౌతమసగోత్ర
దివివంశోద్భవ నరసింహాచార్యపౌత్ర వేంకటాచార్య రంగమాంబికాతనూజ
రంగాచార్యప్రణీత శ్రీకృష్ణాతిమానుషతత్త్వ తృతీయఖండాంతర్గత
ప్ర థ మా శ్వా స ము — సం పూ ర్ణ ము.



శ్రీరస్తు

శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీ కృష్ణాతిమానుష తత్త్వము



## ద్వితీయాశ్వాసము



కం. శిశుపాల మర్దనా! జిత
శశివదనా! శిశిర మృదుల జలజేక్షణ పా
పశమన! శాశ్వతభవనా!
శశాంకమౌళి విధి వినుత శశ్వచ్ఛరణా!

వ. అవధరింపుము —

ఉ. ఉత్తరదేశ మేలుఁ బ్రబలోన్నత సాహస వీర్య శౌర్య ధీ
రోత్తరుఁడున్ దిగంత నిబిడోద్ధత విశ్రుత దివ్యకీర్తి రా
జోత్తముఁడున్ బరాజిత నృపోత్కరుఁడున్ స్థిరచిత్తుఁడున్ గుణో
దాత్తుఁడు బ్రహ్మదత్తుఁడు నుదగ్ర పరాక్రమ భూరిసత్త్వుఁడున్.

కం. కనక, కవకెంత పరిమితిఁ
దనయుల నరికట్టి మతిని దపజపనియతిన్
దనిపి మహాకాళీసతిఁ
గనె నాతఁడు హంసడింభకాఖ్యుల స్వసతిన్.

ఉ. వారు సమస్త విద్యల నపార విశేష మనీషులై, బలో
దారులు వీరులై, రిపువిదారకులై రణరంగ శూరులై
దారుణ భండ నార్జిత మతంగ తురంగ ధరాధినాథులై
పేరు వహించి వర్ధిలిరి వీఁకను గాకను హంసడింభకుల్. 3

శా. రాజ్య వ్యాపక కాంతు సైన్య యుతులై రాజాధిరాజేంద్ర సా
మ్రాజ్యశ్రేణిగమించుచున్ విజయయాత్రావ్యాజమున్ జాటుచున్
ద్వ్యాజ్యౌదార్య విచిత్ర వేషులయి నిర్దాక్షిణ్యులై పొల్చి సం
పూజ్యాపూజ్యవిచారహీనులగుచున్ మోహాంధులై క్రాలుచున్.

మ. వ్యసనాలోలురునై వరాంగనల సంబాధించి పీడించి తా
పస బృందంబుల బీద సాదలను నిర్బంధించి గ్రామాదులన్
మసిఁ గావించి ధరా ధనార్జన నృపోన్మాదంబునన్ జౌర్య రా
క్షస వృత్తుల్గొని హంసడింభకులు దుష్టాచారులై రయ్యెడన్. ౫

ఉ. ఏమిట హంసడింభకు లొకించుక యెంచ రొకప్పుడేనియున్
సామము దానభేదములు స్వాంతము నందొక దండనక్రియా
భీమ విధానమే తగిలి వీడక క్షత్రియ ధర్మ విచ్యుతిన్
వామ పథానుసారులయి పాతకులై పరిపాటిఁ దప్పుచున్. ౬

సీ. "వీరు భూపతిలోకవీరుఁడై త్రుంగిన
కంసుని కంటె విఖ్యాత యశులె!
వీరు జగత్త్రయ భీముఁడై యొరిగిన
యల మురాసురు కంటె నధిక బలురె!
వీరు సురాధిప విజయుఁడై మ్రందిన
త్వాష్ట్రసుతుకంటె దోశ్శక్తి యుతులె!
వీరు నిరుపమాన విక్రముండై పాఱు
బార్హద్రథుని కంటె వాఁడి మగలె!

తే.గీ. వారలెల్లరుఁ గారించి వసుధఁ "దుదకు
వాసుదేవుఁడు శ్రీకృష్ణు వాతఁ బడరె!
వీరి గతి యంత కంటెను వేఱయగునె!"
యను నుడుల్ ములుకులై సోఁక నంతఁజెవుల. ౭

కం. అదరిపడి బ్రాహ్మ్యదత్తులు
బెదరున నిజగురు నియుక్తి విధియుక్తముగాఁ
బదపడి యుపక్రమించిరి
మదనాంతకుఁగూర్చి తపము మననార్చనముల్. ౮

ఉ. భావము నందుఁ గీల్కొలిపి భర్గు నహర్నిశలన్ జలంబులన్
బావకకీలలన్ వనుల వాయు జలాశనులై తపించి దు
ర్భావములం జయించి శతవాసరముల్ మునివృత్తి నుండినన్
శైవకులాగ్రగణ్యులయి శంకరు ప్రాపక మబ్బె వారికిన్. ౯

శా. సాక్షాత్కార మొనర్చి శంకరుఁడు "మీసద్భక్తికిన్ ముగ్ధుఁడన్
రక్షోదైవిక శక్తులన్ మిగులు శౌర్యాటోపముల్ గూడెడిన్
మోక్షప్రాప్తి లభించు నంతమున మీ భూభాగము న్జేరి రా
జ్యక్షేమంకరులై మెలంగుఁ" డని యాజ్ఞాపించి యేఁగెన్వడిన్.

ఉ. అంతట హంసడింభకు లనంత జవంబునఁ జేరి రాష్ట్రమున్
మంతనమాడి కొంత హిత మంత్రి పురోహిత ముఖ్యబంధు సా
మంతులతో గడించిన యుమాపతి సద్వరము న్వచించి సి
ద్ధాంత మొనర్చి రెట్లయినఁ దామ్మురసాక్షుని మట్టుఁ బెట్టఁగన్. ౧౧

ఉ. నూటికిఁ దాఁకి పోర మధుసూదను నెమ్మొయిఁ జాలమున్న పెన్
ధాటి ముకుందుఁ డెల్లెడలఁ దాపస, భక్త జనాంతరంగుఁడై
పాటిలు చొప్పఱింగి హరిభక్తుల మిత్రుల కెగ్గుఁ గూర్చి పో
రాటమునన్ జెలంగిరి దురాత్ములు నిచ్చలు హంసడింభకుల్.

ఉ. వల్వరు కృష్ణవత్సు నరపాలుర రాజ్యము లూడ్చి యంతటన్
నిల్వక వాసుదేవ దయనీయ సుహృద్వరుఁడై మహోప్తుఁడై
సాల్వుని రాష్ట్రముం జెనకి సాంతము బూది యొనర్చి యుర్వరన్
గొల్వనఁ జొచ్చి యానృపుని న్యూనముగా వెలికీడ్చి తన్నినన్.

మ. నిజ కాంతాహితబంధువర్గములతో నీరాన్న నిద్రాదులన్
బ్రజలన్ రాష్ట్రము సర్వమున్ వదలి దుష్ప్రాప్యావగారణ్య శై
ల జనస్థానములం దరించుచుఁ బ్రఫుల్లాంభోజ హృత్కర్ణికన్
ద్విజరాడ్వాహునినిల్పి ద్వారకగమించెన్ రాజయోగీంద్రుఁడై.

చం. తన యనుయాయి దుర్గతి విధానము మున్న యెఱింగియుంట రా
ణ్మని యెవరేనియున్ బురము నుంగిటికిన్ జనుదెంచెనేని స్యం
దనము నొసంగి గౌరవమునన్ నిజ ధామముఁ జేరిపింప శా
సనమిడె దుర్గపాలురకుఁ జక్రి శ్రితార్తి హరుండు గావునన్.

ఉ. సాల్వుని రాక వేచి కని స్వాగత మిచ్చి మృదూక్తు లాడుచున్
గేల్వడిఁ గేలుకొల్పి పెడఁగేలునఁ దోడ్కొనిపోయి లోనికిన్
జెల్వగు నాసనంబును రచించి స్రవించు ముదంబు బాష్పముల్
గాల్వలు గట్టినన్ దుడిచి క్రన్నన శౌరి వచించె నీగతిన్. ౧౬

శా. "రాజా! నీయుపవాస పద్ధతికి వైరాగ్యాకృతి ప్రాప్తికిన్
వ్యాజం బించుకయుంగఁగాఁ దగునె! సప్తాంగ ప్రజానీకమే
రాజ న్వర్ధిలు! భృత్యమిత్రులకు దుర్భాగ్యంబు లేదన్న ? నీ
తేజోహీనత కేమి కారణము ? చింతింపన్ దురూహ్యంబగున్."

కం. సాల్వుండు గమ్మంగొనలను
వెల్వడు కన్నీటిదోనలు వెల్లువలై పెన్
గాల్వలునై ప్రవహింపఁగ
నిల్వంబడె యిట్టులనియె నిశ్చలగతుఁడై. ౧౭

శా. "స్వామీ! నీమది కందరాని యొక యంశంబున్నె యొందేని? నా
క్షేమోదంతము ద్యోతకంబుగద నిశ్శేషంబుగా నీకు! నీ
ప్రేమాంభోనిధిఁ దేల్చి ప్రోచెదవొ! యీరీతిం గటాక్షించి నీ
సామీప్యస్థితిఁ గూర్చి నిల్పెదవొ? యాజ్ఞాపించి మన్నింపవే."

చం. అన నగి వాసుదేవుఁ డనఘా! చిరకాల మొకేవిధంబుగాఁ
జనునె? పురాకృతక్రియలు సాంతముగా ననుభోజ్యముల్ గదా
యనిమిషభర్త కేని! నిను నావల కీడ్చిన హంసడింభకుల్
మనుగడఁ ద్రుంచు కాలము విలంబన లేకరుదెంచు నమ్ముమీ!

కం. అని బుజ్జగించి సాల్వుని
మునివృత్తి నిమాన్పి యశనమును దినిపించెన్
వనమాలి సానుచరముగ
మనుజేశుని నిల్పుకొనియె మందిరసీమన్. ౨౧

ఉ. శౌరి నిజాశ్రయం బొసఁగి సాల్వుఁ బ్రియంబున నాదరించు టే
కారణ మౌని యెట్లయినఁ గయ్య మొనర్పఁగ హంసడింభకుల్
చీరి జనార్దనాహ్వయు విశిష్ట పురోహిత పుత్రు దూతఁగా
ద్వారక కంపి రచ్యుతుని పాలిటికిన్ వివరింప దౌత్యమున్. ౨౨

ఉ. అంత కుశస్థలీపురి కహర్నిశముల్ పయనించి చేరి దై
త్యాంతకు దుర్గ మారసి నిజాగమనార్థ మెఱుంగఁ జేయ శు
ద్ధాంత విహారి పంకజదళాక్షునకున్ విలిఖించి కమ్మ న
త్యంతజవంబునన్ నిజ సభాంతరసీమకుఁ జీరె నాతనిన్. ౨౩

చం. పిలిచి సుఖాసనం బొసఁగి విప్రకుమారున కర్ఘ్యపాద్యముల్
సలిపి సమాఖ్య దేశముఁ గులంబు సమాగమకారణం బొగిన్
దెలుప మురారి వేఁడికొనఁ దేకువ నాతఁడు హంసడింభకుల్
దలఁపును దౌత్యసంగతి యథావిధి నిట్లు వచించెఁ బూన్కిమైఁ.

ఉ. "నేను జనార్దనుండ; ధరణీసురపుత్రుఁడ; బ్రాహ్మ్యదత్త భూ
జానుల మిత్రుఁడన్; సబల శౌర్య పరాక్రమ దుర్నిరీక్ష్య తే
జోనిధు లన్మదీయ నృపసూనులు, గర్విత శత్రు దంతి పం
చానను లార్జితోర్జిత యశస్కరులున్ జిత చండభండనుల్."

కం. "వారు త్రిలోక యశోలం
కారులునై హంసడింభ కాహ్వయులై చె
న్నారుదురు; వారి వీరవి
హారము లెపుడేని నుంత యాలించితివే." ౨౬

శా. "గోపాలా! విని హంసడింభకుల యత్యుద్రప్రతాపంబుని
ర్వ్యాపారత్వముఁ జెందు భూపతతి మూర్ఛావేగమున్ బొందుఁద
త్కోపాగ్నుల్ దలపోయ స్వప్నగతిఁ దత్ప్రోద్ధాకృతుల్ పోరునన్
జూపట్టన్ హృదయాంగముల్ ప్రిదిలి సంక్షోభించు వ్యాలోలతన్."

మ. "యమపాశంబు సహింపఁగాఁ దగును వృత్రారాతి దంభోళి దు
ర్దమ సంపాతము నోర్వవచ్చు, లయమార్తాండానలోదగ్ర దా
హము సైపం దగు హంసడింభక నృపాలాఖర్వదుర్వార వి
క్రమ తేజోద్ధతి దుర్నిరీక్ష్యముఁ ద్రిలోకాకంప నాపాదమా." ౨౮

చం. "ఎఱిఁగియెఱుంగకో యదుమణీ! నృపసింహులు హంసడింభకుల్
పరమ విరోధి సాల్వపతి వచ్చిన నాశ్రయమిచ్చితంట తొం
దరపడి, యీ మహాపకృతి దారుణమైన క్షమింతురంట మా
నరవరు లిప్పుడేని, నరనాథుని సాల్వుఁ ద్యజించి పుచ్చినన్." ౨౯

చం. "అరమర లేక మా నృపతు లాహవమున్ బ్రకటింప నెంచ భూ
సుర విహితుండవౌట మదిఁ జూచి ధరాదివిజుండఁ గాన సం
గర విషయంబు మానిపి సమాగమనం బొనరింతు దూతనై
మరణముఁ గోరుదో! తుదకు మైత్రిఁ జిరాయువుఁ గోరుకొందువో."

కం. ఇటు పటు కఠోర వాక్తతిఁ
గటువుగఁ గురిపింప హాలి కటకటపడి సం
కటగతి గద పైకెత్తుచుఁ
జటులాకృతి డగ్గఱన్ బ్రశాంత మటంచున్. ౩౧

వ. శౌరి వారియపుర మధ్యస్థలికి దుమికి బలరాముని వారించుచు నిట్లనియె — ౩౨

శా. "అన్నా! దూతవధింపఁగాఁ జనునె ధర్మాధర్మముల్ వీడి? యే
త న్నీచాత్ముఁడు విప్రుఁడౌటను నహాంతవ్యుఁడుగా! వీనికిన్
మన్నీ లేమి వచించిరో యదియు సంభాషించుటే ధర్మ మీ
వన్నాగంబుల కెల్ల బాధ్యులు నృపుల్ బాధింప కీబావనన్."

తే.గీ. అని జనార్దనుఁ జూచి యిట్లనియె "బ్రాహ్మ
ణ బ్రువా! యజనాధ్యయనాది విధుల
మాని యప్రియ భాషణ మూని దౌత్య
వృత్తిఁ గైకొన్న నిను గారవించు టెట్లు?" ౩౪

ఉ. "దౌత్య మొనర్ప వచ్చితిగదా ధరణీసుర! నీతిలేని సా
హిత్యము గాని యుక్తుల వచించుట పోలునె? ఆతతాయి సాం
గత్యమునన్ బశుత్వ మవమానము బొందితి భూసురుండవై
ప్రత్యపకార మూనము భవాదృశ దుర్బల దేహధారిపై." ౩౫

కం. "ఐన నొక మాట మీ భూ
జానులు సరియైన పోటు క్షత్రియకుల స
త్వానులయేని చతుర్విధ
సేనలతో నెత్తిరా వచింపు టుచితమా." ౩౬

మ. అనఁ జక్రాయుధుఁడా ధరామరుఁడు కంపాయత్తుఁడయ్యున్ వచిం
చెను డగ్గుత్తిక "హంసడింభకులు దుర్జేయుల్ రమానాధ! భ
ర్గుని మెప్పించి వరంబులం గొనుట, నీగూఢాంశ మూహించి, సం
ధినిఁ జేకొంట వివేకమానుగద! చింతింపంగ దేనెమ్మదిన్." ౩౭

కం. అనెడు జనార్దనుఁ గని నగి
జనార్దనుం డిటు వచించెఁ "జాలును హితబో
ధన, తరలి రాజధానికిఁ
బనుపుము మీశూరవరుల బవర మొనర్పన్." ౩౮

చం. అన, నిజరాజధానికిఁ ధరామరుఁ డేగి వచించినంత నే
కినుకను హంసడింభకులు కృష్ణుని సంహరణంబొనర్ప సా
ధనయుతులై ససైన్యముగ దాఁటి సముద్రము ద్వారకాపురిన్
గొనకొని ముట్టడించిరి ముకుందుఁడెఱింగి తదీయవృత్తమున్.

చం. అరులు కుశస్థలీ పురసమాగమనం బొనరించి నంత నే
శరనిధిదాఁటి, వార్ధిగత శైలగుహాంతర గూఢచారులై
పరఁగెడి నావికుల్ వెడలివచ్చి సరాసరి, ముట్టడించు న
త్తరి పురదుర్గ సైనికులుఁ దార్కొన నాజ్ఞయొసంగి యుండుటన్.

కం. ఇరుగడల నుండి చుట్టిరి
బిరబిరఁ దోతెంచి వృష్ణివీరులు, రిపులున్
మరలి చనుట కవశంబై
పురోగమించుటకు వీలు పొందక యుంటన్. ౪౧

చం. వెఱఁగొని హంసడింభకులు భీతిని నాత్మభటాళిఁ బ్రోవఁగా
వెర వెదియున్ స్ఫురింపమికి భీమవరాగత శూల మేయ ని
వ్వెఱగని రంత యాదవులు వింటికి మంటికి సాఁగి ప్రాఁకి ది
ర్దిర దిరుగన్ శివాయుధ మరిష్ట గతిన్ వెఱపించి మించుచున్.

చం. కదలి హృదిన్ వ్యథన్ దవిలి కయ్యమువీడెడి సేనఁ జూచి భీ
ప్రద గద మంత్రయుక్తముగ రాముఁడు వేయఁ ద్రిశూల వేగమున్
బొదవి నివృత్తిఁజేయుచు నభోంతరవీధిని దాఁకి త్రుంచినన్
యదువరు లుత్సహించి చని రాహవకేళి కరాతి మార్కొనన్.

శా. శూలాటోపము వ్యర్థమై చనుట హృచ్ఛూలంబుగా డింభకుం
డాలోలుండయి వింటఁగూర్చి నిటలాక్షానుగ్రహప్రాప్తమా
వ్యాళాస్త్రంబు సమంత్రకంబుగను వేయన్ హాలి వారించె ను
ద్వేలోగ్రోరగపాతభీతి ఖగరాడ్భీమాస్త్ర ఘాతంబునన్. ౭౭

శా. హంసుం డాగ్రహుఁడై కలంగుచు ధనుఃజ్యాటంకృతిధ్వానముల్
హంసత్క్ష్మా కకుబంతముల్ పరువ జ్వాలాతోరణం బేసినన్
హంసద్వాదశ సన్నిభంబయిన, శ్రీనారాయణాస్త్రంబు వి
ష్ణ్వంశోద్భూతుఁడు హాలియున్ విసరి చల్లార్చెన్ శిఖిజ్వాలలన్.

ఉ. డింభకుఁ డంతఁ బోక భ్రుకుటీకృత వక్ర వికార ఫాలుఁడై
త్ర్యంబక దత్తశక్తిని, పరంతప శక్తి విపక్షభుక్తి లో
కంబులు బెగ్గడిల్లఁ దమకంబున వేయ హలాయుధుండు హ
స్తంబును జాచిపట్టుకొని శక్తి మరల్చె నరాతి సేనపై. ౭౮

చం. మరలుచు శక్తి పైకెగసి మంటలఁ గ్రక్కుచు మింట నుండియు
ర్వరధర బాహ్వశ్వదత్త భటవర్గముపైఁ జని కాల్చివేయు న
త్తరిఁ బరికించి డింభకుఁడు స్థాణుఁ దలంచి గ్రహించినంత న
త్వరమ తిరోహితంబయి యథాస్థితి గల్గి మెలంగె సైన్యముల్.

ఉ. అంతట హంసడింభకులు హాలిగనుంగొని చెప్పిరేము దై
త్యాంతకు మట్టుపెట్టుటకునై చనుదెంచిన నాఁచ నేల ? మా
వంతముఁజెల్లు దాఁక మిముఁబాయుదుమే ! బలవంతుఁడేని మ
మ్మంత మొనర్ప రమ్మను దురంతము చేకురు మాకొ వానికో.

మ. అనినంతన్, హరి హంసడింభకులకున్ సాక్షాత్కరించెన్ గనుం
గొన నే దిక్కునఁజూచినన్ గనలి పెన్గోలల్ ప్రయోగించి మా
ర్గొన శ్రీకృష్ణుఁ డదృశ్యుఁడౌటనృపులాక్రోశించి రుద్రాప్త మా
ర్గణ శస్త్రాస్త్రము తేయ నన్నియును వ్యర్థంబైన దుర్యోగమున్.

మ. కని దైత్యారి సస్మితుండగుచు సంజ్ఞన్ జేసినన్ హాలి భీ
షణుఁడై ప్రోబ్బి ధరన్ గదాహతుల హంసాఖ్యాతు నాడింభకుౝ
బనిచెన్ భానుజునింటి చుట్టములుగా, వారంతముం జెందినం
తనె సంగ్రామమునాఁపి పోఁబనిచె సేనానీకమున్ శౌరియుౝ.

వ. అంతఁ గొన్ని నాళ్ళు గడచిన — ౫౦

శా. వచ్చెన్ గొండొక సత్రయాగమున దుర్వాసుండు యోగీశ్వరుల్
విచ్చేయన్ సవనక్రియల్ గన, నటన్ లీలానరాకారు శ్రౌ
ర్యాచ్ఛాఖ్యాతము ఖ్యాతమా కతన దుర్వాసుండు మర్షింప "శా
మెచ్చుల్ మీఁగడమ్రుచ్చు శోధఁగని ప్రేమింతున్ దుదిన్ జూడుఁడీ!"

మ. అని దుర్వాసుఁడు నేలుగాఁదరలి డాయంజేరి ద్వారావతిౝ
వినిపింపన్ దన రాక మాధవునకున్ భృత్యాళితో వెంట రు
క్మిణితో నర్ఘ్య విధుల్ గ్రహించి యెదురేఁగెన్ నీరజాక్షుండు భ
క్తిని సంప్రీతిని గౌరవాదరములున్ దీపింప నెమ్మోముపై.

ఉ. చాఁగి సతీసమేతుఁడయి శౌరి నమస్కృతు లిచ్చి నంత నే
మూఁగి భటాళి కేలుఁదమి మోడ్పులన్ బొనరించి సాఁగ ని
ర్వ్యాకుల ముఖ్యబంధు పరివారముఁ దీర గృహాంతరస్థు నా
యోగి నొనర్చెఁ జక్రి కనకోజ్జ్వల పీఠి నొసంగి బత్తిమై. ౫౪

శా. ఆసీనుండగు మౌని కర్ఘ్యమును బాద్యం బిచ్చి యిట్లాడె "నా
యాసం బొందితి దవ్వులన్ గడచి, నాహర్మ్యంబు యుష్మత్పద
న్యాసత్వంబునఁ వెల్గెబావనముగౝ మౌనీంద్ర! యేదో భవ
ద్దాసుం డీతఁడు పూన నాఁదలను జిత్తం బౌనా శాసింపవే!"

కం. వినయోక్తుల నిటు మునితో
ననఁ గినుకను నభినయించి యతి కృష్ణునితో
ననె "గజదొంగతనమ్ములు
ననుఁబోటుల ముందు సాఁగునా కమలాక్షా!" ౫౬

మ. ఇటు భాషించుచు విస్ఫులింగములు వర్షింపన్ గనుం డోయి వి
స్ఫుట పిండంబు లొనర్చి యన్నముఁ దనుస్ఫూర్తిన్ విడింబింపఁ బ్రా
కట వేగంబున లేచి పిండ చయముల్ గాయంబునన్ రుద్దఁ జెం
గటి శ్రీరుక్మిణి నివ్వెఱంగన రమాకాంతుండుఁ గన్నోడ్పఁగన్.

కం. బిరబిర నోరెవ్వు టుండల
శిరము మొదలు కాలివఱకు శివమెత్తినటుల్
మొఱ కుందనమున రుద్దుచుఁ
జరణములను గాలి వేళ్ళఁ జాయకుఁ దుదిరా. ౬౮

కం. కరములను బట్టికొని త
త్కరబంధములందుఁ జొన్పి కమలాక్షుఁ డనెన్
"సరియింక నూరుకొను మీ
కరుణామయ! మేరవలదె! కరుణకు నేనిన్".　౬౯

శా. "మీ యీ మర్దన భాగ్యరాశి రణభూమిన్ వజ్రవర్మంబ, కా
నీ, యాతంకమ కర్మశేషమునకున్; దేహంబు సర్వంబు నా
పాయంబౌ నెడ, భిల్లు నాశుగ మెటుల్ బాధించి పోకార్చు నా
కాయంబీ యవతారపుందుది, మఱో కాయంబుఁ గల్పింతువే?"

శా. నాదుర్వాసుఁడు నిశ్చలుండయి "నమోనారాయణా! మాదృశుల్
శోధింపంగలరే భవన్మహిమ! నాలో మార్పు చేకూర్ప స
ద్బోధన్ గూర్చితి వీదొసంగుఁ గృపతోఁ దూలించి నన్నేలు కా
మ్మీ! దోషింగద!" యంచు వేఁడుకొన భాషించెన్ రమేశుండిటుల్.

మ. "ఋషిచంద్రా! యుపకారమున్ సలిపి వేఱేలాగు భాషింతు! రా
జసవృత్తిన్ దురపిల్లు భారత రణత్సొన్మపాత నానాస్త్ర దు
ర్విషలిప్తేషువు లస్మదీయ తనువున్ భేదింపఁగా లేవు, నీ
యసమానోదన మర్దనక్రియ శరీరాయాసమున్ మాన్పడే."

చం. "మునివర ! నా శరీరమును ముట్టి శ్రమంపడి మర్దనంబు చే
సిన ఋణ మీఁగఁజాల" నన శ్రీహరి, తాపసి హర్ష బాష్పముల్
దొణకఁగ స్తబ్ధుఁడై నిలిచి దోసిలియొగ్గి యనుగ్రహింపవే!
యని కదలెన్ బ్రయాణముఖుఁడై వనమాలియు సమ్మతింపఁగన్.

# సుభద్రా పరిణయము

శా. కారాగార విముక్తి కిన్ బిదప గల్గన్ దేవకీదేవికిన్
గారా మేర్పడఁగా సుభద్రయను బంగారంపు మేల్ మొల్క క
న్యారత్నంబయి మీఱె జవ్వనుల విద్యాయౌవనప్రాప్త య
శ్వారోహాస్త్రవిశేషయై సుభగ ధీసౌజన్య సౌశీల్యయై. 20

ఉ. అన్నలుఁ దల్లిదండ్రులు గుణాంకిత భద్ర సుభద్ర నెమ్మిమై
మన్ననఁ గన్న, నెచ్చెలికి మక్కువ యెక్కుడ చక్రపాణిపై
నన్నులమిన్న గూఢవిషయంబు లభీష్టము మంచి నెచ్చెలుల్
విన్నప మాచరించు మురళీధరుతో సరివేళఁ జూచుచున్. 21

ఉ. జవ్వని నా సుభద్ర నృపచంద్రున కిచ్చి వివాహకార్యమున్
నివ్వటిలంగఁ జేయుటకు నిశ్చితమైన లతాంగి చక్రితోఁ
గవ్వడిఁ దక్క నొండొరులఁ గాద నె; నొప్పమి హాలి ఫల్గునున్
సవ్వడి చేయ కా కమలనాభుఁడు నాఁటికి నాఁపెఁ బెండిలిన్.

వ. ఇంతలో — 23

శా. యాత్రార్థంబయి యోఁగివచ్చి, తుద ఋష్యాకారమున్ దాల్చి యా
సుత్రామాత్మజుఁ డాసమాగమనమున్ సూచింప, ద్వారావతీ
గోత్రస్థుండయి యబ్జనాభునకు; సంకోచింపకే పోయి త
త్పాత్రౌచిత్యము మెచ్చివచ్చె బురికిన్ వార్ష్ణేయుఁడుత్సాహియై.

ఉ. చొచ్చి పురంబునందు మధుసూదనుఁ డత్తఱిఁ జాటఁబంచె దా
నచ్చుపడంగఁ జారులకు హస్తపరీక్షకుఁ డద్రిమీఁదికిన్
వచ్చెఁ దదీయశక్తియు నపార మభూతము భావిసంగతుల్
పొచ్చెములేక చెప్పు నని మోహితులై ప్రజ లాలకింపఁగన్. ౭౫

ఉ. వారలు దీరి పౌరులు శుభోదయ మంచు ధరాధరంబుపైఁ
జేరి తదీయ కందరము చేరువఁ గైతవయోగికి న్నమ
స్కారము లిచ్చి భావిగత సంగతులన్ దెలుపంగ వేఁడి రీ
తీరు నొకళ్లొకళ్ళకుఁ బ్రదీపితమై చని ప్రాఁకెఁ దత్పురిన్.

మ. బలి యాత్మీయ భవిష్యదంశము వినన్ వాంఛించు శ్రీకృష్ణు శ
క్తులు సాముద్రిక శాస్త్ర మందుఁ దెలియన్ గోరున్ సదాశాపురన్
జలజాక్షుం గొనిపోయెఁ గృత్రిమ ఋషి న్దర్శింపఁగా నద్రికిన్
బలియున్ బాంధవ భృత్యవర్గములుఁగా న్త్వారనుల్ ముట్టి రాన్.

మ. చని యచ్చోట నిమీలితాక్షుఁడయి హస్తన్యస్త రుద్రాక్ష భా
జనుఁడై, బద్ధ జటావితానుఁడయి సాక్షాచ్ఛంకరాకారుఁడై
చను నాకృత్రిమ మౌనిఁ గాంచి బలి సాంష్టాగంబు లర్పించి, ని
ల్చినఁ జేసన్న ననుజ్ఞ యిచ్చె ముని యాసీనంబుగా వారికిన్. ౭౬

శా. ఆసీనుండగు హాలిఁ జూచి యిటు పాకారాతి సూనుం డనెన్
"దేశోద్ధారకు లీవు రమ్మనుచు సందేశంబుఁ గావించుచో
నేసన్యాసియుఁ బ్రీతి మీకడకు రాఁడే! యీశ్రమం బేల? మీ
దాసుండన్ దమ కేదికావలెనొ యాథార్థ్యంబు వాక్రువ్వరే!"

చం. అన నగువెన్నెలల్ మసలి యాస్య శశిన్ వెలిఁగింప శౌరి యి
ట్లనియె "మునీశ్వరా! తమకటాక్షముఁ గోరి నిరీక్ష చేయు మా
జననియు వృద్ధభూమిపతి చాయలు చూచుచు నున్నవారు మీ
యనుమతియేని మాగృహముఁ బ్రాజ్య మొనర్పుఁడు పాదధూళిచే."

చం. బలియును దోసవేఁడుకొనఁ బావనముం బొనరింప మందిరం
బులఁ బదపద్మధూళి, మునిపుంగవుఁ డందుల కీయకొన్న నా
బలి హరు లర్ఘ్యముం దెలుప వారి పిఱుంద మునీశుఁ డేఁగి యం
దలమునఁ జేరె రాజభవనమ్ముల నిమ్ముల సమ్ముదమ్మునన్.

ఉ. అంతిపురంబు నందొక గృహాంతర మందున నిల్చి మాని సీ
మంతిని సోదరిన్ బిలిచి మాధవుఁ డేమొ చెవిన్ వచించి యే
కాంతమునన్, సహోదరుఁడు హాలికిఁ బెద్దల కిట్లనెన్ "నియో
గింతు సుభద్రఁ దాపసి యభీష్టగతిన్ బరిచర్య చేయఁగన్"

ఉ. ముద్రిత భద్రలక్షణ ప్రబుద్ధ సుభద్ర సముద్రభూమి భృ
న్ముద్రకుఁడై ధరావలయమున్ గని చుట్టిన భద్రమూర్తి సా
ముద్రిక శాస్త్రవేత్తయని ముద్రికఁ గన్న విదగ్ధరాశి స్థై
ర్యాద్రి, కిరీటి కృత్రిమ విరాగికి, సేవలొనర్చు చున్నదన్. ౭౪

సీ. కనుమోడ్చి జపనిష్ఠఁ గనున ట్లభినయించి
మర్మము లంట దృక్కొమ్ముల వఱచు
అర్చన ద్రవ్యంబు లందించు వేళల
నెఱుఁగ నట్టులఁ దగిలించుఁ గేలు;
సాష్టాంగ మర్పించు సఖియ హస్తాబ్జముల్
గేల్దమ్మిఁ గీలించి లేవనెత్తు,
వేదాంత విషయముల్ పృచ్ఛింప దగ్గఱి
లలన దర్పణ కపోలములఁ బుణుకు;

గీ. పూజ లర్పించి తరలు పూఁబోణిఁ బొంచి
తిగిచి కబరీభరంబు వెన్ దగిలి మరలు
గొలువుఁ గైతవయోగి తన్ గొలుచు నా సు
భద్ర మనసాని యొరుల కన్ బ్రామి యెలమి. ౭౫

ఉ. నాటిన ప్రేమబీజములు నాఁటికి నాఁటికి మోఁక లెత్తి బా
హాటముగా ననల్ దొడిగి యంకురముల్ విదళించి సాఁగి చె
ల్లాటముగా వడిన్ బెరిగి రామకు నర్జునుపైఁ గిరీటి కా
పాటలగంధిపై మమత వల్లరు లల్లి పెనంగి పొంగినన్. ౮౬

సీ. వాఁడిచూడ్కి నిగిడ్చి పరవశుండగు ప్రియుఁ
గలికి చూపుల నింపి కదలఁ జేయు;
కేల్సాఁచి యలచేతిఁ గీలించి చెలికాని
నలఁగంటఁ జూచి దగ్గఱకుఁ జేరు;
గుత్తించి యదను నక్కునఁ జేర్చి నిజసఖుఁ
బక్కున నవ్వి గుబ్బలను గ్రుమ్మ
నాఁచరాని తమి ముద్దాడఁ జెలుండు మా
ఱొడ్డి యందిచ్చు బింబోష్ఠఫలముఁ

గీ. గురుల నిమిరెడు నంగుళుల్ దఱిమి పట్టు
నోసరిలి మోము మోమున నొదుగఁ జేయుఁ
బరిచయమ్మున హృదిలోనఁ బాఁదుకొనిన
ప్రేముడి సుభద్ర మన్మథ వివశయగుచు. ౮౭

ఉ. ఈ విషయంబెఱింగి తుది కృష్ణుఁడు రామున కీయుదంత మెం
తే విశదీకరించిన ననిష్టము చేఁ గలహించు నంచు స
ద్భావముఁ బూని దాఁచి కులబంధుల వృద్ధులఁ బంపివైచెఁ దా
రైవతకోత్సవంబులకు రాముని దోడ్కొనిపోయె వైళమే.

శా. ఏమో చెప్పి సుభద్రతోడఁ జెవిఁ బోయెన్ జక్రి సంరంభుఁడై
రాముండున్ వినునట్టు లిట్లనె "సుభద్రాభద్ర! మీయోగి కే
మేమేఁ గావలెనో కనుంగొనుచుఁ బూజింపంగదే బత్తిమై!
మే మీనాఁడె గృహంబుఁ జేరుదుము లే! మీరుండుఁడిచ్చోటనే!"

శా. ఈ రీతిన్ వచియించి చన్న సమయం బీక్షించి సందీయఁ ద
న్నారీరత్నము స్యందనం బొకడు సన్నద్ధంబు గావించి తా
సారథ్యంబు వహించి వీఁకను ధనుస్సంధానుఁడై పార్థుఁడే
పారన్ ద్వారకయున్ బయోధి నెటులో వారిర్వురున్ దాఁటుచో.

ఉ. రైవతకాద్రి నున్న హరి రాములతో భటు డొక్కఁడేగి యెం
తే వినయంబు మీఱ వివరించె నుదంతము; హాలి యుగ్రుఁడై
యీ విపరీత మెందుఁ గలదే! యని శ్రీహరి నొవ్వఁబల్కి సే
నావృతుఁడై వెనుందగిలె నర్జును నాత్మసహోదరీమణిన్. ౯౧

వ. ఇంతలో — ౯౨

చ. నిజ మెఱిఁగించి పెద్దలకు నెయ్యపుఁ దల్లికిఁ దండ్రి కంతఁ బం
కజనయనుండు సమ్మతిలఁగా నొనరించి వివాహమాడ నా
విజయునితో సుభద్ర వినువీథి గరుత్మత వాహనుండునై
విజన వనాంతరస్థలి భువిన్ డిగి యచ్చటఁ గాచుచున్నచో. ౯౩

చం. అచటి కలంతి దవ్వులను స్యందన మాఁపి కిరీటిఁ జెల్లెలిన్
సచలితులం బొనర్చి నిజసైన్యము తోడుత ముట్టడించి దు
ర్వచన పురస్సరంబుగను భాషణ చేయు దురాగ్రహున్ బలిన్
గిచకిచ లాడు సోదరిని, గీడ్పడి చూచు నరుం గనుంగొనెన్.

మ. కని చక్రాయుధుఁ డీపృథాసుతుఁడు సంగ్రామంబుఁ గావించు నే
వెనువెంటం బర తెంచి వచ్చిన మహాభీమప్రవాహంబుతోఁ
గనుఁగొందున్ నరు నిశ్చలత్వము భుజస్కంధోన్నతిన్ సాహసం
బనికొండొక్కముహూర్తమాత్రనిలిచెన్ హార్యక్షమధ్యుండటన్.

వ. సుభద్రార్జునుల బలరాముండు దరిసి వారిని ససైన్యుండయి వలఁగొనియిట్లనె —

ఉ. "ముచ్చు విధంబునన్ దపసి రూపున నంతిపురంబు లోనికిన్
జొచ్చి యెవారు లేనితఱిఁ జూచి భళీ! ముకుఁబచ్చలార కే
పిచ్చయుఁ బొడియుం దెలియఁబోని సహోదరి ముద్దరాలిఁ బెన్
మచ్చులు గ్రుమ్మరించి పెడమాటకుఁ దెచ్చితి పోవనిత్తునే?" ౯౭

ఉ. "ఏమి మొగంబుఁ బెట్టుక హరించితి వీయమ, రాజుపోలికన్ !
భూమిధవుల్ గ్రహించి తమబుట్టుకఁ బూర్వము మీకుఁబెండ్లికై
లేమల నీని హేతువున లేమ నొకర్తు వివాహ మాడు మీ
సామితనం బెఱుంగనిదె ! చాలును జెల్లిని దింపి పోఁదగున్." గా

ఉ. పోటు నుడుల్ వచింప నిటు పోటుమగండు కిరీటి యిట్లనున్
"నోటికి వచ్చినట్టులన నొవ్వను జుట్టరికంపుఁ బ్రీతి ని
ప్పాటలగంధి నం దవిలి వచ్చెనా ? నా బలవంత సంగతిన్
మీటిన వచ్చెనో ! తెలిసి నింద యొనర్పుమ తెల్లమై చనున్."

మ. అన సైరింపక హాలి కోపగతి "నాయాదేశ మాలింపకే
మనుదిం కోర్వ" నటంచు సైనికులతో నర్జునునిం గట్టి కై
కొని రా నాజ్ఞ యొసంగ సైనికులు సంకోచింపకే పెక్కుమా
ర్గణపంక్తుల్ గురిపించి రర్జునునిపై గాండీవియున్ గిన్కమై.

శా. గాండీవమ్మునఁ గూర్చి బాణములసంఖ్యాకంబులై వచ్చు త
త్కాండమ్ముల్ బహుఖండఖండములుగాఁ గావించి సమ్మోహనో
ద్దండాస్త్రమ్మున నిద్రపుచ్చ బలి క్రోధమ్మూర్తి సీరంబు దో
ర్దండంబందు గ్రహించి యెత్తె నరు మొత్తన్ ఘోరరుద్రాకృతిన్.

మ. ఇది యెల్లన్ బరికించి విస్మయముతో గృష్ణుండు వారించి "యి
య్యది రామా తగునే ! సుభద్ర హృదిముం దాలించి ధర్మంబునె
మ్మదిఁ జేయం దగు నయ్య ? నేనిపుడు భామాచిత్తముం గందు నీ
కదనం బాఁపి యథార్థమున్ దెలియుమా ! గాండీవి మన్నింపుమా!"

ఉ. ఇంతి సుభద్రఁ జేరి వచియించె ముకుందుడు "కన్నతల్లి ! నీ
స్వాంతముగాఁ బ్రవర్తిలిన భావము యాతని గూడుకొంట — నీ
స్వాంతము మార్పుచేసి మనపార్థుఁడు లోఁగొనెనా ? వచింపు దు
ర్భ్రాంతిని మాని యిష్టగతిఁ బాలనసేయుదుఁగా సహోదరీ !"

వ. అన్న నాయన్నులమిన్న సుభద్ర యన్నకు నమస్కరించుచు రథంబు డిగ్గి యిట్లనె — ౧౦౪

మ. 'గురురూపంబున నున్న 'బావ' నరుఁగా గుర్తించి నాచిత్త మీ
వలకే వాని వశంబుగాఁ జనుట నేఁ బ్రార్థించితిన్; నన్ను స
త్వరమే హస్తిపురంబుఁ జేర్చికొన నాభావంబు వారించినన్
సరకున్ జేయక వెన్నుముట్టినఁగొనెన్ సత్యంబ భాషించితిన్.

క. నగి యీ మాటల కిట్లనె
నగధరుఁ "డీతలఁప దేల నాకును బలుకన్
దిగ్రమ్మింగి కొంటి వీగతి
మగువా! నిన్నారుల కిచ్చి మాటింప సుమా!" ౧౦౫

ఉ. హాలి సుభద్రఁ జూచి యనె "నమ్మ! ధ్రువంబుగ సవ్యసాచికే
యాలివిగాఁ దలంప మఱి యన్యవిధంబునఁ జేయువారమే
మాలిన రీతిఁ జేయము సుమా! మతిమాలి, త్వదీయ భావమున్
బాలన చేయమే నరుఁడ భర్తయగున్ బరిపాటి సోదరీ." ౧౦౬

క. "అటు లగుచో నేఁ బార్థుని
నెటులో నొప్పింతును మరలింపుము రథమున్
బుటభేదనమ్మునకు నే
నట మీయుద్వాహకార్య మరసి నడిపెదన్." ౧౦౭

క. అని బుజ్జగించి పార్థుని
గని "బావా! తలఁపఁబోకు మన్యముగా
మునివేషము ననుఁ గలఁచెను
గనియుంటివె నీదెసన్ విశారంబెపుడేన్." ౧౦౮

చ. అని యోదారుపుఁ బల్కులం బలికి పద్మాక్షుఁడర్జునుల్ సోదరీ
మణి తోడన్ జతురంగవాహినులతో మార్గ్రమ్మగాఁ జేరి ప
త్తనముల్ బెద్దలతో నుదంతమును సల్లాపించి యొప్పించి స
ల్ప నియోగించె సుభద్రతో నరుని కల్యాణక్రియా కల్పనల్.

ఉ. హస్తిపురంబు చారులను నంపి యుధిష్ఠిర ధార్తరాష్ట్ర వర
శస్థులకు న్వచించి రభసంబున రమ్మని యెల్ల పెండ్లికిన్
స్వస్తి లిఖించి కమ్మలను వ్రాసి స్వయంబుగ పట్టణంబునన్
వస్తుసమృద్ధిఁ జేయుచు వివాహవితానముల్ రచించినన్. ౧౧౧

ఉ. రమణీయంబయి తోఁప సర్వము సుభద్రాదేవి వైవాహికం
బమరెన్ మంత్రపురస్సరంబయి సువాద్య ధ్వానమాంగల్యమై!
యమరేంద్రాది మరుత్సమాగమమునై యాదర్శకంబై బుధో
త్తమ సందర్శితమై సమస్తజనభూతానంద సంధానమై. ౧౧౨

చం. కతిపయ మాసముల్ నిలిసి కవ్వడిఁ జెల్లెలి ద్వారకాపురిన్
జతనమునన్ హలాయుధుఁడు స్వర్ణదుకూల సమస్తవస్తువుల్
రతనములన్ మతంగరథరథ్యములన్ బరిదాన మిచ్చి శ్రీ
పతి వెనువెంటఁ బంపెఁ బరివార మొసంగి సుభద్రతోడుతన్.

ఉ. ఈ కథయెల్ల చోటుల నాకేగతిఁ గన్పడు నిందు బత్తిము
క్కాకలు దీర నట్టియొక కన్నె హృదిన్ గల గూఢభావముల్
ప్రాకటమున్ ఘటించి నిజభారము మోఁప దయాంతరంగుఁడై
శ్రీకరుఁ డబ్జనాభుఁడు భరించి తరించె విపత్పయోనిధిన్. ౧౧౪

వ. అంతఁ గొంతవడి నడచునెడ —

శా. తానై రుక్మిణి యొక్కనాఁడు హరి చెంతం జేరి కూర్చుండి యు
త్యానందంబునఁ బెక్కు సంగతులఁ బ్రస్తావించుచోఁ జక్రి యా
చానన్ శోధ యొనర్చి యొక్క ఫల మీ సంకల్పమున్ జేసి త
న్మీనాంకున్ గనినట్టి తండ్రి యనె నా మీనాక్షి కీరీతినై. ౧౧౫

మ. "లలనా! యెంతటి మోసపోయితివి; నీ లావణ్య సౌందర్యముల్
ఫలవంతంబు లొనర్చు యుందు శిశుపాలత్మోపతిం బొంది, నీ
వల వేలా మసిపూప, నిర్ధనుని నిర్వ్యాపారు గోపాలుపైఁ
గలిగెన్? నేఁడవకాశమిత్తుఁ జనిసౌఖ్యమ్మొందుమిచ్ఛాగతిన్."

ఉ. రాజ్యము లేదు మాకు ధనరాశి హుళక్కి మహేంద్రభోగముల్
పూజ్యము; యండదండలు చమూతతి పొందిక సున్న; యాపదల్
భోజ్యములౌ దినందినము; ముగ్ధ! యెఱుంగక మోసపోతి; నీ
ప్రాజ్య విలాస రేఖలకు నర్హుఁడ నన్నెటుఁ బట్టితక్కటా!" ౧౧౭

కం. అని యశనిఘాత సన్నిభ
సునిశిత వాక్పాత మడర, శ్రుతి పుటముల రు
క్మిణి మూసి మ్రానుపడి ధా
రుణిపై మూర్ఛిల్లిపడె నిరుత్తర యగుచున్. ౧౧౮

ఉ. వ్రాలిన తీవఁబోణిని గరంబులఁ గూరిచి లేవనెత్తి పై
వ్రాలిన నిండు కూరిమి శిరంబును బెన్ దొడపై నమర్చి కేల్
వ్రీలి చికాకు పొందు కబరీభరమందునఁ జొన్పి దిద్దిమేల్
చేలము వీవెనన్ జలిపి చెమ్మట ముత్తెపుఁ జిందు లూడ్చుచో.

మ. యదుచంద్రస్మితచంద్రికాకలన, హస్తాంశుచ్ఛటాస్పర్శఁ ద
త్సుదతీమీలితలోచనాబ్జయుగ ముత్ఫుల్లంబునై సంస్రవ
న్మదబిందూత్కరమై వెలుంగుచును దత్పూర్ణేందుబింబాస్యమా
ముదితాస్వచ్ఛకపోలదర్పణములన్ దోతెంచె విస్ఫూర్తిమై.

ఉ. మోడ్చిన కన్నుదమ్ములను ముద్దియ విప్పి నిగిడ్చి శౌరిపైఁ
జూడ్కి మనోవికారమును మ్రోల నిలంబడి మోడ్చి కేలు, పై
ల్లేడ్చెను బాష్పవారి సెలయేఱులుగా నునుమేని పంటసాం
పూడ్చుచుఁ బొంగి నింగికిఁ బయోనిధియై పొఱలంగ నార్తిమై.

శా. ఈలీలన్ విలపించుచున్ వణఁకు నాయేణాక్షి లాలించి హే
లా లాలిత్య కరాబ్జ సంగతుల నుల్లాసంబు సంధింప భా
షా లావణ్య విశేష మచ్చుపడి వాక్చాతుర్య వాచాలతల్
గ్రాలన్ దగ్గఱి చేర్చి కౌఁగిట నిటుల్ భాషించె వార్ష్ణేయుఁడున్.

మ. "లలనా! చీఁకటి లేని వెన్నెల పసల్ గామింపఁగా నౌనె? కే
వల సౌఖ్యంబ నిరంతరాయ మగుచో వ్యర్థంబగుఁ గాన ద
వ్వుల నిక్కట్టులు నిల్వఁబన్నెడల నీపూర్వోత్తరం బెంచి స
త్ఫల మొక్కండు దలంతు నీకొసఁగ నభ్యర్థింపు మెద్దానినే!"

కం. నతశీర్ష, సంచలిత విన
మితగాత్ర ప్రకంపితోష్ఠ, స్మితధవళాంశూ
ర్జితవదన, యాయత నిమీ
లితనేత్ర విదర్భపుత్రి, లీలవచించెన్. ౧౨౫

ఉ. "ఏమి కొఱంత గల్గెడి? నదృష్ట వశంబున మిమ్ముఁ బొందుటన్
స్వామి! జగచ్ఛుభంబునకుఁ బంపి యనంగు నొనర్చి కొంటి నా
భీము, నొకానొకప్పుడ యభీష్టమగున్ బరికింప నామనః
కామితమా దరింపుము ప్రకల్ప వికల్ప సుకల్పన ప్రభూ!"

చం. "అననగి చక్రి యిట్లనె "లతాంగి! త్వదీప్సిత మే నెఱింగి క
ల్పన మొనరింతు నీఘటన; భావజ జన్మ మవశ్య మీయెడన్
దనుజుఁ డొకండు వానివలనం గడతేరుట ముఖ్య కార్యమై
చనును! రతీసతీమణి విచారముతో స్మర జన్మ వేచెడిన్." ౧౨౬

శా. "ఈ కార్యం బొనరించు టర్హమగు! మున్నీ కానుతో సర్వమున్
జేకూరంగలదెల్లయున్నడివి, నేశ్రీకంఠు దర్శింపఁగా
నాకైలాసముఁ బోయి వచ్చెదఁ దదీయాంతర్య మెవ్వారికిం
బ్రాకంజేయకు వాలికేనియు సఖీ! ద్వారావతిన్ వీడెదన్."

## ఘంటాసురాఖ్యానము

కం. జంటలుగ రెండు చెవులకు
గంటలఁ దగిలించి మొరయ ఘల్లనుచును ము
క్కంటి నిరంతము నెంచెడు
ఘంటాసురుఁ డొకఁడు ధర బ్రకాశితుఁ డయ్యెన్. ౧౨౮

శా. ఆఘంటాసురుఁడున్ విభూతి నొడలన్ హత్తించి రుద్రాక్షదా
మౌఘంబుల్ ధరియించి హస్తయుగళిన్ మౌళిన్ గళంబందునన్
శ్లాఘించున్ సతతంబు రుద్రమహిమన్ నారాయణోచ్చాటనం
బేఘోరాఘమయాటనాఁపుటకు మ్రోగించున్ శ్రవోద్ఘంటికల్.

ఉ. అంతటఁ బోక యాతఁడు రమాధిప సిద్ధమతప్రవర్తుఁ, ద
చ్చింతను నేని నోర్వక వ్యధించి బలాత్కరణం బొనర్చి, మా
రాంతక చింతచేయువల కావదఁ గూర్చు, మురారి యాగమే
యెంతను సాఁగుచున్న నటఁ బోయి విఘాత మొనర్చు నిచ్చలున్.

ఉ. మాధవనాదశంక శ్రుతిమండనముల్ చిరుగంటలన్ సదా
నాద మొనర్చుచార్చు 'గణనాథ!' 'శివా!' యని స్వప్నమందుఁ బెన్
రోదనసేయుఁ గైటభవిరోధిరొదన్ వినినట్టులెంచి యే
గాథ నుపేంద్రునాహ్వాయముఁ గర్ణముసోఁకునొ! యంచుభీతిలున్.

సీ. ఇటుల ఘంటాసురుం డీర్ష్యాత్ముఁడై హృది
  ననవరతంబుఁ గంజాక్షు నిలిపి
బొందితోఁ గైలాస భూమి కేఁగెడు నాసఁ
  బార్వతీపతి నిల్పి భాషణమున
వృద్ధుఁడై తుదకు జీవితముఁ జాలించుచోఁ
  శ్రీశు సర్వేశు ద్వేషించు కతన
మృత్యుంజయుండును మిన్నకుండెను ద్వేష
  మున నేనిఁ దన్నుఁ జింతనము చేయు

గీ. ఎంచి భటులనుబంప రమేశ్వరుండు
నియ్యకొనక ఘంటాసురుం డీశ్వరాద్రి
కరుగుచుఁ బిశాచమై తిరుగాడఁ జొచ్చె
గరళకంఠాద్రి పరిసర కాననమున. ౧33

శా. శ్రీకైలాస సమీప బిల్వవనికిన్ శ్రీకృష్ణుఁడే తేర ఘో
రాకారంబున ఘంటికాసురుఁడు రుద్రాలాప ఘంటాధ్వనుల్
ప్రాకన్ భూగగనాంతరాళముల నారణ్యావనీజస్థుఁడై
హాకారాంక పిశాచిరూపియయి ప్రత్యక్షంబుగా నవ్వుచున్.

శా. ఫాలాక్షాకృతిఁ గానిపింప హరి సంభావించి ఘంటాసురున్
గేలం జీరుచు మ్రోల నిల్వఁబడి "ముక్తిం గూర్తు ఘంటాసురా!
కైలాసాన నివాసమేర్పఱతు" నా ఘంటాసురుం డంతటన్
గేలుంగన్గవలన్ మొగిడ్చియొరిఁగెన్ గీలించి తత్పాదముల్.

చం. అటుల నిమీలితాక్షుఁడయి యా దివిజారి విలోకనద్వయిన్
స్ఫుటముగ విప్పి కన్గొనిన మ్రోలఁ గనంబడె శంఖచక్రముల్
చటుల గదాయుధంబు మఱి శార్ఙ్గముఁ గౌస్తుభమున్ ధరించి ప్రా
కటమగు మాధవాకృతి వికారరవమ్మున నార్వ దైత్యుడున్.

శా. కేలన్ మొత్తి పదాభిఘాతమునఁ బెన్ గీడ్పాటుఁ గావించి పి
రాలాపంబుల నిల్చినన్ దనుజుఁడా యాకారమే మార్చుచున్
ఫాలాక్షుండయి యూఁగుమన్న హరియున్ బాలోక్ష నిస్తబ్ధుఁడై
కీలించె న్గరముల్ సురారి హరి శ్రీకృష్ణాకృతిన్ గన్పడన్. ౧౩౭

కం. వ్యాలోలుండై ముడివడి
కీలించిన హస్తయుగళిఁ గినుక వదలి క్రో
పాలోకనములు వఱపినఁ
గైలాసాధిపుని యట్ల కనఁబడి మగుడన్. ౧౩౮

ఉ. అచ్చపుబత్తిఁ బాదముల నంటి శివాకృతిఁగాంచఁ గన్నులన్
గ్రుచ్చెడు ఘంటికాసురునకుం గనిపించె శివుండు బమ్మగా
నచ్చెరువొంద బ్రహ్మ కమలాక్షుఁడుగా నిసుమంతతోఁచి యా
వచ్చనివిల్తుతండ్రియును భర్గుఁడుగాఁ త్రుటిలో విభిన్నుఁడై. ౧౩౯

శా. నిశ్చేష్టుండయి ఘంటికాసురుఁడు నున్మీలాక్షుఁడై భీతుఁడై
యాశ్చర్యభ్రమగాత్ముఁడై హరిహరైక్యాకార సాక్షాత్కృతుల్
పశ్చాత్తాపము శోకమున్ గొలుప సద్భావాంకురంబైనఁ బ్రా
యశ్చిత్తంబును బొందు టర్హ మనుచున్ వ్యాలోలుఁడై తూలుచో.

ఉ. శౌరి నిజాకృతిం దనరి సాదర దృక్తతి నింపి దైత్యుపైఁ
గూరిమి నిట్లు పల్కె "హృది గోచరమాయెనె? నేఁటికేని దే
వారి! యభిన్న బంధగతి భర్గునకున్ మఱి నాకు, నాత్మనన్
వైరముచేతఁ గూర్చుకతనన్ జనుదెంచితిఁ జక్కదిద్దఁగన్." ౧౪౧

శా. "కైలాసంబో! వికుంఠమో! తెలుపు నీ కామ్యంబు ఘంటాసురా!
ఫాలాక్షుండను నేన; పద్మజుఁడు దిక్పాలుర్ మహేంద్రుండు గో
పాలుండున్ బరమాత్మ నేనగుదు; నావాసంబు గోలోకముక్
గైలాసంబు వికుంఠమున్ సకల లోకంబుల్ విచారింపుమీ!"

కం. అనినను ఘంటాసురుఁడును
మనమున నుప్పొంగి వ్రాలి మాధవపదముల్
గొని కన్నీ రేళులుగా
ననెఁ బరిణత హృదయుఁ డగుచు నబ్జాక్షునితో. ౧౪౩

## దండకము

శ్రీలోకనాథా! అనాథార్తినాథా! రమానాథ! భూనాథ! శ్రీనాథ! సర్వాధినాథా! హృషీకేశ! యీశా! సురేశా! మునీశా! యసంఖ్యాకభూతేశ! వైకుంఠవాసా! దశోత్కృష్టవేషా! లసద్వత్సభూషా! అనంతాదివేశా! నిరంతప్రశాంతాచ్ఛచింతావిశేషా! అశేషప్రభాభాసభాషాప్రకాశా! ఫణామండలోద్యన్మణివ్రాతభాస్వన్మయూఖోల్లసచ్ఛేషతల్పా! సుసంకల్ప! కల్పాంతకోపన్నభూజాల వైకల్పికప్రాణిసంతాననిక్షిప్తకుక్షింభరా! ప్లావితాత్యల్పతల్పస్థితస్వల్పగాత్రా! శ్రితార్తాళికల్పద్రుమా! కల్పనానల్పచాతుర్య! జల్పాక

పంచధర్మసంఛన్న పారచ్ఛటాకల్ప వైకల్పికా ! నవ్యనానావికల్పస్వభావా ! భవాంభోధిపోతా! స్వయంభూభవేంద్రాది భావాబ్జసంభావ్యభవ్యా ! భవన్నాటకం బెన్న నేమేటికిన్ లోటు లేకున్నె ? నాబోటి యేపాటి ? చాటింతు నీధాటి ముక్కోటి కూటస్థులన్నాటిమున్నీటి వాటంబులన్ మీటి, నానాటఁ బాటిల్లు జంజాటముల్ సూటి పోటీలు ముమ్మాటికిం బోటు పోరాటముల్ గోటి యారాటముల్ నీ కటాక్షంబునన్ ప్రీలు, రూక్షేక్షణం గ్రాలు, దాక్షిణ్య సంక్షేపణన్ వ్రేలు, నిన్నాడితిన్ నన్ను శిక్షింపవే ! నీసమక్షంబునందుం బలోత్కంటునన్ నిన్నుఁ గక్షన్నిరీక్షించితిన్ నీ స్వపక్షీయులన్ రూక్షవీక్షించి రక్షఃప్రవృత్తిన్ బుబుక్షాగ్నిఁ గిల్కోల్పి, బుక్షాళి భక్షింపఁగా నే నుపేక్షించి మోక్షంబపేక్షించితిన్ ధర్మసూక్ష్మంబు వీక్షింపకే, రక్షఁ గావించెదో ! శిక్షఁ గావించెదో ! నీవదక్షుండవున్ క్ష్మావిచక్షుండవున్ నన్ గటాక్షింపు సాక్షాన్మహేశా ! రమేశా ! పరేశా ! త్రిలోకేశ ! యీశా ! ౧౪౪

నమస్తే ! నమస్తే నమః

మ. అని ఘంటాసురుఁ డచ్యుతాంఘ్రియుగళిన్ సాష్టాంగదండప్రణా
మ నిబద్ధం బొనరించి సత్యము మనోమార్గమ్మునన్ జూడఁ గై
కొని కేల్దమ్ములు లేపనెత్త హరి రక్షోరూపమంతంబుగాఁ
గొని సారూప్యము నాతఁ డిట్లనియె దృగ్రోచుల్ విడంబింపఁగన్.

శా. "స్వామీ! యుష్మదనుగ్రహాప్తిసము సేకమాహాత్మ్యంబుదుస్తామసో
ద్దామ ప్రాకృత వర్తనంబు, నను, నీ ధామంబుఁ జేకూర్చి నీ
ప్రేమాంభోనిధిఁ దేల్చి ప్రోవఁగదవే! శ్రీనాథ! త్రైలోక్య నా
థా! మాంపాహి! కృపాపయోనిధి! హరీ! దాశార్హా! దీనావనా!"

కం. అను నా ఘంటాసురునకు
వనజాక్షుం డిచ్చి పరమపదమును, దానేఁ
గెను కైలాసంబునకును
మనోభవాంతకుని గలిసి మాటాడంగన్. ౧౪౭

మ. జప నిష్ఠాపరుఁడైన శంకరునకున్ సాక్షాత్కరింపన్ రమా
ధిపుఁ డభ్యాగతుఁడైన భంగి నెదురేతెంచెన్ జగత్స్వామికిన్
విపుల స్వాగత మిచ్చి తుష్టినిడి సంప్రీతాత్ముఁగావింప భృ
త్య పరీతుండయి యర్ఘ్య పాద్యములతో దారాసమేతంబుగాన్.

కం. కని హరిఁ బ్రత్యుద్ధానం
బును బరిరంభణ మొనర్చి ముదమున నర్ఘ్యం
బును బాద్య మొసఁగి రజితా
ద్రిని జేరిచి పూజ లొసఁగెఁ బ్రీతి ముకుందున్. ౧౪౯

వ. ఇట్లు శ్రద్ధాభక్తుల నా పరమ శివుండు కేశవుని సమర్చించి గౌరవ ప్రపత్తులు
మెఱయ నిట్లనియె — ౧౫౦

చం. "ఇదిరయొక సాఁకుగా నను దరింపఁగ వచ్చితి మాధవా! ఫల
ప్రదములు నా తపంబుల, యవశ్య మనంగపునర్భవంబ, నీ
హృదిఁ బరికింపు మెవ్వఁడు వధింపఁగ నోపునొ శంబరాసురున్
మదనుఁడుగాక! నీ మతము నామత మొక్కటిగావె! కేశవా!"

శా. "నే నీయానతి చొప్ప వర్తిలుదునో నీరేజ పత్రేక్షణా!
కానం జాలవె నా మనోవివరమున్! ఘంటాసురున్ బ్రోవ వి
జ్ఞానం బిచ్చుటకై మనోజ్ఞమున నీ సన్మూర్తి నర్చించు నా
ధ్యానంబున్ ఫలవంతముగ నలుపడాయన్ వచ్చితే శ్రీహరీ!"

కం. అనినన్ విని వనమాలియు
ననుపమ సద్భక్తిఁ గొలుచు నభవుని యర్చా
గణన సమాదర సంగతి
మనమున సంతుష్టి నొంది మఱి యిట్లనియెన్. ౧౫౩

చ. "అలఘు మతుల్ గ్రహింపక యథార్థము నీకును నాకు భేదముల్
దలఁచి విరుద్ధ ధర్ములయి తర్క వితర్క వివాద వాదులై
కలహములం జరించెదరు గానక సత్యమతం బొకింత నిన్
దలఁచిన ఘంటికాసురుఁడు దాహ్నృతమానువితండకోటికిన్" ౧౫౪

కం. అని కైలాసము వీడ్కొని
మునులకు దర్శనమొసంగి పురుషోత్తముం డె
క్కెను బక్షివాహనంబును
జన, ద్వారావతము మగుడ సంతుష్టుండై. ౧౫౫

ఉ. ద్వారక దిక్కునన్ మరలి వచ్చు హరిన్ బదరీవనంబులో
నారదమౌని కన్గొనఁ బ్రణామ మొసంగి పతంగ వాహమున్
ధారుణి డిగ్గఁబంచి "సురతాపస! యేమి విశేష?" మన్న "దై
త్యారి! విశేషముల్ గలుగవా!" యని యిట్లు వచించె శౌరితో.

ఉ. "హరి! యవతారమెత్తితి సురారు లధర్మ విరోధిసంఘముల్
బోరిఁ గొని రూపుమాపుటకు మూర్ఖులు పూర్వభవానుబంధులై
యరసి భవన్నిదర్శిత మహాద్భుత లీలల వారు క్రిందు మీఁ
దెఱుఁగక నిన్నె తారుకొని యేఁగరె కాలుని యింటిచుట్టాలై!"

కం. వినుము కరూశాధిపుఁడను
ననుపమ బలశాలి పౌండ్రకాఖ్యుని సుతుఁడై
చను వాసుదేవ నామకుఁ
డనవద్యము నసురవృత్తి కనుచరుఁ డగుటన్. ౧౫౬

కం. కసిమసఁగి స్పర్ధ నిన్నె
మసి చేయుదు ననుచుఁ జాటి, మాటికి ఘన దు
ర్వ్యసనాలోలుండై రా
క్షస వృత్తిని సంచరించు సాహసపరుఁడై. ౧౫౭

ఉ. "బమ్మనుగూర్చి భీషణ తపంబొనరించి ప్రసన్నుఁడైనఁ దా
నెమ్మని దమ్మిచూలి గణనీయ మహాస్త్ర జవాశుగమ్ములన్
సమ్మతి వేఁడినన్, నలువ చయ్యన నిచ్చి తిరోహితుండుగా
ముమ్మరమాయెనాతనికి మూర్ఖముగర్వము శౌర్య వీర్యముల్."

మ. "ఎటులో నీచరితం బెఱింగి, మదిలో నీర్ష్యాళువై యేచి ప్రా
కటమౌ పౌండ్రక వాసుదేవుఁడను సంజ్ఞన్ నే విరాజిల్ల నె
చ్చోట నాయాఖ్య మెలంగు నే మఱొకఁడంచున్ జుట్టువున్, సంకువె
ట్టెటో యార్జించి ధరించు నిచ్చలు హరీ! యేమందు దుర్మార్గముల్!"

శా. "పోఁగాలం బది దాఁపురించుట యథార్థంబౌ సుమా! నిన్నుఁ బు
న్నాగున్ నిత్యు నిరంజనున్ సకల భూనాథున్ బరేశున్ దురు
ద్యోగం బూని తృణీకరించి కినుకన్ దూషించు నీకైన స
ద్యాగంబుల్ సమయించెడిన్ దనకు సత్కారంబు శాసించుచున్."

ఉ. "అంతటఁ బోక, నీకుఁగల యంకములన్ని ధరించి నిచ్చలున్
బంతమునన్ జరించెడిఁ గుభావమునన్ విహరించుఁ, 'బీచమున్
డింతు మురారి' కంచుఁ బ్రకటించు 'హరింతును వాసుదేవుఁడన్
భ్రాంతిఁ ద్యజించుదాఁక' సను, వాని దురాగత మేమి చెప్పుదున్!"

శా. "నీ భక్త ప్రకరంబులం దెగడి దండించున్ మదోద్రిక్తుఁడై
యా భీలాక్రమ యుద్ధ పర్యటన లోకాళిన్ బ్రకంపించు సం
క్షోభన్ గూర్చు మునీంద్ర దుర్బలులకున్ శోధించి వేధించి కా
రాబద్ధుల్ ఘటియించు నిన్ బొగడి సంప్రార్థించు నాత్మీయులన్"

ఉ. "ఇంతటఁ బోక నీవిట గమించుటఁ జారులచే నెఱింగి సి
ద్ధాంత మొనర్చి యుత్తరిని ద్వారక ముట్టడి నుద్యమించి వి
క్రాంతి విమానయాన చతురంగ బలుండయి యెత్తివచ్చె శు
ద్ధాంత జనాళి కేమియగునా! యని సంచలనంబు గల్గెడిన్." ౧౬౫

కం. అనిన నగి శౌరి యిట్లనె
"ముని! నాయంకములఁ గోరి మునుకొని సంధా
రణ చేయువానికిని ము
క్తిని నొసఁగుట ధర్మ్మవగును బుద్ధిం గనుమా!" ౧౬౬

కం. అని మొదల నడిగి వీడ్కొని
చని పక్షీంద్రంబు నెక్కి స్వస్థానంబున్
గనుఁగొనిన గోచరించెను
ముని కథితాంశంబులెల్ల ముమ్మర మగుచున్. ౧౬౭

వ. అంత – ౧౬౮

శా. వాతూలాస్త్రము నెంచి మంత్రగతి వైవన్ బ్రావృతారాతి సం
ఘాతం బెల్ల విఘాతమౌచుఁ బరిఘాఘాతంబులో నబ్ధి సం
పాతంబై పరితాప మొందిన భటవ్రాతంబు నీక్షించి సం
జాతాశ్చర్య విషాద వేదనఁ గరూశాత్మావిభుం డుగ్రుఁడై. ౧౬౯

మ. నలు దిక్కుల్ పరికించి దవ్వుల వడిన్ బక్షీంద్రుపై వచ్చు నా
నలినాక్షుం దిలకించి త్రిప్పుచు విమానం బంత నా దిక్కుకున్
విలు చేఁబూని నిశాత కాండముల దోర్వీర్యంబు సూచింప ని
స్తుల వేగంబుగ నేసెఁ బుంఖములుగాఁ దూలించి బంధింపఁగన్.

మ. పద సంఘట్టన నంతరిక్షమునకున్ బక్షీంద్రుఁ బంపించి ద్యో
పద సంచార మొనర్చుచున్ గుదియ నాపౌండ్రాఖ్య నిర్ముక్త భీ
ప్రదకాండౌఘ విమానయానగతులన్ వారించినన్ శౌరి సా
యుధుఁడై పౌండ్రక వాసుదేవుఁ డెగసెన్ ద్యోయుద్ధసంరంభుఁడై.

ఉ. మీఁదికి వ్యోమయానము సమీపముగాఁ గొని శౌరియున్ గదా
పాదనచేసి కేలను జవంబునఁ ద్రిప్పి విమానమున్ వడిన్
మోది విభిన్నమున్ సలుపఁ బుండ్రక పుత్రుఁడు దూఁకె భూమిపై
నూఁడి కరంబునందు గొడుగొక్కటి యూఁతగ రక్షణార్థమై.

మ. దిగఁ బంచెన్ వెనుముట్టి పౌండ్రకుని బృధ్వీరంగమున్ జేరఁగా
ఖగనాథున్, డిగి పౌండ్రకు న్గదిసి శార్ఙ్గాబద్ధ సందీపితా
శుగుఁడై నిల్వఁ గరూశభూమిపతి సంక్షోభించియున్ జెచ్చెరన్
ఖగరాడ్వాహునిపై నిశాతశర సంతానంబు వర్షించినన్. ౧౭౩

కం. ఇభవరదుఁ డేచి విద్యు
న్నిభశరముల నాఁచి ధారుణీపతిఁ ద్రుటిలో
రభసమున బాణపంజర
మభివేశ్మముగా రచించి యంద, నిలిపినన్ ౧౭౪

చం. నిలిచి కరూశనేతయు ధ్వనించుచుఁ గృత్రిమ పాంచజన్యమున్
ములుకుల పంజరంబును నపూర్వగతిం దలఁగించెఁ జేతిలో
వెలయు నవీన చక్రహతి, వెన్నుఁడు చూచి తదీయచక్రసం
చలనము శార్ఙ్గముక్త శరజాలముతో విదళించెఁ నవ్వుచున్. ౧౭౫

శా. ఆశాపాశముఁ గోసి యంతటఁ గరూశాధీశుఁడున్ దుర్మదా
వేశుండై పటురోషభీషణుఁడు దోర్వీర్య ప్రభాభాసుఁడై
వేసెన్ సాఁచి కరంబుమీఁదికి గదాభీలోగ్రదండంబు నా
శాసీమాంతము మాఱుమ్రోఁగ, ననలజ్వాలల్ గనుల్ నింపుచున్

ఉ. పైకొనవచ్చు నాగుదియ వారినాజభుఁడు చూచి చక్రమున్
జేకొని త్రిప్పి పంపినను శీఘ్రము త్రుంచి గదాయుధంబు ని
ర్భీకత నిల్చియున్న పృథివీధవు పౌండ్రక కంధరంబుఁ బెన్
గాక వధించి చేరుకొనెఁ గంజదళాక్షుని హస్తసీమకున్. ౧౭౭

చం. సతతము శత్రుభావమున సైతముఁ బౌండ్రకవాసుదేవుఁడున్
మతిని హరిం దలంచుట సమానపు టంకములన్ ధరించి, శ్రీ
పతియు నతం డభిన్నమను భావముఁ బొందుటచే సరూప స
ద్గతిఁ గనె నంచు వ్రాయఁబడె గ్రంథములం దిది ధర్మమే కదా! ౧౭౮

శా. సమ్మోహస్థితిఁ దూలియుండిన కరూశాధీశసైన్యాళికిన్
సమ్మార్గం బొనరించి వర్షగతి మైసంత్రాణముల్ గూర్చుచున్
నెమ్మిన్ మీవిషయంబుఁ జేరికొన బొండీ యన్న కృష్ణుండు సై
న్యమ్ముల్ దండములిచ్చి పోయె మహదానందంబు సంధిల్లఁగన్.

ఉ. ద్వారకఁ జేర సైన్యపరివారయుతంబుగ హాలి జేనితో
మీరిన గౌరవంబున గమించుచు స్వాగత మిచ్చె శౌరికిన్
బోరని మ్రోఁగ దుందుభులు; పోయి విదర్భతనూజ కెంతయో
కూరిచి యీ యుదంతము నిగూఢముగా వినిపించె శౌరియున్.

వ. కరూశాధిపుఁడై కాశీపట్టణమేలిన పౌండ్రక వాసుదేవుఁడు గతించిన కొంత
కాలమునకు ననంతరమున — ౧౮౧

ఉ. కాశ్యపు డంచుఁ బిల్చికొనె గాదిలిపుత్రునిఁ బుండ్రకుండు నా
కాశ్యధిపుండు వాఁడు జనకాంకితుడౌటను బౌండ్రకాఖ్యుఁడై
కాశ్యపుఁ డయ్యె నాతని స్వకల్పన పౌండ్రక వాసుదేవుఁడన్
భావ్యము, మచ్చరించిన రణంబునఁ జక్రివధించె నాతనిన్. ౧౮౨

గీ. అట్టి పౌండ్రక వాసుదేవాత్మజుండు
గాశిరాజు సుదక్షిణాఖ్యాతుఁ డాత్మ
జనకుఁ గాశ్యపుఁ దునుముటఁ జలము నూని
పీచ మడగింప హరిఁ దటి వేచియుండె. ౧౮౩

కం. కాశ్యధిప సుదక్షిణుఁడా
వశ్యకతన్ బిలువనంపి వసుధామరునిన్
గశ్యపు హరి సమయింప ర
హస్యాధ్వరముల్ ఘటింపఁ బ్రార్థన చేసెన్. ౧౮౪

ఉ. రుద్రునిఁ బాదుకొల్పి యనిరుద్ధసమాప్తి సుదక్షిణుండు ని
ర్ణిద్ర, ధరామరానుమతి నిర్ణయరీతి శివాధ్వరక్రియన్
హృద్రుచిరస్థితిన్ జలువ కృత్తి సమాహ్వయశక్తి నిచ్చె యా
రుద్రుడు సాక్షిపర్వుఁడయి రూఢిమెలంగి తిరోహితుండుగాన్.

కం. కృత్తియుఁ గృతయను సంజ్ఞఁ బ్ర
వృత్తింగను శక్తి, శిఖల దృగ్గోచరమై
"మిత్తువగెలుపరిచేనిది
దత్త మగుట నిచ్చుమిత్తిఁ దార్కొన నెవఁడేన్". ౧౮౬

వ. అనిన — ౧౮౬

చం. కృతను సుదక్షిణుండు గొని తృప్తిని గాంచి సమాప్తిఁ జేసెఁ ద
త్క్రతువు ననంతరంబుఁ గరం బనురక్తి నిమంత్రణక్రియన్
గృతను జ్వలింపఁజేసి వివరించె "దహించి పురంబు ద్వారకా
పతిని గ్రసించి రమ్మని శివమ్మున పొమ్మ"ని పుచ్చె నెమ్మితో.

చం. కృత గగనంబునం దనలకీలలు పర్వ నతిక్రమించి వ్యా
పిత చటులాగ్ని రోచుల విభీషణ లీలను దుర్నిరీక్ష్య సం
గతి దశదిక్కులం బఱచి క్రాలఁ గుశస్థలిఁ జేరి డగ్గి పెం
జితిని రగిల్చి పత్తనము శీర్ణముగాగ దహించి కాల్చుచో. ౧౮౮

శా. ఆసర్వాంశ మెఱింగి యున్న హరి యేణాక్ష్యష్ట కోపేతుఁడు
ల్లాసోల్లోలవిలాసలాలసుఁడు లీలామేయ ఖేలుండుగాఁ
ద్రాసాకంపితపౌరు లేఁగి కృతవృత్తాంతంబు విన్పింప సం
దేశంబంది మురారి హాసమున సంధించెన్ సుదర్శనాస్త్రమున్.

మ. కొని చక్రంబును వైచినన్ విసరి నిష్క్రోధంబునన్ నవ్వుచున్
జని యాచక్రము దహ్యమానపురముం జల్లార్చి వెన్నంటె కృ
త్తిని గాశీపురిఁ జేరిపేర్చి కడు వేధింపన్ గృతన్ గాశికా
పతి నాకృత్తి గ్రసించి కాల్చె పటు భీభత్సా కృతిన్ గొల్చుచున్.

చం. కృతయు సుదర్శనంబునకు బ్రీతి నమస్కృతు లిచ్చుచున్ దిరో
హితగతిఁ జెంద చక్రము యథేచ్ఛ వియద్గమనంబునన్ రమా
పతి కరమందుఁ జేరికొనె ద్వారవతీ పురవాసు లెల్లరున్
నుతులొనరింప మాధవుననూనవిభూతి నపూర్వలీలలన్. ౧౯౧

వ. అట్టి సమయంబున — ౧౯౨

కం. సుగ్రీవుని ప్రియమిత్రుఁడు
దగ్రబలాఢ్యుఁడు ద్వివిదుసతవిఖ్యాతుం
డగ్రతమవయోవృద్ధుఁడు
విగ్రహ మూనె బలరామ వీర్యశ్రుతుఁడై. ౧౯౩

ఉ. "రాముని పేరు వెట్టుకొని రాజిల నేర్చునె యెవ్వఁడేని సం
గ్రామ మహోగ్ర భీముఁడుఁ బరాక్రమ దాముఁడు రాముఁడొక్కఁడే
రాములు గీములుర్ పలవరాముల నామకు లెవ్వరేనిఁ ద
న్నామముఁగొన్న సైపనని తార్కొన నెంచె ద్వివిందుఁడాహలిన్.

వ. ఇట్టియెడ — ౧౯౫

కం. నరక సఖుండగు మైందుఁడు
హరి సుగ్రీవానుచరుని యాగ్రహభాషల్
వరువన్, ద్వివిందు నొకచో
దరసి నమస్కృతు లొసంగి తడబడ కనియెన్. ౧౯౬

మ. 'మదిరోన్మత్తుఁడు రామనామమునకున్ మాలిన్యము న్గూర్చె దు
ర్మదుడై చేకొని పూజితాఖ్య నతనిన్ భ్రమందించు యత్నంబు న
భ్యుదయంబౌను, ద్వివింద! నాయుడుత యుద్యోగంబుఁ జేయూత ని
చ్చెదఁ గైకొమ్ము! బలుండు జూదరి గదా! చేకూర్తు నీకాతనిన్".

చం. కని తరుణంబు ద్వారకను గంజదళాక్షుఁడు లేనివేళ నా
తని మదిరంబులం దనిపి, దగ్గఱి జూదము పేరుచెప్పి తె
త్తును బురబాహ్యభూములకు, ద్యూతము నాడుచు నుండునంత నీ
వును మఱి నేను గూడి బలి మోఁది వధింతుము నిశ్చయంబుగన్.

కం. ఇందులకై సరి యనిన ద్వి
విందుఁడు, హరి రాజనూయ విధి కేఁగుట యా
మైందుఁ డెఱిఁగించి రామున
కుం దగుసురలిచ్చి ద్యూత గుహలకుఁ బిలిచెన్. ౧౯౯

కం. రాముఁడు మదిరోన్మదుఁడై
యేమి విచారంబు లేక యేఁగెను ద్యూత
వ్యామోహితుఁడై బాహ్య
రామములకు మైందుతోడ రమ్మనినంతన్. ౨౦౦

ఉ. ద్యూతము మైందుతో జరుగుచున్న ద్వివిందుఁడు వచ్చి మెల్లఁగా
గ్రోతి స్వరూపమూని యెగురున్ బలరాముని మీఁదికెక్కుచున్
జేత విదల్చినన్ జనక చిందరవందరఁ జేయుఁ బాచికల్
మూతి బిగించుచున్ గుదము ముక్కునకుం దగిలించు రుద్దుచున్.

శా. ఈవ్యాపారముఁ జూచి చూచి హలి మర్షింపక, వివర్ధంబుగా
నవ్యాజంబగు మర్కటక్రియలకే యాధారముల్ లేమి దా
నీవ్యాఘాతము సైఁపఁ జాలక జ్వలదృజ్జ్వాలి క్రోత్తాలుఁడై
యవ్యక్తాకృతి యాద్వివిందు గళ మల్లాడించెఁ జేపట్టుచున్.

ఉ. మైందుఁడు రామునిం బోదివి మార్కొనె పూని ద్వివిందురక్షకై
కొందల మంద కాహలియుఁ గ్రోతి గళంబు బిగించి త్రుంచి యా
మైందుని నుద్ధతిన్ జెనకి త్రుంచఁగఁ జేసి కడింది బల్మిఁ జొ
చ్చెం దన పత్తనంబు సరసీరుహనాభుఁడు వచ్చునంతలో. ౨౦౩

మందాక్రాంత—

రాధాకృష్ణారసికనిపుణా! రమ్యరాజీవనేత్రా!
సాధుధ్యేయా! సకల జగతిస్వామి లోకాంతరాత్మా!
వేదోద్ధారా! వినుతనిగమా! వేదసంచారకా! శ్రీ
నాథా! కళ్యాణగుణ! సుగుణా నందగోపాలబాలా! ౨౦౪

## గద్యము

ఇది శ్రీమదిందిరానాథప్రసాదలబ్ధ సహజకవితా విరాజమాన శ్రీమద్గౌతమసగోత్ర
దివివంశోద్భవ నరసింహాచార్యపౌత్ర వేంకటాచార్య రంగమాంబికాతనూజ
రంగాచార్యప్రణీత శ్రీకృష్ణాతిమానుషతత్త్వ తృతీయఖండాంతర్గత
ద్వితీయాశ్వాసము — సంపూర్ణము.



శ్రీ ర స్తు

శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీ కృ ష్ణా తి మా ను ష త త్త్వ ము



## తృ తీ యా శ్వా స ము



కం. కమలాక్ష! విమలహృదయా!
కమలాపతి! కమలశయన! కమలసునాభా!
కమలజనిత! కమలభవా!
కమలానన! కామజనక! కమనీయకరా!

వ. అవధరింపుము —

శా. ఇంద్రప్రస్థ పురస్థులై మయసభోత్కృష్టాలయప్రాప్తులై
చంద్రప్రస్తర సౌధవాసులయి యాశావ్యాప్త విఖ్యాతి రా
జేంద్రుల్ పాండుకుమారులున్న సురయోగేంద్రుండు బోధింపయా
గేంద్రంబంచును రాజసూయమును గావింపన్ బ్రయత్నించుచో,

ఉ. మున్నుగ ద్వారకా పురికి ముఖ్యు మురారిని జీరఁ బంపి, యా
వెన్నుఁడు వచ్చినన్ సకల వృత్తముఁ జెప్పి గడించి సమ్మతిన్
దెన్నును నిర్ణయించుకొని తేకువ తోడుతఁ బాండుసూను లా
జన్నముఁబూని రచ్యుతుని సాయము పాయమునమ్మి నెమ్మదిన్, 2

ఉ. నాలుగు దిక్కులం జనిన నల్వురు తమ్ములు ధర్మజుండు నిం
డోలగముండి యాత్మపురి యుద్ధపదార్థము లన్నపాన సై
న్యాలనుబంపి యాడుకొన నల్వురువ్యర్థముగాక, సర్వభూ
పాలుర కైకొని రపార జయార్థ విశేషభూతులన్. ౩

ఉ. అందఱు గెల్చి వచ్చిరి బృహద్రథ సూనుని దక్క దాన గో
విందుని పాలికిం జనిరి వేఁడ సహాయము భీమపార్థులీ
చందము మున్నెఱింగి హరి, చయ్యనఁ బోయె గిరివ్రజంబు వ్యా
రిందమినంటి, పర్వత సరిద్వనవాటిఁ దరించి, యంతటన్. ౪

ఉ. మాగధ రాజధానిని సమాగమనం బొనరించి చేరువన్
మ్రాఁగి పిఱుంద నున్న బలమున్ వనవాటిక మూసి సైన్యమున్
వీఁగి ధరామరాకృతుల వీటఁ బ్రవేశ మొనర్చు నంతలో
మ్రోఁగెను దుర్గదుందుభి,విరోధి సమాగమ సూచకంబుగన్. ౫

ఉ. ఐనను విప్రవేషముల నంటిపురాధ్వముఁ బట్టిపోవ సే
నానులు గాంచి యేమనక నవ్వి కనుంగొని రాకహేతువున్
మానిరి నిల్పివేయ, నృపమందిరభూమిని జూపి, వారలున్
దానవరి గ్రహంబునకు నాసరియంచు దయార్ద్రచిత్తులై. ౬

ఉ. చొచ్చి జరాసుతాలయము సూటిగ, మాగధు కొల్వులోనికిన్
జొచ్చి సమాగమాంశము గనుంగొని భృత్యుని చేత, తేఁడుసం
దిచ్చినఁ జొచ్చి రాజసభ నిమ్ములఁ బీఠికలందు మువ్వురున్
గ్రచ్చర నానతిచ్చిన సుఖాసనులైన, నృపాలుఁ డిట్లనున్. ౭

మ. "ధరణీదేవతలార! మువ్వురుఁ ద్రిమూర్త్యంశుల్ గతిన్ దోఁచెడిన్
బరికింపన్, దమ రాక యిచ్చటికి నాభాగ్యంబుగా, మీకు స
త్కారణల్ జేసెదు భాగ్యమబ్బుటయు భాగ్యంబెన్నఁగై కొందుసా
దర భావంబున నర్ఘ్యపాద్య[illegible]ల సత్కా[illegible]ంబు నేమెంతురో? ౮

వ. అని ప్రత్యుత్థాన మొనర్చి బార్హద్రథుఁడు వెండియు నిట్లనియె — ౯

ఉ. "మున్నుగ నర్ఘ్యపాద్యముల భోజన నూతన వస్త్ర మాల్యముల్
గొన్న యనంతరంబ తమకోరికలన్ వివరింపవచ్చు నా
మన్నన స్వీకరింపుఁ"డని, మాగధుఁ డర్మిలి సత్కరించె భీ
మన్నను నర్జునున్ హరి ధరామరులంచు భ్రమించి నెమ్మదిన్.

ఉ. మజ్జన భోజనంబుల, సమార్చనలన్ దనిపించి యిచ్చినన్
గొజ్జగిఁ దోఁగు చందనముఁ, గోరిరి వారలు రక్తచందనం
బజ్జగతీశుఁ డీయ ధవళాంబర మాల్యము లంద తేసుమై
నుజ్జగమున్ ఘటించి రరుణోజ్జ్వలముల్ గొని తేరఁ బంచుచున్.

మ. ఇది బార్హద్రథభూపుఁ డారసి 'యొహో! యీమువ్వురున్ భూధవుల్
గద! భూదేవులు గార'టంచెఱింగి వక్కాణించె 'మీరిట్టులి
వ్విధి రాఁజెల్లునె? మారు వేసముల్గతో వీరుల్ గదా! కోరుఁడే
య్యదిమీయిష్టమొ? తీర్తు నిక్కమన నబ్జాక్షుండు గంభీరుఁడై.

చం. నిలచి వచించె నిట్టు లవనీధవ! యీతఁడు భీమసేనుఁ డా
వల నరుఁ డేను గృష్ణుఁడను వచ్చితి మేము రణంబొనర్ప నిన్
వలచి, బలంబుఁ జూపుట కెవండనుకూలమొ? కోరుమాతనిన్
దలపడు నాతఁడే యనిన నవ్వి బృహద్రథసూనుఁ డిట్లనెన్. ౧౩

శా. "ఏమీ! యుద్ధముగోరివచ్చితివిగా! కృష్ణా! యొహో! బాగు! నీ
సామర్థ్యంబుఁ బదెన్మిదాహవములన్ సాక్షాత్కరించెం గదా!
యేమోహంబుం గని తాఁకువాఁడ నిను, నీవృత్తిం బరీక్షించి నా
సామీప్యంబున నిల్వ యోగ్యములె? నీశక్తిప్రతాపక్రియల్."

చం. "ఇతఁడు నరుండటంచు వినిపించితి మేలు! వయస్సునందు నా
కితఁడగుఁ బిన్న, కావున నభీష్టము గా దెదురించి పోర, నా
జతనము బ్రువ్వఁదిట్టెదరు సంగర మందున వీని గెల్చినన్
స్తుతమతు లందుచేత నరుతోఁ బెనగాడఁ దలంప నెన్నఁడున్."

ఉ. "ఆతఁడు వాయునందనుఁడటంచు వచించితి సత్యమేని నే
నాతనిఁ గోరుకొందును బకాసుర మర్దనుఁడన్న లోక వి
ఖ్యాతిఁ గడించుటన్ గదిసి యాతని నాబలవిక్రమమ్ములన్
బ్రీతిని జూచి కైకొనుదు విస్ఫుటకీర్తి జయంబు లచ్యుతా!"

కం. "అటులైన రండు! నగర
నికటమున నారథముపైని గయ్యాయొనర్పన్
బటుతరయత్నంబున సం
కటపడి యిటఁ జేరికొన్న కష్టముదీర్తున్. ౧౭

చం. అని యరదంబులిచ్చికొని యందఱకుం బుర బాహ్య భూమికిన్
గొనిచని రంగ మేర్పఱచి క్షోణివిభుండు జరాసుతుండు పి
ల్చెను బెనుగాడ వాయుసుతు శీఘ్రముగా నతఁడున్ గదాయుధం
బునుగొని ముందుకున్ దుమికెఁ బోరొనరింప విభీషణాకృతిన్.

కం. ఇరువురు గదలన్ జేకొని
కరముల, గిరిగిరిని. గరనిగరి. హరిహరి, సం
గరమునఁ గర మెదిరించిన
కరణిన్ భీకరము దోఁపఁ గదిసిరి కినుకన్. ౧౮

మ. గదలం దాఁకుడు నేర్పునన్ మెఱయుచున్ గాయంబులన్బేర్చు స
మ్మదలీలన్ లఘిమాతిభూతి, బలసామర్థ్యప్రకారంబులన్
గదనోత్తుంగవిలంఘన క్రియల నానాక్షేప విక్షేప సం
పదలన్ భీమజరాసుతుల్ నిలిచి విభ్రాంతస్థితిన్ బొల్చుచున్.

మ. కరసంచాలన పద్ధతుల్ మఱి గదాకాండప్రహారంబులన్
జరణన్యాసవిధానవై ఖరులు దోస్స్ఫార స్ఫురద్రీతులన్
దరుణాంగుష్ఠవిశిష్టపుష్టిహతులన్ దండాద్భుతక్రీడలన్
బరితోషంబొనఁగూర్చి రక్షకులకు దుర్వారప్రభాస్ఫారులై. ౨౧

సీ. "నాదెబ్బఁ దిన్న నా నాకంబు గన్పించు"
"నీ బోకరింపుల కేమి లెక్క"
"ఈ గదాహతి కాలునింటి యతిథిఁ జేయు"
"నిదె తుత్తునియలయ్యె గుదియ చూడు"
"దండప్రహారపు దండి చవింగను"
"రెండు తుండెములాయెనండి! కనుఁడు"
"ఈముష్టి ఘాత సంవృష్టి పాతము గను"
"మగవాఁడ! దిగెనె నీ మగతనంబు?"

గీ. "ఈకె పోటుల గాటపు ఘాటి చూడు"
"మేటఁ గలిసెనె నీయీకె పోటు నూటి?"
అని జరాసంధ వాయుజు లాడుకొనుచు
ద్వంద్వ కదనం బొనర్చి రానంద గరిమ. ౨౨

మ. గదలెన్నో వడె నుగ్గులై విఱిగి, ఖడ్గంబుల్ మహాదండముల్
గుదియల్ దుంటలు దుంటలై విఱిగె నిగ్గుల్ వాసి భల్లంబులున్
వదలెన్ బట్టు, రణేచ్ఛ యిర్వురకుఁ బర్వన్ మల్లయుద్ధంబునన్
గదియన్ భీమ జరాసుతుల్, గడచెఁ గొన్నాళ్లిట్లదృశ్యంబులై.

ఉ. చేతులు చేతులం బొదవి, చేరిచి కాలికిఁ గాలు, నూరువుల్
ఘాత మొనర్చి పాదహతిఁ, గాసర వీసరగాఁ బెనంగి ని
ర్భీతి నురఃకవాటములు వ్రీలఁగ ఢీకొని తాఁకి తాఁకి సం
పాత మొనర్చి నేలఁబడి పాతర లాడిరి గెల్వ నిర్వురున్. ౨౪

మ. ఒకనాఁడేనియు రెండునాళ్ళు మఱి మూఁడోనాఁడు వారాంత మో
పిక సామర్థ్యము కుంటుపోకిరువురున్ వీర్యప్రతాపంబులన్
ప్రకటీకార మొనర్చుచుం బెనఁగి రాబార్హద్రథాఖ్యాతుఁడున్
బకసంహారియు మల్లయుద్ధగతులన్ బాహాబలోద్దీప్తులై. ౨౫

ఉ. ఎంతకుఁ బోరువర్ధిలుట యెంచి మురారి జనాంతికంబుగా
నంతక సూను తమ్మునను నంకితమౌనటు సైగచేసె ని
శ్చింత జరాసుతున్ నడుమఁ జీల్చిన నంతము నొందునంచు సి
ద్ధాంత మొనర్చి యందు కనిలాత్మజుఁడీకొని చీల్చె యాతనిన్.

ఉ. రెండుగ ఖండముల్ సలిపి పృథ్విపయిన్ బడవేసినంత నా
రెండును నొక్కటై మనుజు రీతిని బోరుటఁ జూచి చూచి యా
దండ ముకుందునిన్ గనినఁ దామరసాక్షుఁడు సన్నచేసె నొ
క్కండొకదిక్కు వేఱుగ నొకండును వేయ నిగూఢవృత్తిమై.

మ. అటులే భీముఁడు నాజరాసుతుని బాదాఘాత సంఘట్టనన్
త్రుటి మొండెంబులు రెండుగా సలుపుచున్ దోర్దండవిస్ఫూర్తిప్రా
కటమౌ సంగతి దవ్వులన్ విసరె నాకాయంబు వేర్వేఱ నొ
క్కటి వేఱొక్కటి యొక్కడై చన నశక్యంబైన చందంబునన్.

ఉ. సైనికు లార్చి వాయుసుతుఁ జక్రిని ముట్టిన ఫల్గుణుం డటన్
గానన గుప్తసైన్యముఖనాయకుఁడై చమదెంచి చించె సే
నానుల రాజబంధుజననాయకులన్ విదళించి మించి రా
ట్సూనుఁడు సంధికై ధ్వజముఁ జూపుచు నాఁపెను రక్తపాతమున్.

కం. బార్హద్రథ సూనుని స్తో
త్రార్హంబగు సంధివినతి హర్షించుచు దా
శార్హుండా సహదేవుని
బార్హద్రథరాజ్యమునకుఁ బతిఁ గావించెన్. 30

ఉ. ఆ సహదేవుఁ, గాలగతుఁడైన జరాసుత సూనునంత సిం
హాసనమందునన్ నిలిపి యర్జున భీములనంపి, ద్వారకా
వాసముఁజేరె శౌరి బలవంతు జరాసుతు మృత్యువార్త సం
తోసముఁ గొల్పి తన్పఁగ యదుప్రకరంబు స్తుతించె నచ్యుతున్.

ఉ. మాగధుఁ డాహవంబునను మ్రందుటచే నరిగాపులైరి యిం
కేగతిలేక కప్పములనిచ్చి తదీయ సుహృద్ధితాప్తులా
యాగముఁ జేయు కాలమున కాగమనంబొనరించి కానుకల్
దేగలమంచు నీకొని యుధిష్ఠిరు నొప్పిరి చక్రవర్తిగాన్. 3౨

వ. ఈగతి భూచక్రము నందలి సర్వ రాజన్యచక్రమును నా చక్రిసాయమున నవక్ర విక్రములగు భీమార్జునులు జయించిన పిమ్మట ధర్మజుండు రాజసూయంబును సలుపఁ గడంగిన — 33

శా. దృష్టం బాగమ ధర్మశాస్త్ర నిగమోత్కృష్టాప్త వాక్యంబులన్
సృష్టిన్ దొల్లి యొనర్చియుండె నౌరా! యే పృథ్వీశ్వరుండేని సం
తుష్టింగూర్చెడు రాజసూయము మహాదృష్టంబు వాటిల్లఁగా
మృష్టాహారవిహారచారమయి సంతృప్తిన్ ద్రిలోకంబులన్. 3౪

చం. నలువురు దమ్ములుం దవిలి నాయకతన్ దలఁదాల్చి నిల్వ మం
త్రులుఁ బెదతండ్రి పుత్రులుఁ బురోహితులున్ సుహృదాదులున్
గలిసి, సమాగతాతిథుల గౌరవసత్కృతు లిచ్చి చూడ భూ
పులు నరిగాపులై నిలువఁ బూనె యుధిష్ఠిరుఁ డధ్వరక్రియల్.

సీ. కస్తురి హారంబట్టుఁ గప్పురంబు లొసంగి
యౌత్తరాధిపులు పెన్బత్తిఁ గొలువ
మత్తేభ నవరత్న మాణిక్య దామముల్
ప్రాగ్భూమి నాథు లప్పనము సేయఁ
గనకదుకూల సుగంధపదార్థముల్
దాక్షిణాత్యులు దెచ్చి దయను వేఁడ
వాహన రుక్మ ప్రవాళ మౌక్తికములఁ
బడమటి దొరలిచ్చి గడన సేయ

గీ. భవ్య విలసదింద్రప్రస్థ పట్టణస్థ
మయ సభామధ్య మండిత మహిత సింహ
పీఠ భూషాయమానుఁడై వెలసెఁ బెలుచ
సమయవర్తి నూనుఁడు ధర్మజ ప్రవరుఁడు. 3౬

శా. సర్వోర్వీధవ చక్రవర్తులు మహాసర్వంసహావల్లభుల్
దుర్వారప్రతిభావిశేషులు ప్రభాదోస్సారధామాధవుల్
గర్వస్కన్నులు ఖిన్నులై వడి నమస్కారంబు లర్పించి యా
శీర్వాదంబు లొసంగ భూమిసుతు లుత్సేకాత్ములై రత్తఱిన్.

ఉ. కర్ణుఁడు దుస్ససేనుఁడు వికర్ణుఁడు సౌబలుఁడున్ సుయోధనుం
డార్ణవసప్తకావృతధరాధిపులై యరికావు లట్టులన్
నిర్ణయభంగి నుంట గమనించి యమర్షణభావులయ్యు సం
పూర్ణ సహాయ్యముం జలుప బూనిరి యధ్వర నిర్వహార్థమై. ౩౮

మ. సవన ప్రక్రియ లాదిగా, నవబృథ స్నానంబుతో సాఁగి భూ
ధవ సామంత వినిర్జితారినృప సందత్తార్థశుల్కంబులున్
సవనాచార్య విశిష్టఋత్విజుల యాశానిస్వనన్మంత్రం బు
గ్రవముల్ ప్రజ్వలితాగ్ని హోత్రములు సంరంభించె నానాఁటికిన్.

సీ. దుర్యోధనుం డాగతోర్వీశు లర్పించు
కానుకలఁ గొన సహకరణ చేసె
దుశ్శాసనుఁడు బహుదూర దేశస్థుల
సత్కార మొనరింప సమ్మతించెఁ
గర్ణుం డయోగ్య యోగ్యతలఁ బరీక్షించి
యీవి దాన మొసంగ నియ్యకొనియె
శకుని నాట్యప్రదర్శన కళారంగముల్
నడిపించి జరిపింప నడుముఁగట్టె

గీ. సైన్య విన్యాసములకు సైంధవుండు
విబుధ పరిషత్సమాజముల్ భీష్ముఁడెలమిఁ
దవిలి రాట్సూయ యజన సందర్భమునను
సాయపడ దివ్యతమమయి సాఁగె క్రతువు. ౪౦

ఉ. ఆయెడ రాజకార్యములు హోలి పయింబడవైచి యష్టభా
ర్యాయుతుఁడై పురిన్ వెడలియధ్వర రక్షణ నిర్వహింప వీ
రాయుత సంఖ్యతోడుగొని రా హరి, యాశుభవార్త వందువున్
జేయ శ్రుతిద్వయంబుకతఁ జేర్చిరి స్వాగత మిచ్చి పీటికిన్. ౮౧

కం. గోపాలుని యాగమనము
భూపాలుర కెల్లకను మోదంబిడెఁ గా
నీ వడని చేదిదేశ
క్ష్మాపాల కరూశపతులు కటకట పడుచున్. ౮౨

శా. ఏకాంతమ్మున దంతవక్త్ర శిశుపాలేశుల్ సమావిష్టులై
సాకెద్దానిని బన్న నెల్లరమునస్తాపంబు రేకెత్తునో?
శ్రీకాంతుం బగివానిఁ జేయఁదగునో? చింతించి చింతించి సం
దాకాంక్షించుచు వేచియుండిరట మాత్సర్యంబు సంధిల్లగన్.

సీ. దైనందినాగత ధారుణీశ్వరదత్త
వందన బహుమాన పరిచయములు
సతత సంవర్ధిత సంగీత పండిత
పరిషత్సమావేశ పటల నియతి
మృష్టాన్నదాన సంతుష్ట విశిష్ట ధ
రామరాశీర్వాదరవ విభూతి
అవిరళావిచ్ఛిన్న సవనాగ్ని హోత్ర ది
గ్ధ్వనిత మంత్రకలాప కాండ కలన

గీ. నిరత విరత యాతాయాత నర సమూహ
కథిత విధివర్ణనాతీత కల్పనములు
వంతకంత కధ్వరయశం బతిశయిల్లి
నిరుపమాన నిర్దుష్టమై పరఁగి వఱలె. ౮౪

శా. రంధ్రాన్వేషులు మత్సరప్రవరు లీర్ష్యాగ్రస్తు లున్మాద పా
రీంద్రుల్ ద్వేషవికారు లేకమయి దుర్వృత్తిన్ బ్రయత్నించినన్
రంధ్రీభూతము గాక యాగము సుభద్రంబై యవిచ్ఛిన్నమై
యింద్రప్రస్థపురంబునన్ జరిగె రాజేంద్రాళి హర్షింపఁగన్. ౭౫

శా. విధ్యుక్తాధ్వర కర్మమంత్రవిధులున్ విప్రార్చనల్ దీర యా
గాధ్యక్షున్ వరియించి యొక్కని త్రిలోకారాధ్యు నేతత్సభా
మధ్యస్థానమునందు నిల్పుటది ధర్మంబైన నెవ్వానికీ
యధ్యక్షత్వ మొసంగ టుత్తమము! సాధ్యంబో! విచారించుచో.

ఉ. "ఎవ్వఁడు సర్వవేది, మఱి యెవ్వఁడు సర్వకళాప్రపూర్ణుఁడో
నెవ్వఁడు వందనీయుఁడగు వృద్ధుఁడు రాచరికంబునందు నిం
కెవ్వఁడు పెద్దవంశమున, నెవ్వఁడు వినుతుండో విక్రముం
డెవ్వఁడో తెల్పుఁ"డన్న నొక్కఁడేని సదుత్తరమీయఁజాలమిన్.

కం. గంగాపుత్రుఁడు భీష్ముఁడు
సంగతి నిర్ణయముగాక సకలవిబుధరా
ట్పుంగవులు సతమతమున ము
నుంగుటఁ గని నిలచి యిటుల నొడువం దొడఁగెన్. ౭౮

ఉ. "ఓవసుధేశులార! సకలోన్నతపండితులార! సర్వభూ
దేవతలార! శస్తసుమతీశ్వరులార! దినేశుఁడుండఁగా
భావనలేక యే నెమక భావ్యమె? దీపికఁ దేఁ గడంగి స
ద్భావము సుంత గల్గిన సభాపతి లేఁడె! సమక్షమందునన్." ౭౯

శా. "ఎన్నో జన్మపరంపరల్ మనమ దెంతే నిర్వచోతీతమా
పున్నెంబెంత ఘటించి యుంటిమొ కదా! మ్రోలన్ నరాకారుఁడై
యున్నాఁ డీయుగమందు నిచ్చట నె సర్వోత్కృష్టుడై
కన్నుల్ పండువసేత యానుగద! యాకంజాక్షు నీక్షించినన్."

శా. త్రైలోక్యేశుఁడు, సర్వభూతగణ సూత్రాణుండు లోకావనా
లోలుం డార్తశరణ్యుఁ డార్తిహరుఁడున్ లోకాంతకోత్పాదకో
త్తాలుండున్ మునిలోకవంద్యుఁడు సమస్తాధ్యక్షకాచార్యుఁడున్
ఫాలాక్షస్తవనీయుఁ డబ్జభవ దేవాధీశ గోపాలుఁడే! ౫౧

సీ. "విద్యాధినాథు నవిద్యఁదీరిచి దిద్దు
సర్వజ్ఞుకంటె విజ్ఞాత యెవఁడు ?
భువనచతుర్దశంబులఁ బరిపాలించు
ప్రభువుకన్నను సార్వభౌముఁ డెవఁడు ?
నిఖిలకులంబుల నిర్మించి యాకు త
ల్లీనునిమించు కులీనుఁ డెవఁడు ?
ఆదిమధ్యాంతముల్ బోధపడని వేద
వేద్యు నతిశయించు వృద్ధుఁ డెవఁడు ?

గీ. వివిధసద్గుణఖనికన్నఁ బెద్దయెవఁడు ?
శ్రీధవుసమానుఁడౌ ధననాథుఁ డెవఁడు ?
మీఁదుపరికించుచుఁ బరిభ్రమింప నేల ?
కృష్ణుఁ బ్రార్థించి తుష్టి నర్పింప రేల ?" ౫౨

మ. "అగముల్ ద్రుంచి మరుత్స్వామిచ్చె నగమున్ హర్షింపఁగా నత్తెఁ బ
న్నగమున్ ద్రొక్కి విషంబుడించె నగహస్తన్ నిల్పె రాజ్యంబునన్
నగుదాటుల్ గలిగించి యాపలువ పన్నాగంబు ఛేదించె మి
న్నగ నెన్నందగు, నాగరక్షకుని పున్నాగున్ మురారిన్ హరిన్".

శా. "బ్రహ్మాండంబు లనేకముల్ శతసహస్రస్వర్గవర్గంబులున్
బ్రహ్మేశానసురేంద్రదిక్పతు లసంఖ్యాకుల్ గ్రహానీకముల్
బ్రహ్మణ్యుండయి చేసి నిల్పి తనుమన్ బ్రఖ్యాతుఁడౌ నీవర
బ్రహ్మస్వామి ముకుందుకంటెఁ గలఁడా! బ్రహ్మణ్యుఁ డీక్షించినన్."

చం. "ఒకయెడ లేక, యుండి మఱియొక్క యెడం గనుపించి శూన్యుఁడై
ప్రకటన చేసి యొక్కట స్వభావము నచ్చట డింది యొక్కచో
సకలము నిర్గుణక్రియను జాటి తదంతరశక్తి భూతుండై
వికటముఁ జేసి కూర్చెడు వివేకి మురారి యెఱుంగుఁ డిందఱున్".

కం. "బలులమని చెప్పుకొను నా
బలవంతులె యబలులీ సబలుఁ డలిగినచో
బలమేది సకలమునకీ
బలియనుజు కటాక్ష మింత బలియక యున్నన్". ౫౬

ఉ. "ఈతఁడు గన్మొగిడ్చిన నశించు జగత్త్రయి, విప్పిచూడ సం
ప్రీతి వికాస మందుఁ, గనుఁబెంపు వహించినఁ గిన్క భూతల
వ్రాతము సంచలించుఁ బరిభద్రతఁ బొంగుఁ గటాక్ష సంగతిన్
బాతర లేల? యీపరమపావనుఁ గృష్ణు వరింపుఁ డిమ్మలన్". ౫౭

శా. "నే మీయందఱ కంటె వృద్ధుఁడ గుణానేకప్రసిద్ధుండ, నా
సామర్థ్యంబును ద్యోతకంబుగద! భూచక్రంబునన్ నాకు నే
భూమీశుండును సాటిలేఁడు, నను సంపూర్ణజ్ఞగా నెంతురే?
నే మీకీతనిఁ గోరుకొమ్మనినచో నేలా వృథాప్రయాసముల్". ౫౮

మ. అని గాంగేయుఁ డనేకభంగుల సభాధ్యక్షత్వమున్ శౌరికి
చ్చిన మేలౌనని నొక్కి చెప్పినను నాసిద్ధాంత మాలించి ని
ల్చినఁ బూదండను బూని ధర్మజుఁడు తచ్ఛ్రీకాంతుఁ బూజింపఁ గ
క్కునఁ జేదీశుఁడు దంతవక్త్రుఁడు మహాక్రోధంబుతో నిల్చుచున్.

కం. పటపటఁ బండ్లం గఱచుచుఁ
జొటజొట క్రొన్నిప్పులురలఁ జూడ్కుల నుదుటన్
బొటబొటఁ జెమటలు చిమ్మఁగ
గటకటఁబడు చిట్టు లనిరి క్రౌర్యాత్మకులై. ౬౦

శా. "చాల్చాలింపుము స్వస్తి యింక నెవరున్ సైరింప రీనీమృషల్
వ్రేల్చున్ దూఱుచుఁ గర్ణరంధ్రములలో భీష్మా! వృథా స్తోత్రముల్
మేల్చాపించితి వందిపోలికలు భూమీనాథయూథంబులా
వాల్చాపుల్ పెనుద్రుచ్చుతీరెఱుఁగరే? వ్యర్థంబుపన్యాసముల్.

శా. గ్రీవైకత్వమ్మునఁ బల్కి రిప్వారోకసై కేలెత్తి భీమన్న "దు
ర్భావోద్రేకముతో సభాస్థలిని సంభాషింప సైరింతుమే?
నీవో నీసఖుఁడో వచింపవలయున్ జేదీశ! లేకున్న నీ
త్రోవన్ బొమ్ము సభానిబంధనగతుల్ రుచ్యంబు గాకున్నచో".

కం. అని యనిలజుఁ డాడినఁ దన
కనుసన్నను దంతవక్త్రుఁ గదఁకుమని ప
ల్కెను శిశుపాలుం డొకఁడా
ననమున వికటంపు నగవున నెత్తవిడిన్. ౬౩

శా. "మీకున్ మీకును బంధముల్ గలిగినన్ మీయింటిలో వానికిన్
జేకూర్పందగు నర్చనాదికములక్ష్మీశావనీనాయకా
నీకంబున్ బిలిపించి యాగవిధికే నీచాత్మునో పేర్కొనన్
మాకధ్యక్షుఁడుగా క్షమింపఁగలరే! మానప్రధానుల్ నృపుల్".

కం. "ముదిమి మదిఁ దప్పి భీష్ముఁడు
వదరెనుబో, ధర్మజుండు పంద విధమునన్
బెదరి యొకదండఁ గైకొనెఁ
గద! యెగ్గును సిగ్గు వదలి గతిమాలి సభన్". ౬౪

కం. "అధికము న్యూన మెఱుఁగని
యుధిష్ఠిరునకు మతిలేక యుండు టుచితమే!
యధముండగు యదుకులుఁ డే
విధి పూజకుఁ దగుదు సంచు విడువక నిలచెన్!". ౬౫

శా. రాజ్యార్హుఁడు దుష్కులీనుఁడును దుర్మార్గుండు నీచుండు సం
పూజ్యాపూజ్య విచార హీనుఁడు తమోభూయిష్ఠుఁడౌ వీఁడసా
మ్రాజ్యప్రాజ్య సభాధ్వరక్రియలకున్ మానావమానత్రపా
పూజ్యుండై యరుదెంచె నేమొగముతోఁ బూజింతు రేయీపశున్

సీ. "ఏగోనంబుల నీతఁడెచ్చు? నిచ్చకపు మ
చ్చికఁ జేరి యిండ్ల మ్రుచ్చిలుటఁ గాక
ఎన్న నీతండెందు మిన్న? తారువుల నే
ర్పునఁ గాపురంబు లార్పుటను గాక
విద్దెల యందెందుఁ బెద్ద? యీతఁ డబద్ధ
పద్ధతిఁ గిఱరించు విద్దెఁ గాక
పస యెందుఁ బొసఁగు నీమసిపాప కన్న? బా
సల మోసగించు వేసములఁ గాక

గీ. ఏమి కర్జములోలి సాధించె నన్న
బకములం బసరంబుల వస యడంచి
మగఁటిమిం దూలి పాఱి మా మాగధునకుఁ
గడలిలోఁ గొంపఁ గట్టుట గాక యేమి? ౬౮

శా. త్రాగుంబోఁతు సహోదరుండు కులమర్యాదక్రమం బూడ్చుచున్
జోగిం జేకొని చన్న సోదరియు, మ్రుచ్చుం జుట్టపక్కంబులున్
యాగాన్నంబులు జోగిమాధుకరముల్ సూచించు టే వృత్తి యే
లా? గణ్యుండని రాజసూయమున నిల్వంబెట్టి రీమూర్ఖునిన్? ౬౯

సీ. విజ్ఞాన ఖనియని వినుతించి పూజింప
సూరిశేఖరుఁడు వ్యాసుండు లేఁడె?
శస్త్రాస్త్రయోగ నిష్ణాతగా నర్చింపఁ
బండిత కుంభసంభవుఁడు లేఁడె?

బహుపరాక్రమ వరుఁడని గణియింప
యుద్ధసింహుండు శల్యుండు లేఁడె?
సార్వభౌమఖ్యాత సంజ్ఞ భూషింప మ
త్స్యకళింగవంగ భూధవులు లేరె?

గీ. నీతిశాస్త్రకోవిదుఁడని నిర్ణయింప
విదుర జాబాలి నసదృశ కోవిదులు లేరె?
యిట్టి దాశార్హుఁ డెచటఁ బ్రాపించె మనకు
నీసభాధ్యక్షుఁడగుచు సాగింప సభను? ౨౦

కం. గెంటింప వేయఁదగు నీ
తుంటరి సభనుండి మీకు దోర్వీర్యములున్
దంటతనమేదునను నే
గెంటింతును జూడుఁడీ నికృష్టుఁ గృష్ణున్. ౧౨

మ. అను నశ్లీల వచోనినాదము లసహ్యంబైన, భీష్ముండు ని
ల్చెను గోపారుణనేత్రుఁడై యిటుల భాషించెన్ "మదోద్రేకవృ
త్తిని వర్తింతువు చేదిభూమివర! నీతిన్ జ్ఞానమున్ బోయి ని
న్ననుకంపం దలపోసి చూచినను మూర్ఖా! కానవా లోకమున్."

ఉ. "ఏటికిఁ బ్రల్లదంబు? మఱి యేవిషయంబున నీకు శౌరితోఁ
బోటి? పదాఱుకోట్లు నినుఁబోంట్ల మదం బడఁగింప నోవు నా
ధాటి యెఱింగ తెలుంగక వృథా వదరం బనియేమి? యైన నీ
పాటవ మున్నఁ జూపు నగుబాటగు నేఁడిదె మేటి కొల్వులోన్."

చం. "అయినను నేనెకా హరి సభాధిపుఁ జేయ వచించి యుంటి దు
ర్ణయగతి నిష్ఠురోక్తుల ధరాధరు లిందఱ ముందు నాడ న
క్షయమగు శౌరికిన్ జెడు యశంబును నాశముఁ గల్గు నీకు. నీ
ప్రియు లోకరేనియున్ నినుఁ దరింపఁగ రాదు నిజంబు నమ్ముమీ!

చం. అనినఁ గరూశనాథుఁడు దురాగ్రహచిత్తుఁడు దంతవక్త్రుఁడున్
దనుజులుఁ గొందఱున్ నిలువ ధర్మజుఁ డిందఱి శాంతినుండఁగా
వినతిరొనర్ప వార లవివేకముతోఁ జెలరేఁగి నర్జునుం
డనిలజులోర్వ కార్చి నిశితాయుధపాణులుగా మహోగ్రులై.

కం. సభలోన నంతకంతకు
రభసము లేర్పాటుగా మురారి యుపేక్షన్
శుభము సెడి సభయుఁ జెడు నని
యుభరాడ్వరదుండు లేచి యిట్లని పలికెన్. ౭౮

మ. "శిశుపాలా! శతదోషముల్ గడఁచె నిన్ ఛేదింతు సైరింప నీ
విషయుంబుల్ మితిమీఱె నీజనకుఁడున్ విజ్ఞప్తిఁ గావింప నా
యశమున్ గౌరవ మెంచ కోర్చితిని నాయంగీకృతిన్ జెప్పి నీ
కసిఁదీరన్ బడియుండి నింతదనుకన్ గాపాడుకొమ్మీ యసుల్".

కం. "కడచినవ మంచిదివసము
లోడఁబఱచిన నీకుఁ గలిగె నుపకృతి బత్తిన్
గడఁగి భవదీయపిత నే
నుడివిన గతిసైచి యుంటి నూరు దొసగులన్." ౭౯

శా. "నీకాలమ్మును దీఱె నీ కొఱకుఁగా నే జన్మమున్బొందితిన్
గాకల్ దీరిన నీశరీరమున దుష్కార్యోద్యమాసక్తిమి
థ్యాకాంక్షల్ దురితప్రవృత్తి దొలఁగన్ న్యాయంబెనిన్ ద్రుంచినేఁ
జేకూరున్ బరలోకవృత్తి నిదిగోఁ! జేదీశ! వైళంబుగన్".

శా. "నన్నంటగలవే? తిరస్కృతులు బన్నంబుల్ నమస్కారముల్
పున్నెంబుల్ మఱి పాపముల్ నుతులు సంపూజ్యాత్మశుద్ధత్వమే
యన్నింటం గని తత్ప్రకారగతి నాయస్థానముల్ గూర్చెదన్
మిన్నల్ నీచులు లేరు నాకొకటెసుమ్మా! యెల్లరందేనియున్".

ఉ. "ఈతఁడు పాపియంచు గణియింతురుగా యితఁడన్న నాకు సం
ప్రీతి ననున్ సదా హృదిస్మరించుట వైరముచేత నే మఱో
పాతర లాడఁబోఁడు ననుఁ బట్టువిధంబుఁ దలంచుఁగాని, నా
చేత నె నేఁడు వీనిమృతి సిద్ధము మీరు దలంగిపోఁదగున్. ౧౨

ఉ. చూతు నె వాఁడు వీని దయఁ జూచి సమర్థత రక్షసేయునో
వీతశిరుండు గాక", యని వేసి నిశాతకరస్థ చక్రమున్
బాతక చక్రజృంభణ విభంజదవక్రము, చేదిరాజకం
ఠాతతనాళ లుంఠన మొనర్చె, సదస్యుల కద్భుతంబుగన్. ౧౩

శా. ఆలోఁ దత్పరిషత్సదస్యులకు నత్యాశ్చర్య మేపార! గో
పాలాంభోధర నీలదేహము, నా పాపిష్ఠ చేదీశ్వర
స్థూలాంగంబులు నిర్గమించి యొక తేజోజ్యోతి చేరెన్ దిశా
జాలంబుల్ మిఱుమిట్లుగొల్ప, హరి హర్షం బొప్పఁగాఁ గైకొనన్.

కం. శిశుపాలునిఁ గడ తేరిచి
యసమాన వికాశితాననాబ్జంబునకున్
బసలీన మందహాసము
లసదృశమాధుర్యఫణితి ననె నీవగిదిన్. ౧౪

మ. "మును నాకీతఁడు కూర్చు నాతఁడయినన్ ముప్పాట్టుకల్ నుండి శా
ప నియుక్తిన్ జనియించి శాత్రవుఁడుగా వైరంబుతో నేనియున్
ననుధ్యానించునె కాని యొండితరమున్ స్మైరింపఁగాఁ బోని కా
రణ భాగ్యంబున నేఁటి కీతనికి సంప్రాప్తించె సాయుజ్యమున్".

ఉ. "నివ్వెఱఁ బోవ నేటికిఁ? బునీతముగా నిఁక సాగు యాగమీ
ఆవ్వరియు మంచికై కలిగె రక్షణ చేకుఱెఁ గయ్యమూని కా
ల్దువ్వు దురాసదుల్ దెలివితోఁ జరియింతురు విఘ్నమాదిలోఁ
నివ్వటిలన్ శుభాంతమను నిర్ణయ మే గతివ్యర్థమై చనున్". ౧౬

ఉ. "ఈసభ కాధిపత్యము వహించుటకే జనుదెంచలేదు మా
నీశులు రాజచంద్రు లవనీసురులున్ విబుధేంద్రులెల్ల వి
చ్చేసిరి వారిలో నొకరిం జేసికొనందగుఁ గాసభాపతిన్
బాసటయై సభాక్రమముఁ బాలనచేయనె యానతిచ్చినన్." ౮౭

ఉ. నానృపతుల్ బుధుల్ దనుజనాయకులున్ మునిసార్వభౌములున్
క్షోణిసురుల్ నిలంబడి ముకుందుని వేఁడిరి యగ్రపీఠికన్
బూని సభాక్రమంబుఁ బరిపూర్తి ఘటింపగ, రాజసూయమున్
మానితయై జగత్త్రయి ననన్యచిరస్మరణీయ మౌనటుల్. ౮౮

వ. అంతట — ౮౯

శా. గాంగేయుండు సుయోధనుండుఁ గృపుఁడున్ గర్ణుండు నానానృపుల్
గాంగేయాంగద బద్ధబాహుల నమస్కారంబు సారించి శ్రీ
రంగాధ్యక్షుని వాసుదేవుని సభారంగాధిపత్యంబుఁ బూ
నం గాంక్షించిన సమ్మతించె హరి యజ్ఞప్రక్రియస్ఫూర్తికై. ౯౦

ఉ. అంత యుధిష్ఠిరుండు జలజాక్షుని మ్రోలకు నేఁగి గ్రీవమున్
సంతరణం బొనర్చి విలసన్మణిదామముతో వినమ్రుఁడై
పొంతఁ గలట్టి వేదికను ముట్టుచుఁ జూపుచు డాయఁజేరి దై
త్యాంతకు మెల్లఁ జేరిచె నుదగ్ర సభావలి దివ్యపీఠికన్. ౯౧

ఉ. పాద్య మొసంగి యర్ఘ్యము సువర్ణదుకూలము లారతిచ్చి సం
వేద్య మొనర్చి శౌరి ఘనవిశ్రుతకీర్తి సభాముఖంబునన్
వాద్యము లోలి మ్రోగ నవభర్మమయాసనయుక్తుఁ జేసినన్
హృద్యముగా వియచ్చరులు నృత్య మొనర్చిరి సంతసంబునన్.

వ. తదనంతరంబ — ౯౪

ఉ. శాంతనవుండు లేచి నృపసత్తములం గలయంగఁ జూచి శ్రీ
కాంతు కటాక్షసంపద మఖంబు శుభప్రదమైన విస్తృతో
దంతము వెల్లడించి నిజధన్య వచస్స్ఫురణంబుఁ దెల్పె యొ
క్కింత సుభాషితంబు వచియింపఁగ నేఁడె ముకుందు నర్థిమై.

ఉ. పున్నమ రేయి చందురుని మోమున నవ్వుల వెన్నెలీనఁ బ
ల్గొన్నన చాలువెల్గు తళుకుల్ రవబుగ్గల నిగ్గు దీర్ప వా
ల్గన్నుల కల్వపూల చెలికార మొనర్పఁగ గండుతుమ్మెదల్
మున్నెఱులోలి వాతెఱల పోఁడిమి వాఁడిమి పర్వ నల్గడల్. ౯౭

ఉ. మణిమయ కుండలద్యుతులు మండనమై వెలయన్ గపోలద
ర్పణముల, మౌళిపై మెఱయు బాలతురాయి ముఖాంబుజంబు ద్యో
మణియయి సొంపుఁ బెంప, హరిమధ్యముఁ జుట్టెడి మేల్మిఱొల్లె జృం
భణ మొనరింప మేనిపస ప్రాలియు ప్రీలి, మురారి యిట్లనెన్,

ఉ. "తాపసచంద్రులార! వసుధామరులార! నరేంద్రులార! వి
ద్యావరిపూర్ణు లెందఱో మహాత్ములు నెందఱొ కూడినారు మీ
కేవరమార్గముల్ వలికియేగతిఁ దుష్టి యొనర్పవాఁడ? నా
మోపిన రీతిమై నొడువనోపుదు దోసము లున్న సైపరే!". ౯౮

సీ. బహునాయకత్వంబు బాధాకరంబౌట
సమకూర నేరదు శాంతి ప్రజకు
అధికారి లేకుంట నధిపులు స్వచ్ఛందు
లై భీతిమాని పాపాధ్వగాము
లగుదురు, గర్వమదాంధులై యన్యోన్య
కలహంబులకు దిగ నాత్మజనంబు
గడగండ్ల నొందుటఁ గలిగి యధర్మంబు
వ్యాప్తమై చను, ధర్మ మడఁగి పోవుఁ

గీ. గానఁ బాలకులకు నహంకరణ మాన్ప
ధర్మరతుఁడగు నొక్క ప్రతాపశాలి
వివిధనృపులను నోర్చు దోర్వీర్యుఁ డగుచు
రాజనాయ మొనర్చుట రాచరికము. ౯౯

ఉ. "ధర్మనిబద్ధశౌర్యబలదక్షుఁడు లోకహితార్థమూని స
త్కర్మము లాచరించ వివిధావనినేతల సార్వభౌముఁడై
మర్మములేక భూమివిభుమండనుఁడై చరియించునేని దు
ష్కర్మము లావహిల్లవు, సుఖింపదు లోకము శాంతియుక్తమై."

ఉ. "పాలక భార మూనుట శుభంబ, పరార్థముఁగోరి స్వార్థముల్
మాలి ప్రజాహితంబె నిజలాభముగాఁ దలపోయుచుంట భూ
పాలకపాలుఁడో, యఖిలపాలక దుశ్చరితంబు మాన్పి భూ
పాలన నిర్వహింపవలె బంధము లూడిచి త్యాగిపోలికన్". ౧౦౦

శా. "ఏ భూభర్త నయోచితంబుగఁ బ్రజాభీష్టంబు గుర్తించుచున్
భూభారంబువహించునో! యతఁడె పో! పూజ్యుండ యుండంద యే
భూభృత్సంజ్ఞుఁడు స్వార్థసౌఖ్యమునకై భూపాలనన్ జేయునో
యాభూపుం డధముం డనర్హుఁ డగు రాజ్యప్రాజ్య సంపత్తికిన్."

ఉ. "క్ష్మావతులన్ జయించి యరికాపులఁ జేసి నృపాలపాలుఁడై
యాఁపి దురాగతంబుఁ గలహంబుల మానిపి న్యాయమార్గసం
స్థాపకుఁడై ప్రజావనవిధానుఁడు ధర్మరతుండు న్యాయచిం
తాపరుఁడే సమర్థుఁడు హొనర్పఁగ నీగతి రాజసూయమున్."

శా. మీమీ కాన్కలుఁ గప్పముల్ గొనెడు నెమ్మిన్ విక్రమస్ఫారదో
స్సామర్థ్యంబులఁ జూపఁగా సవనదీక్షన్ బూనఁగా లేదు; నా
నా మిథ్యాగతులన్ నృపాలురు దురన్యాయక్రియోద్యోగులై
వ్యామోహంబున నుంట కంటకముగాఁ బ్రాపించె యాగార్థముల్

ఉ. "ధర్మజు కంటె నిఁకెవఁడు ధారుణి నీగతి రాజసూయముం
గర్మ మొనర్పఁగాఁ దగిన క్ష్మాపతి లేమిని బ్రోత్సహించితిన్
మర్మ మెఱుంగఁ జేయుచు సమాప్తముఁ జేసితి రాజసూయమున్
ధర్మము స్థాపితంబయిన దానసుఖించుఁ బ్రజాసమూహముల్.

శా. శ్రీకృష్ణుం డిటు చాటి చెప్పిన వచశ్శ్రీసూక్తు లాలించి యం
గీకారంబున రాట్సుతుల్ పొగడ శ్రీకృష్ణప్రబోధం బసం
ఖ్యాకుల్ భూపులు ధర్మజానుచరులై ధర్మించి తత్ప్రాపకం
బేకగ్రీవముతో హరిప్రవచనోత్కృష్టత్వ మగ్గించుచున్. ౧౦౪

ఉ. ఈగతి రాజసూయము నహీనగతిన్ బరిపూర్తిఁ జేసి దు
ర్యోగముఁ గూర్చి చేదిపతికున్ముఖుఁడై పయనం బొనర్పఁగా
నేఁగె ఖగాధిరూఢుఁడయి కృష్ణుఁడు ద్వారక కర్జునాదులున్
సాఁగి పిఱుందఁ గొంత వివశంబున నిల్వ వియోగయోగులై.

వ. అంత నింద్రప్రస్థపురంబునందున్న దుర్యోధనాదు లసూయాగ్రస్తమానసులై యున్నచోఁ గొండొక దివసంబునఁ బరిభవింపఁబడుటయుఁ బ్రతీకారమును యోజించి యాదుష్టులగు ధార్తరాష్ట్రులు పాండవులను హస్తిపురంబునకు నాహ్వానించుటయును, నచ్చట ద్యూతాసక్తిఁ బాదుకొలిపి ధర్మజు ద్యూతమునకుఁ బురికొల్పి దురోదరంబున సకలరాజ్యమును నోడిచికొనుటయుం గలిగిన—

ఉ. సకలము నోడి ధర్మజుఁడు సర్వవిభూషలు భీము నర్జునున్
నకులుఁ గనిష్ఠసోదరుఁ బణంబిడి యొడ్డిన నోడిపోయియుం
దకుఁ దమిఁదీర కోడె ద్రుపదాత్మజఁ గృష్ణను బందె మొడ్డుచున్
శకుని దురాగతంబున విషాదము పొందిరి పాండవేయులున్. ౧౦౬

చం. ద్రుపదజ గెల్చి నంతటనె ద్యూతము నందు సుయోధనుండు గ
ర్వపరతు దుస్ససేనుని సభాసదనంబున కేఁగి తేర ని
ష్కృప నసుపన్ దురాసదుఁడు గృష్ణ రజస్వల నంటి తెచ్చె ని
స్త్రపుఁడయి రాట్సభాసదులసన్నిధికిం గురువృద్ధు లోర్వఁగన్.

ఉ. తెచ్చిన నేకవస్త్ర ద్రుపదేశ్వరపుత్రి సభాంగణంబునన్
మచ్చర మార, భీష్ముఁడు క్షమాపతి యాధృతరాష్ట్రుఁడున్ గురుల్
రెచ్చి పచింపఁ జాలమికి లేమ సహింపక తెంపుఁ జేయుచున్
బృచ్ఛ యొనర్చెఁ దన్నెటు నిజేశ్వరుఁ డోడెనొ తెల్ప నమ్రయై.

ఉ. ద్రౌపది ప్రశ్నకున్ బదులు దేఁకువతో వచియింప దుర్ఘటం
బై పరఁగన్ సుయోధనుని యాజ్ఞతిఁ దమ్ముఁడు దుస్ససేనుఁడుగ్
గోపమునం బరాభవముఁ గూర్చి వివస్త్ర నొనర్పఁ బూనె సం
తాపముఁ జెంది కృష్ణ మది ధ్యాన మొనర్చి ముకుందునాత్మలో.

మ. ఒకచేతన్ దనపుట్ట మంటి మఱి రెండో హస్తమున్ జాచి పూ
నిక మానావన ముద్యమింపఁ గినుకన్ నీచుండు దుశ్శాసనుం
డొక చేతం బెకలించి కేలు, వసనంబూడం డిగన్ లాగ వే
అొక చేతన్ ద్రుపదాత్మజాతతన యుద్యోగంబుఁ ద్యాగంబుగా.

ఉ. "చేతులు రెండు నెత్తి తన చిత్తమునం గమలాక్షుఁ గూర్చి సం
పూత చరిత్రయై సకలమున్ హరికై వసమున్ ఘటించి యే
పాతకులాడఁ బోక తనుభారము మానపరాభవక్రియల్
ప్రీతి ముకుందుపై నిడి, నివృత్తిఁ బకీర్తి యొనర్చె నీక్రియన్.

శా. "అన్నా! విన్నప మాలకింపఁగదె! నేనాపన్న సంఛన్న నేఁ
డీన్నిచుండిదె తెన్నుమాలి యవమానించున్ ద్రపాగౌరవ
స్కన్నుండై హృది నిన్నె యెన్నెదను, నీకన్నన్ మఱొమిన్న నా
బన్నంబూడుపను న్నె? వన్ మనుప వే! పద్మాక్ష! దామోదరా!"

చం. "గురులుఁ గురూత్తముండుఁ బ్రముఖుల్ చతురాస్య
ముఖోద్భవుల్ ధవుల్
విరిసిన యీసభాభవన వేదిఁ బరాభవ మొందు నన్నుఁ జి
త్రములువోలె బిత్తరిలి స్తబ్ధత ధర్మవిచక్షహీనులై
యరసెద రేల జాగు? కరుణాకర! దేవ! యనుగ్రహింపవే!"

శా. "ఈవే తండ్రివి దోడుగా సఖుఁడు నీవే కూర్మి చుట్టంబుగా
నీవే వేల్పుగ దాతగా సకలమున్ నీవంచు భావించుచో
భావాధ్వంబున భక్తవత్సలుఁడు నాపక్షంబుండవుం డీపరీ
భావాంభోధికిఁ గర్ణధారియయి నన్ బారంబుఁ జేర్పించుతన్!"

శా. ఈ దీనోక్తుల నాడు నత్తఱిని శ్రీకృష్ణుండు శుద్ధాంత కాం
తా దాసావృతుఁడై చతుర్దశ జగత్సంతోషవిస్ఫూర్తిఁ బ్రా
సాదాంతర్గతుఁడై చెలంగు నెడఁ బాంచాలీకృతప్రార్థనా
వేదధ్వానము లాశుగంబగుచు విన్పించెన్ శ్రవోద్భేదులై.

చం. కనుల మొగిడ్చి చక్రి కల గాథ నెఱింగి వచింప నక్షయం
బని, యట దుస్ససేనుఁడు బలాఢ్యుఁడు కృష్ణఁ బరాభవింపఁ గై
కొని వసనంబులం దిగిచి క్రూరత లాగిన నంతకంత నూ
తన వివిధాంబరప్రతతి తద్దయు నక్షయమై యొసంగుటన్. ౧౧౮

కం. దుశ్శాసనుండు పదపడి
నిశ్శేషముగా దుకూలనికృతి యొనర్పన్
దుస్సాధమైనఁ గ్రోధపు
రస్సరుఁడై తిగిచె నంబరానీకములన్. ౧౧౯

ఉ. లాగుకొలంది వస్త్రముల లావు వెలుంగఁ గలంతిఁ గాంచి బెన్
వ్రేగయితోఁప నుస్సురని వ్రేలుచు వ్రీలుచు దుస్ససేనుఁడు
డూఁగి కలంత చెంది వెఱదోఁచిన వ్రాలెను దూలి నేలపై
నీగతికై సదస్యులుఁ జలించి మహాద్భుతభావ మందఁగన్. ౧౨౦

కం. ధృతరాష్ట్రుఁడు ద్రౌపది స
ద్గతికిఁ బ్రశంసించి రాజ్యభాగ మొసఁగి త
త్పతుల నలరించె మాధవు
నుతినమ్మినఁ గొదువఁబొందు మానవుఁ డున్నే? ౧౨౧

చం. ప్రతిన ఘటించి కౌరవులుఁ బాండవులున్ మఱునాఁడ జూదమున్
జతన మొనర్చి యాడిరి యనాదరభావముఁ జూపి తండ్రియా
నతిఁ బదిరెండ యేఁడులు వనంబుననుండి త్రయోదశాబ్ది గూ
ఢతను బరాజితుల్ పురిని డాఁగ బయల్పడరాని కట్టడిన్. ౧౨౨

మ. అటు కౌంతేయులు మాద్రవేయులు నరణ్యావాసులై యుండ నె
ప్పటిరీతిన్ హితబాంధవాతిథుల సంబంధంబు పెంపార న
క్కటికన్ శౌరి నిజానుయాయులకు రక్షాప్రాప్తిఁ గావించె వి
స్ఫుటమౌ నక్షయపాత్ర నొండొసఁగి సంపూర్ణాన్నదానార్థమై.

సీ. ఇటులుండఁ గొన్నాళ్ళు కృష్ణుండు భటసతీ
పరివృతుండగుచు వ్రేపల్లె కరిగి
యమునాహ్రదంబున నర్ఘ్య మొసంగుచోఁ
గమలాప్తునకు వియద్గమనుఁడగుచు
గయుఁడను గంధర్వకాంతుఁ డేమఱి, నలి
నాక్షుపై నిష్ఠీవనంబు వేయ
సకలంబెఱింగియుఁ జక్రి కిన్కఁ నటించి
ప్రతిన యొనర్చెను వానిఁ జంప

గీ. నీయుదంతము గయుఁ డెట్లొ యెఱిఁగి శరణు
పొందఁ దిరుగాడి ముల్లోకములను దుదకు
నారద నియతి నటవిలోఁ [illegible]విగలిసి
శరణు వేఁడిన శరణిచ్చె శక్రసుతుఁడు. ౧౨౩

చం. అరసి యథార్థమంతయు సురాధిపపుత్రుఁడు తెల్లఁబోయి స
త్వరగతి నన్నదమ్ములకు దథ్యముఁ దెల్పిన వారుఁగూడ సు
స్థిరగతినిల్చి చేసినప్రతిజ్ఞను నిల్పుట ధర్మమంచుఁ జె
ప్పిరి యదియెట్టులో తెలిసె వేణువినోదికిసుంత లోవలన్. ౧౨౪

శా. అక్రూరున్ హరి ద్వైతకాననమునం దావాసముం జేయు ని
ర్వక్రస్థైర్యులఁ బాండవేయులను జేరం బోయి సంధించుచున్
వాక్రువ్వన్ గయుఁ ద్రోసిపుచ్చునటుఁ బంపన్ జెప్పి సర్వంబు నా
శక్రాచార్య సమానధీయుతుఁడు దుష్ప్రాప్యాటవిం జేరుచున్.

ఉ. ద్వైతవనంబు డాసి కని పాండవులున్న నివాసభూమి, ని
ర్భీతి గమించి పాండవుల నిర్మలతత్త్వ మెఱిఁగియున్న సం
ప్రీతి నుపాయయుక్తుల కభేద్యముగా హరి పాలికేఁగి యా
రీతి వెలార్చెఁ బాండవుల వృత్తి నుతించుచుఁ, జక్రపాణియున్.

మ. హృదిఁగౌంతేయుల నిశ్చలత్వమునకున్ హృష్టాత్ముఁడై యున్న నె
మ్మది నిక్షిప్తమొనర్చి తద్గతి వెలిన్ మాత్సర్యమున్ జాటి సా
యుధ సైన్యుండయి చేరి డాయఁజని యా యుగ్రాటవీసంస్థితుల్
గొదసింగంబులఁ బొందు పుత్రకుల నాగోపాలుఁ డేపారఁగా.

చం. నయమున సామదానగణనంబున శాంతి విరోధ సంగతిన్
భయమున సంధివిగ్రహమునన్ గడు నాగ్రహవృత్తి నద్భుత
క్రియలఁ బరీక్ష చేసినను గ్రీడి తలంగమి నిశ్చితార్థమున్
గయుని క్షమించిపుచ్చి కురునాథకుమారుల మెచ్చి యిట్లనెన్.

ఉ. "రాఁగల భారతాహవధరన్ రిపుసంతతి విక్రమింప మీ
రేగతి సిద్ధులై నిలిచి యేమి యొనర్చెదరో! యటంచు నే
నీగతిఁ గూర్చినాఁడను జయించి గడింతురు రాజ్యలక్ష్మి మీ
త్యాగము స్థైర్యమున్ ధృతివదాన్యత సంస్తవనీయమారయన్.

# కు చే లో పా ఖ్యా న ము

వ. ఇట్లు పాండవేయులఁ బరిశీలించి కొంతతడవు వారికడనుండి మగిడి కుశస్థలీపురికి వచ్చి యున్నంత — ౧౩౧

ఉ. కలఁడొక ధారుణీసురుఁడు కంజదళాక్షుని బాల్యమిత్రుఁడై
చెలఁగి సమస్తవిద్యల సుశిక్షితుఁడై హరితో, గృహస్థుఁడై
పొలఁతి నొకర్తుఁ జేసికొని పుత్రులఁ బెక్కురఁ బొంది యర్థసం
కలన దరిద్రుఁడై నవసి, కాంచి కుచేలక సార్థనామముల్. ౧౩౨

వ. ఆ సుధామనామకుఁడగు కుచేలసంజ్ఞుఁడు — ౧౩౩

సీ. త్రిషవణస్నానంబుఁ దీర్చి ముప్పొద్దుల
సంధ్యవార్చి యొనర్చు జపతపములు
నిత్యాగ్నిహోత్రుఁడై నిష్ఠాగరిష్ఠతఁ
బంచయజ్ఞముల యేర్పాటు గడఁగు
వైశ్వదేవంబు నిర్వర్తించి కాని, భో
జన సముపాయంబు సరకుఁ గొనఁడు
పితృతర్పణాది సద్విధులఁ దీరిచి దిద్ది
పర్వంబులం దుపవాసముండు

గీ. అధ్యయన యాగ యజన ధర్మార్థకామ
మోక్ష పరతఁ బ్రతిగ్రహాపేక్ష మాని
తన సుధామాఖ్యఁ జేసి సార్థకము జగతి
బరమసంతుష్టి నెగడె నాబ్రాహ్మణుండు. ౧౩౪

కం. వామాక్షి యతని భార్యయుఁ
బ్రేమాంబుధియై చరించి పెనిమిటి సుతులన్
నేమమున నుపచరించెను
సామముతో నిహపరముల సాధన [illegible]చున్. ౧౩౫

సీ. నకనకలాడి యాఁగక చుట్టి యాఁకటఁ
దఱుము బిడ్డల సమాధాన పఱచి
కట్టుపుట్టము లేక కడగండ్లఁ గను పతిఁ
జేరి తాల్చిన సీరఁ జించి యిచ్చి
తనకున్న దానితోఁ దనిసి యెప్పుడుగక
యింటిమర్యాద దక్కించి మించి
జపనిష్ఠ మునిఁగి సంసార విస్మృతిఁగన్న
నాథు నర్చించి మన్ననలఁ బడసి

గీ. కలిగియున్నట్టి కాసు నిష్కంబు గాఁగఁ
దలఁచి తనివొంది తన మానధనము గోప్య
పఱచి కాఁపురమును దిద్దెఁ బంకజాక్షి
యతులితాక్షరకుక్షి వామాక్షి నెమ్మి. ౧౩౬

కం. ఋతుకాలనియతి భార్యా
యుతుఁడైన సుధామునకును నుదయించెను సం
తతి యోలి సప్తవింశతి
ప్రతివత్సరమొక్క శిశువు వరుస గ్రహాగతిఁ. ౧౩౭

వ. ఇట్లుగడచినఁ గొంతవడికిం — ౧౩౮

ఉ. పెద్దలనుండి చేర్కొనిన విత్తము మాన్యము లాణిముత్తెముల్
దద్దయుఁ బుట్టి నింటఁ దలిదండ్రు లొసంగిన సొమ్ములమ్మి యే
సద్దునుగాక దిద్దుకొనె సంసృతి కూర్మి సుధామపత్ని యా
యొద్దికఁ జూచి విస్మయము నొంద సుహృద్ధిత బంధువర్గముల్.

ఉ. "లేమిడి నోర్చి తాలిమిని లేమ క్షుధావ్యథ మోల నిల్పి గా
రాముల మారమున్ సలుపు గాదిలి బిడ్డల పాటు నోర్వమిన్
రామ సుధాము నొద్దకు వినయమునం జని డాసి మెల్లఁగా
సామము నేమమున్ మృదుల శాంతసుధామధురోక్తి నిట్లనెన్.

చం. "అజగరవృత్తినుంట పరమార్థము దైవము నమ్మి, కాని యీ
నిజమును బిడ్డలెల్లు [illegible]చి నిలఁబడ వారలాఁకటన్
గిజగిజలాడఁబోక? [illegible]పుఁ[illegible] పాయను వారిఁగన్నచో
గజగజలాడు నా యెడద కన్న దొసంగున కేమిచేయుదున్?" ౧౪౧

కం. "అర్ధాంగి నగుట నావెత
యర్ధాంశంబుందు ననుట వ్యర్థమె? మీరే
యర్ధంబును జేకూర్చి కృ
తార్థత సాధింపుమిమ్ము నర్థింతుఁ బతీ!" ౧౪౨

కం. అనవుడుఁ గలఁచి, వెడవెడఁ
గనుమూయుచుఁ గ్రిందుమీఁదుగడలను గను నా
వెనిమిటిఁ గనుఁగొని బత్తిని
వనజేక్షణ కేలుమోడ్చి పలుకఁ దొడంగెన్. ౧౪౩

మ. "వినియుంటిన్నద! యెన్నిమార్లొ తమరే విన్పింప మీ బాల్యమి
త్రుని దీనావను వాసుదేవమహిమల్ రూఢంబుగాఁ బోయి ద
ర్శనమున్ జేసిన సర్వవేది హరి మీచారిత్ర సర్వంబు లోఁ
గని దారిద్ర్యముఁ దీర్చి సద్గతికి మార్గంబున్ బ్రసాదింపఁడే!"

చం. "చలమున నేనిఁ గ్రోధగతి శాత్రవ భావము నూనిగాని న
వ్వులకయినన్ బరాకునఁ గుబుద్ధి సకృత్తుగ నేని యాత్మలోఁ
దలఁచినఁ గామలోలుఁడయి, దాసునిగాఁ బరికించి ప్రేమునిన్
వలచినకోర్కెలిచ్చు నెఱదాతగదా! యదుసింహుఁడారయన్."

కం. "పగవాని సెగులు దీరును
వగదగులునసుగతిఁ గనినఁ బగలును రేలా
నగధరు పదయుగ మంటిన
సుగుణాత్ముని దిగులు గాంచి పోద దీర్పఁడొకో", ౧౪౬

కం. వామాక్షి సూక్తులను స
ప్రామాణిక గరిమఁ దోఁపఁబరవశుఁ డగుచున్
గామజనకుఁ గాంచుటయు సు
ధాముం డిహపరములకును దారక మనుచున్. ౧౪౭

ఉ. యోచనచేసి యిట్లనియె "సుగ్మలి! నీవనినట్లు పోయి నేఁ
జూచెదఁ బద్మలోచనుని, జుట్టము, డాలుపు నాతఁ డిత్తఱిన్
రాచరికంబునుంటఁ గనరాదు మఱేమి యుపాయసంబు లే
కే, చనఁగాన్క నేమిగొని యే సుదునో వచియింప వే?" యనన్.

చం. వినినగి వారిజాక్షి తలపింప నుపాయన మొందు ప్రాతకొం
గున ముడివైచి యున్న యటుకుల్ వెలిలాఁగి యమర్చిమూటగాఁ
బెనిమిటి కిచ్చి "వీని నరవిందదళాక్షున కిందు కాన్కగా"
ననినఁ గుచేలుఁడున్ జనియె నచ్యుత దర్శన భావతీవ్రతన్. ౧౪౯

చం. చనుచో నచ్యుత సంస్మరావశత, దుష్ప్రాపగారణ్యా మా
ర్గనిరోధాచలగోచరత్వమును మార్గాయాస సంక్లేశమున్
గనకొక్కింతయు ద్వారకాపురము నా త్మాదేవమున్ముఖ్యుండు చే
రెను నేమేమొ తలంచుచున్ మనసులో హృష్టాత్ముఁడై తుష్టుఁడై.

ఉ. జొచ్చి పురంబు భూసురుఁడు చూచి పురీరమణీయతన్ గనుల్
విచ్చి, తదీయ హర్మ్యములు వీథుల తీరున కబ్బ మందుచున్
జెచ్చెర రాట్ప్రాసాదమును జేరి కనుంగొని శౌరి యాలయం
బచ్చుపడన్ మదిం దెలిసి యచ్చట నాఁగెను విభ్రమాత్ముఁడై.

మం. కని సాధోపరిచారి శౌరి నిజమర్గప్రాప్తవిభ్రాంతయో
జన సందిగ్ధ మనోభిరాము ఘనతృష్ణాయాసమార్గాము గ
ద్గుణ [illegible] పరిశీలధా [illegible] క్షోభోద్ద [illegible] భో
జ [illegible] సుఖాము [illegible] త్రీస [illegible]

ఉ. వెంటనె చీరిపంపె నొకభృత్యుఁ గుచేలుని జాడఁగాంచి వె
న్నంటి సగౌరవస్థితి గృహాంతరమందునఁ జేరిపింప వా
ల్గంటి విదర్భరాట్సుత జలంబుల నర్ఘ్యముఁ దేరఁ బంపి మి
న్నంటిన మేడనుండి దిగె నచ్యుతుఁ డాత్మసఖుం గనుంగొనన్.

మ. డిగి యాతిథ్య గృహాంతరంబున నకుంఠీభూత చేతస్కుఁడై
యెగువ న్నిండుమ నల్లడ ల్గనుచు శ్రీకృష్ణాగమం బెంచు నా
జగతీదేవుని జూచి యెట్టయెదుటన్ సాక్షాత్కృతి న్గూర్చి యా
శుగ వేగంబున నాతనిన్ గవుఁగిటన్ జొన్పెన్ విచిత్రంబుగన్.

మ. పరిరంభం బొనరించి గౌరవమునన్ ధర్మాసనాసీనుఁగాఁ
గరమర్థిన్ ఘటియించి పాద్యమును నర్ఘ్యంబిచ్చి పూజించి యం
బరముల్ గోగణమిచ్చి మజ్జనగతుల్ వార్పించి మృష్టాన్న స
త్కరణన్ దృప్తునొనర్చె బాల్యసఖు నేస్తంబొప్ప శ్రీకృష్ణుఁడున్

చం. తనిపి చతుర్విధాన్నముల దమ్ములమున్ సుమదామధూమచం
దనము లొసంగి నూత్నపరిధానము లిచ్చి నివాళియెత్తి ద
క్షిణకయి కాంచనం బొసఁగి కేలుఁన గేలును గీలుకొల్పి లోఁ
గొని చని చేర్చె భర్మమయకుడ్యపరీతగృహాంతరంబునన్. ౧౫౬

చం. మృదుశయనంబుఁ గూరిచి శ్రమించిన కష్టము దీర వీవెనల్
వదలక వీవఁ జేడియలఁ బంచి సుఖాసనమొందు దెచ్చినం
గదిసి సుఖోపవిష్టుఁడయి కాంత విదర్భజ చెంత నిల్వఁగాఁ
బదములనంటి చారుకరపల్లవము ల్దగిలించి యొత్తుచున్. ౧౫౭

కం. ఉలికిపడఁగా సుధాముఁడు
కళవళపడ భీష్మతనయ, కలగుండువడన్
వెలదుఁలు దాసీదాసులు
పలికెను దామోదరుండు పరితోషమునన్. ౧౫౮

మ. "తినుబండారము లేమి తెచ్చితివి ప్రీతిన్ నాకు నర్పింప? డాఁ
చిన నాకిచ్చి క్షుధార్తి మాన్పఁగదె! నీస్నేహంబు సార్థక్యమౌఁ
దిన నిష్టంబు ధరామరోదనము సంతోషింపఁ బోకిమ్ము నా
కని తేకుండుదె! పండొ! పత్రమొ! మఱేదాహారమో! మూలమో!"

చం. ఇటు వచియించుచున్ దడవి యెల్లెడ బాపని మూట కన్పడన్
దటుకున విప్పుచున్ బృథుకతండులముల్ గనిపింప నందు నా
ర్భటి సకిలించి పోసికొని పాణితలంబున మెక్కసాఁగె నొ
క్కటి మఱి రెండు చేరెఁడులు గ్రక్కున మూఁడవతూఱి కొగ్గుచోన్.

చం. కనుఁగొని రుక్మిణీసఖియ కంజదళాక్షు కరాంబుజంబునం
జొనిపి స్వకీయపాణితల సుందరపంజరమందు నవ్వి యి
ట్లనియె "నజీర్ణమయ్యెడి ననంతరమీ వ్యథగల్గు నాకుఁ జా
లును నడుకుల్ గ్రసింపక విలోకన చేయుము తత్ఫలాప్తియున్."

చం. మెసవుట మాని శ్రీనిధి "శ్రమించితి నిద్దుర పొమ్మ"టన్న సో
మ్మసిలి సుషుప్తిఁ దేలిన క్షమామరుఁ డేకతఁ గన్నుసన్నమో
విసరుఁ డటంచు నానయిడి వీడ్కొని భీష్మకరాజపుత్రితో
మసలిచనెన్ గృహాంతర సమాగమనం బొనరింప నర్థిమైఁ గాంతయున్.

మ. కనులం గూరికి నిద్రలో మునిఁగి మార్గశ్రాంతుఁడై యుంట వేఁ
గిన మేల్గాంచిన భూసురున్ గదిసి శ్రీకృష్ణుండు దానెంత డాఁ
గెను సంధ్యావిధులూని తీర్చుటకు నుత్కృష్టాప్తి నాప్తుల్ సఖీ
జనరాడ్బాంధవమిత్రభృత్యులును నాశ్చర్యాంబుధిం దేలఁగన్.

కం. ఇట్టుఁ బచరించుచును సఖు
నెట్టో యొడఁబఱచి యచటనుండఁ జతురతన్
బట్టునను గొంతకాలము
నెట్టనఁ దన్మయు నొనర్చె నిజతత్త్వాప్తిన్. ౧౬౨

మ. వరతత్త్వార్థ వితర్కతర్కములఁ దత్త్వార్థప్రసంగాప్తి వే
దరహాసోక్తుల బాల్యవృత్తముల వేదాంతప్రబోధంబులన్
బరమార్థాంశనిరూఢగూఢగతులన్ శాస్త్రప్రచారమ్ములన్
బరమప్రీతు నొనర్చి యాత్మహితు సంబంధించె ద్వారావతిన్.

చం. కతిపయ మాసముల్ గడువఁగా నిజవాసముఁ జేరు నిచ్ఛ యా
తతమయి శౌరి వేడఁగ సుధాముఁడు చక్రి రథంబు గూర్చ నా
నతి యిడె సూతుఁ జీరి పయనంబయి భూసురవాసభూమికిన్
జతనమునన్ గమించి యట తెమ్మరు కొల్వ్వనుండ నిచ్చలున్.

చం. అరదము దెచ్చి పూనిచి జవాశ్వయుగంబును సూతుఁ డంత స
త్వరమున నెత్తి భూసురు రథస్థునొనర్చె మురారి, సాఁగె నా
యరదము నీవిచిత్రము మహాద్భుతమై కనుపించె ద్వారకా
పుర జనబంధుముఖ్యులకు; మోదమునన్ వెనుముట్టి శౌరియున్.

కం. వేఱొక యరదమ్మును గొని
పాఱుచు నాపాఱునకును బాసటయై తాఁ
జేరినఁ బురబాహ్యావని
తేరు నిలిపి వీడుకొనియెఁ ద్రిప్పి రథంబున్. ౧౬౮

చం. తనపురిఁ జేరఁ బోయెడు శతాంగగతుండగు భూసురుండు త
న్మనమున నాఁచఁజాలని యనంతములై చను భావభంగముల్
గణఁగి బహిర్గతంబులయి కన్పడినన్ వివశత్వమంది యి
ట్లనుకొనె మోదబాష్పములునంబుధులై పొఱలం గనుంగవన్.

ఉ. "పెన్నిధిఁబొంది కోల్పడిన పేదవిధంబునఁ గాంచి శ్రీనిధిన్
బున్నెము చొప్పునంగట! మనోగత భావమొకింత చాటి నా
విన్నప మాచరింప, నవివేకమునన్ మఱి యేవిధమ్మునన్
గన్నులఁ గాంతు శీలవతిఁ గాంత క్షుధార్తులఁ గన్నబిడ్డలన్.

సీ. పదునాల్గు భువనముల్ పరికించి పాలించు
ప్రభువు గన్గొనఁడె నా భావగతుల?
బ్రహ్మాండమున నిండి వర్తించు వ్యాపారి
చేరి వర్తింపఁడే! నాచిత్తవీథి
అఖిల భూతావనాఖ్యాతుఁ డాగమవర్తి
నిజభక్తకోటి గణింపకున్నె?
సర్వకర్మలసాక్షి సకలభూతాత్ముతో
విజ్ఞప్తిఁ జేయు వివేకమగునె?

గీ. సకల భూతముల్ సృష్టించి ప్రకట పఱచి
మనిచి, తనలోనఁ దుదియందు నునిచికొనెడు
సృష్టిపోషక హేతున కదృష్టమేది?
యెన్న దుర్భ్రమ కాక మతేమినాకు?" ౧౭౧

మ. అని సందేహము వాయఁ గొంతతడ "వాహా! యీరథం బేలనా"
కని వాపోవు, ముహూర్తమాత్ర "మిదిమిథ్యాసంశయం"బంచునా
ర్తిని బాయున్, నిమిషంబు "సారథికి నేరీతిన్ క్షుధందీర్తు"నం
చని రోయున్, మఱి సుంత కాలము వృథావ్యాలోలుఁడై యాత్మలో

కం. పరివేదనఁ బొగులుచు భూ
సురుఁ డాత్మగతంబు"నందు శోకము భక్తి
స్ఫురణలుఁ బెనఁగొన మనమున
దరిసెం బెనుగిరులు దాఁటి తనపుర సీమన్. ౧౭౩

కం. చొచ్చి నిజ జనపదంబున
చ్చెరువుగఁ దనకుటీరమగుపడకుంటన్
బిచ్చటిలి యెన్నొ సౌధము
లచ్చో సౌవర్ణగోపురాగ్రయుతములై. ౧౭౪

మం. కని సంభ్రాంతి వహించి రిచ్చపడి దీర్ఘాలోచనాయత్తుఁడై
కనకోద్యచ్ఛిఖరాగ్రమై తనరు నాకాశప్రచుంబిప్రసా
దనికాయావృత వప్రముల్ దరిసి తద్ద్వారస్థ భృత్యాళిఁ బ్ర
చ్ఛను గావించెను సంశయాత్ముఁడయి యాసందిగ్ధముం దీర్పఁగన్.

శా. ఆకంఠధ్వని నాలకించిన సుధామూర్ధాంగి వామాక్షి భూ
షాకర్మోజ్జ్వలితాంగియై కనకవస్త్రాలంకృతిన్ జుట్టి రా
రాకాచంద్రనిభాస్యలున్ గదిసి నీరాజార్ఘ్య పాద్యాది పూ
జాకల్పంబులఁ బూని చేకొని, నిజస్వామిన్ సమీపించుచో. ౧౨౭

ఉ. నివ్వెర పొంది సర్వమును నీరజనాభ కృపాకటాక్షమే
నివ్విటిలన్ ఘటిల్లె నని నెమ్మది నమ్మి సుధాముఁ డాత్మలో
నవ్వనమాలి నిస్తుల దయామహిమంబుల సంస్మరించి పెన్
దవ్వులఁ జేర్చు నైహికవిధానము జీవిక నెట్టె నిమ్మలన్. ౧౨౨

మత్తేభ కందగర్భసీసము—

విజితచాణూర వినేకమార్గగమనా!
శ్రీనాథ! దైత్యాంతకా నగధర!
సతతలోకోద్ధర! సర్వపాపహరణా!
తాపత్రయోన్మూలనా వరేశ!
మహితసంరంభ! సమంచితాద్భుతగుణ
హీనప్రభావా హరీనిరంత!
ఉచిత సంబంధ సముద్ధరప్రగతి రా
జీవాక్షి దీనావనా విశిష్ట!

గీ. కమలనయన! శేషశయన! విమలహృదయ!
వాసుదేవ! విశ్వంభరణా! సుచరిత!
యమితసకలలోకనిచయ! యమితసుగుణ!
హావభావ [illegible] [illegible]ద్ధరణా! [illegible]గిష్ట!

మం. జితచాణూర ! వివేకమార్గగమనా ! శ్రీనాథ ! దైత్యాంతకా !
తతలోకోద్ధర ! సర్వపాపహరణా ! తాపత్రయోన్మూలనా !
హితసంరంభ ! సమంచితాద్భుతగుణాహీనప్రభావాహారీ !
చితసంబంధసముద్ధరప్రగతిరాజీవాక్షు ! దీనావనా ! ౧౭౯

కం. కమలనయన ! శేషశయన !
విమలహృదయ ! వాసుదేవ ! విశ్వంభరణా !
యమితసకలలోకనిచయ !
అమితసరళహావభావ ! యాగోద్ధరణా ! ౧౮౦

## గద్యము

ఇది శ్రీమదిందిరానాథప్రసాదలబ్ధ సహజకవితా విరాజమాన శ్రీమద్గౌతమసగోత్ర
దివివంశోద్భవ నరసింహాచార్యపౌత్ర వేంకటాచార్య రంగమాంబికాతనూజ
రంగాచార్యప్రణీత శ్రీకృష్ణాతిమానుషతత్త్వ తృతీయఖండాంతర్గత
తృతీయాశ్వాసము — సంపూర్ణము.



శ్రీ ర స్తు

శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీ కృ ష్ణా తి మా ను ష త త్త్వ ము

## చ తు ర్థా శ్వా స ము

---

కం. ప్రద్యుమ్న జనక! సాక్షా
త్ప్రద్యుమ్నా! ద్యుమ్ననిలయ! ప్రద్యుమ్నాఖ్యా!
ప్రద్యోతనయన! ప్రథిత
ప్రద్యోత యశోవిశాల! ప్రస్ఫుట మహిమా!

వ. అవధరింపుము —

ఉ. తారకనాము డైత్యుఁడు ప్రతాపధురీణుఁడు సర్వలోక సం
హారకుఁడై విధాతృవర మందితుఁడై కడు గండుమీఱి మా
యారణచాతురిం దనరి యార్తి ఘటించెను ధర్మమార్గ సం
చారలకున్ మునీంద్రులకు సత్వమరుద్బుధకోటి కీర్ష్యమై. ౧

మ. ఒకచో లెక్కయు తారకాసురు మరుద్యోగంబునన్ జిక్కి తూ
లక రొమ్మిచ్చిన దేవతాధిపతి, నిర్లక్ష్యంబుగాఁ గార్య ద
క్షకుఁడై నిల్చి దిగీశుఁడధ్యయన యాగారంభుఁడౌ మౌని, మం
దుకుఁ గానంబడఁ డొక్కనాట మఱి మర్త్యుల్ మాట మాకేటికిన్.

ఉ. తారకదైత్యమాయ బెడిదంబయి దుర్భరమైన యోగి బ్రుం
దారకవారముల్ గదలి తామరసాక్షుని పాలికేఁగి ల
క్ష్మీరమణున్ సురారిఁ దన మేదురమాయను గూల్ప వేఁడ శ్రీ
మారునిబంపి భీమునకుమన్ సతిఁజేయ వచించె నీగతిన్. 3

గీ. "రుద్ర వీర్యము ధర ననిరుద్ధ మగుచుఁ
బతనమై యంద పోడమిన బాలకుండు
తారకాసురహంత కుమారసంజ్ఞ ;
నా కుమారుఁడ శివు నుమానాథుఁ జలుపు." ४

వ. అని వచించిన యీ యుదంతం బంతయు నెఱింగి —

ఉ. తారకుఁ డంతటం దెలిసి తప్పదటంచు నిజాంతమెవ్విధిన్
వీరకుమారుచేతనని నిశ్చితుఁడై హితు శంబరాసురున్
జీరి మహేంద్రజాలములు నేరిపిదుర్గమ దుర్గమబ్ధిలోఁ
దీరుప నాన తిచ్చినను నిర్ణయభంగి రచించె నాతఁడున్. ౫

వ. అంత మన్మథ ప్రేరణమున — ౬

కం. పార్వతి భర్తగఁ జేకొన
శర్వాని, షణ్ముఖుఁడు గలిగి సంవర్ధనుఁడై
దోర్వీర్యుఁడు శరజన్ముఁడు
గర్వితు భంజించెఁ దారకాసురుఁ గలనిన్. ౭

మ. రతిప్రాణేశ్వరు మన్మథున్ మగిడి సంరక్షింపఁగా భర్గునిన్
బ్రతిమాలన్ బరమేశ్వరుండు గరుణార్ద్రాత్ముండు దీవించి "నీ
పతి నీక్షింతువు శంబరాసురుని దుష్ప్రాప్యాలయంబందు నీ
చతురత్వంబును జూపి చేరి కొని యాశాజ్యోతి వర్తింపుమీ!" ౮

చం. అనినఁ బతివ్రతాతిలక మా రతి వంటలకత్తె భూమికన్
గొని చతురత్వ మేర్పడఁగ గుప్తగతిం దనుజాలయంబునన్
జని పరిశుద్ధవర్తనమునం బతిఁ జేర నిరీక్ష చేయు, రు
క్మిణి ప్రసవించె భావజు నుమేశు వరంబున శంబరాంతకున్. ౯

ఉ. శంబర దానవుండు దనచావు ననంగ కుమారుచేత ని
శ్చితం బని విశ్వసించి తనకన్నుల వత్తిఁ దగిల్చి రేవగల్
సంబర కర్జములఁ వదలి జాలకళావిధి సంభవిల్లు స
ర్వంబును సంగ్రహించుకొని తారొక్కనఁబూనికమై మెలంగుచో.

కం. ఉద్యోతాంగుం డతనుఁడ
సాధ్యుఁడు శంబరునికాలకు జనియించుటచేఁ
బ్రద్యుమ్న నామకరణముఁ
బ్రద్యోతముగా నొనర్చె వనజాక్షుండున్. ౧౧

ఉ. శంబర మాయ లెల్ల హృది సారసనాభుఁ డెఱింగి యుంట స
ర్వం బెఱిఁగించి రుక్మిణికి రాఁగల లోకహితంబుఁ గోరి త్యా
గం బొనరింప నర్హ మని గాదిలి పుత్రుని భావిఁ జెప్పి రా
గంబును మాన్పి నిర్భయముఁ గల్పన చేసె హృదంతరంబునన్.

శా. ప్రద్యుమ్నోదయమైన యాదినమె దుర్మార్గుండు దైత్యుండు దు
ర్విద్యాజాలి ప్రసూతికాగృహము నిర్భీతిన్ బ్రవేశించి దు
ర్విధ్యుక్తుండయి బాలకుం గొనుచు ద్యోవీధిన్ బ్రవేశించి యా
ప్రద్యుమ్నున్ బడఁద్రోసె గూల్చుటకుఁ బారావారమధ్యంబునన్.

చం. అటుఁ గబళించె బాలకు మహోతత మత్స్య మొకండు వెంటనే
తటమున మున్నె జాలరులు దాఁగి రచించిన చిక్కమందు సం
కటపడి చిక్కె నా ఝషము కాలవశంబున బెస్త లూని య
క్కటికను మాని చేర్చిరెటొ గట్టునకున్ శ్రమకోర్చి యేర్చుచున్.

ఉ. దానిని నామిషంబుగ యథావిధి బంచుకొనం దలంచుచో
గానక తెన్ను జాలరులు గానుకగ దానిని రాజు కిచ్చినన్
దాన లభించు రొక్క మని నమ్మి ప్రయత్నము తోడ జేర్చి రా
మీనము రాజమందిరము మేలని భూధవుఁడిచ్చె నిష్కముల్. ౧౨

మ. అదియే శంభర దుర్గ మాతఁడును మత్స్యంబున్ సమీక్షించి య
య్యది పాకాలయమందు నుంచుటకు వ్యాఖ్యానింపనందున్న యా
మదనాసక్త రతీసతీతిలక మా మత్స్యంబు వీక్షించి త
ద్ధృదయక్షిప్త శిశున్ వెలిం బఱచె సంప్రీతిన్ రహస్యస్థితిన్.

వ. తదనంతరంబా రతీదేవియును — ౧౭

ఉ. ప్రాణము కంటెఁ బ్రాణముగ భద్రముగాఁ బరిశుభ్రభద్రము
ద్రానయరక్షణాప్తి నవిరామ నిరామయయుక్తి నంబికా
స్థాణు వరప్రసాదగతి సత్య మటంచని యెంచి రుక్మిణీ
సూనుఁ బ్రసూనబాణు నిజ సూనుగతిన్ బెనిచెన్ గృపామతిన్.

మ. అట ద్వారావతి సర్వవేది హరి భృత్యామాత్యమిత్రాప్తులన్
భటసంఘంబులఁ జీరి కార్యఫణితిన్ వర్ణించి సర్వావగా
తట భూభూదర కందరాబ్ధి కకుబంతవ్యోమ మధ్యస్థలిన్
బటు యత్నంబున శోధ చేయుటకు నాజ్ఞాపించెఁ దీవ్రస్థితిన్. ౧౯

ఉ. చారులు గూఢచారులయి చారణ సిద్ధ మునీంద్ర దేవ సం
చార విశిష్ట భూమిధర చారు దరీవనసార సార సా
సార సరన్నదీవనధి జాలములన్ సకలక్షమాభ్రభరా
సార దిగంతముల్ వెదకి చాయలు లేమి విచార భారులై. ౨౦

ఉ. ద్వారకఁ గ్రమ్మఱన్ జని యథార్థము శౌరికి విన్నవింప నా
చారుల నంపి రుక్మిణి విచారము మానిపె క్షేత్రతీర్థ సం
చారములన్ బరంపద విచారములన్ గ్రహచారయుక్తి నా
చారపురాణసూక్తి నవచారు కథాపరిచార రక్తులన్. ౨౧

మ. రతి ప్రద్యుమ్న కుమారు శంకర వరప్రాప్తిన్ నిసర్గస్ఫుర
త్పతి భక్తిన్ గరుణామలామిత గతిన్ బాలించి లాలించి య
ద్భుత గోప్యంబున వర్ధిలన్ బెనిచి సంబోధించె షట్శాస్త్ర ప
ద్ధతులన్ ధర్మగతుల్ హితాచరణ విద్యావిద్య భేదంబులన్. ౨౨

గీ. పార్వతీ దత్త వరమహత్వంబు వలన
శంబరాసురు నింద్రజాలంబు లెల్ల
ననతికాలంబున నెరతికబ్బె నంత
దైవకృప యున్న నొక్క దుస్తరము గలదె. ౨౩

మ. అదియే గారడియో వచింపఁగ నశక్యంబౌను బ్రద్యుమ్నుఁడున్
హృదయాకర్షకరూపుఁడై యెదిగి వర్ధిల్లన్ రతిదేవి ప్రౌ
ఢదశన్ వీఁగి మనోజ్ఞ యౌవన విరూఢత్వంబునన్ గ్రాలి త
న్మదనాకార వయోనుకూలగతి సంధానించెఁ గామాకృతుల్. ౨౪

వ. అంత రతీదేవి —

ఉ. అంబ వరప్రభావమున నబ్బిన శంబరు నింద్రజాలకా
డంబర విద్యఁ గాలము విడంబన చేయక బోధ చేసె వై
శంబ ప్రయోగ సంహార కళానిపుణత్వము లందు నస్త్రయో
గంబుల రుక్మిణీసుతుఁడు గన్యతఁ గాంచె సమర్థుఁడై త్రుటిన్.

ఉ. అంబరయాన యుద్ధగతు లంబక చిత్రవిచిత్ర ధారణా
లంబములంబకప్రకట లక్ష్య విలక్షణ లక్షణంబు నీ
లాంబర చంచలద్వనికాంతర కృత్రిమ నాటకక్రియల్
త్ర్యంబక వత్సలత్వమున నబ్బె ననంగునకుం గరస్థమై. ౨౬

వ. అంత — ౨౭

ఉ. కాల నిబద్ధుఁడై ప్రళయకాలము దాఁపరిలన్ సురారి యా
బాలికరూపుఁ గన్నరతి వన్నెలు చిన్నెలుఁ గన్నె తెన్నులున్
వ్రాలి మనోధృతిన్ దగిలి వ్రయ్యలు వ్రక్క లొనర్పఁదూలి యా
బాల వయోవిలాసముల బానిసమై నడయాడె రేవగల్. ౨౯

చం. చుఱచుఱచూచు దాని నెఱచూడ్కుల దిమ్మెరపోయి, దవ్వులన్
బిరబిర సంచరించు, నలివేణి హొయల్ గని సంచలించి సుం
దర దరహాసచంద్రికల తళ్కుల బెళ్కుల కుల్కి యుల్కి శం
బర వరదైత్యనాయకుఁడు బంధితుడయ్యె రతీలతాంగికిన్. 30

శా. దైవోద్దేశము పార్వతీవరము రుద్రాభీష్టమున్ శౌరి స
ద్భావంబున్ బ్రకటించి సత్యగతులన్ బ్రద్యుమ్ను నొప్పించి మా
మావిన్ శంబరు రూపరేఖిలనా మోహాంభోధితో ముంచి దు
ర్భావోద్రేకు నొనర్చె నంత రతి గీర్వాణుల్ వినోదింపఁగన్. 

వ. అనంతరంబ — 32

చం. కొలువు నొనర్చు నప్పుడు నొకొండొక చో విహరించు వేళ నా
ప్తులు హితబాంధవుల్ గలిసి ముచ్చట లాడెడిచోఁ బరిస్థితుల్
నిలుకడలేక యున్ననుగణింపఁడుగా రతి మాటకాని యే
తలఁపు సహింపఁబోఁడకట! దానవనాథుఁడు గాలబద్ధుఁడై. 33

చం. రతి గమనించి శంబరసురారి మనోగతి సానుకూల్యమా
స్థితిఁ గృతకృత్యురాలగుట సిద్ధమటంచును నిశ్చయించి పెన్
ధృతిఁ బ్రియ వేషభాషణల హృత్పరివర్తక దృగ్విలాస సం
గతుల నవీనపేశలవికల్పనలన్ మఱపించె సర్వమున్. 34

సీ. మందేభయాన రాణ్మందిరంబునఁ జొచ్చి
సుందరేక్షణమాల పొందు గూర్చు
మదిరాక్షి మదనాగ్ని వెదఁజల్లి మృదుగీతి
మదిరపాత్ర నొసంగి సొదలఁ బేర్చు
పల్లవాధర పరిఫుల్ల దృగ్గుచు లల్లి
సల్లాప కల్లోలిఁ ద్రుళ్ళ నేర్చు
కలకంఠి లలిత కోకిలకంఠ మెత్తి ని
స్తుల గానలతికలఁ గలియఁ దీర్చు

గీ. బుద్ధ ముగ్ధాబ్జ నయన! సంబద్ధుఁ జేయు
ముగ్ధ వైదగ్ధ్య గతుల సంగ్ధ ఫణితి
వలపుపురిఁగొల్పి కులికించి బెళుకుదనము
ముదిత విదళించె శంబరు హృదయగతుల. 35

మ. వశుఁడై నవ్విరిబోఁణి పోఁడిమికి నబ్జాతాక్షి దృగ్వీథిలో
మసలన్ బానిసయై చలత్తనుతటీ మాలాప్తి విభ్రాంత మా
నసుఁడై పెన్నెఱివేణి కాఱ్కొగులు పన్నాగంబులం గాఢతా
మస మోహాంధ నిమగ్నుఁడై మునిఁగిపడెన్ బ్రేమాన్నై శిలారూపమై.

మ. మదన జ్వాలలు పేర్చి యేర్పడఁగఁ బరిమ్లానతఁడయి భూత హృ
త్సదనుండై పరితాపితుండయి పరిష్వంగంబ గాంక్షింప నా
సుదతీరత్నము రుక్మిపన్ బ్రతితపస్సూక్తంబులన్ మంజులో
క్త్యధితానల్పకథాప్రసంగముల నాదై త్వేశుఁ గన్ బ్రేమచోఁ.

ఉ. ఓర్వక కాలయాపనము నోపికఁ దూలి పడంతి డాసి యూ
పూర్వసురేశ్వరుండుఁ "గడువుగ క్షణమేని యొసంగఁ జాల నా
శర్వుడు వానితాతయును సైఁపుదురే ననుఁ గిన్కఁ బూన, నిం
కోర్వ సుమా! తమిం గడుపమున్న నిసింబలు కాడి నట్టులగ. ౩౮

చం. అను దనుజేంద్రుతోఁడ దనహాసము మోమున సందడింప వా
ల్గనుల పసల్ దెసల్ మసలఁ గాంచన దేహలతాస్ఫురద్రుచుల్
గనుమిఱుమిట్లు గొల్ప మృదులస్వన మేర్పడ నిట్లు పల్కె "నో!
దనుజవరేణ్య! నీచరణదాస్యము గల్గుటఁ ధన్యనైతిఁగా!" ౩౯

ఉ. రేప వ్రతాంత మాట వివరింపగ నేఁ జనుదెంచు నంత నా
డాఁపున కీర వచ్చితిర? డాఁపరికం బది యేల యేలికా!
మాపటివేళఁ బుష్పవనమందిరమందున వేచియుందు నే
సైపుదునే క్షణంబ సుమసాయక కేళిఁ బరాక్రమింపకే." ౪౦

ఉ. నాఁడు శనిత్రయోదశి పినాకిని కిష్టదినంబయౌట నా
నాఁడు రతిమనోజులు మనంబునఁ గూర్చి యుమేశు నన్నముగ
వీడి వినిశ్చలత్వమునఁ బ్రీతిని బూజ నొనర్చు నంతలో
గాఢ తమోంధుడా దనుజకాంతుఁడు చిత్తజబాణవిద్ధుడై. ౪౧

వ. నిజోద్యానమున కేఁగి — ౮౨

సీ. కని శంబరుండు తద్గర్భభాగమున మృ
త్కల్పిత శైవలింగంబు దాని
సరస సాష్టాంగులై సాశ్రు నేత్రాబ్జులై
ప్రావర్తిత శివసహస్రనామ
జపనిష్ఠకల్పులై చాఁగిలిపడియున్న
మిథునంబునందుఁ దన్మీన నేత్ర
పాకాలయస్థితవనితగ నెఱిఁగి యా
దివ్యరూపుని వాసుదేవసుతునిఁ

గీ. బోల్పఁ జాలక చేతి యనల్పదండ
మెత్తి మోఁదిన నతఁడు హుంకృతి "జయ! జయ!
శంకరా!" యనినిలచి యాచక్కి నున్న
గుదియఁ జేబట్టి దానవుఁ గదిసె నంత. ౮౩

చం. కదిసిరి యిర్వురున్ నిలిచి కయ్య మొనర్పగదా ప్రహారముల్
రోదలొనరింప గింగురని క్రుంగుచు మొగ్గుచు లొంగి రేఁగుచున్
వదరుచు రోఁజి రొప్పుచుఁ జివాలున వ్రాలుచు లేచి వేచుచున్
బ్రిదులుచుఁ గూడి వీడ్కొని జరించిరి వారు గదారణంబునన్.

కం. విరవిర గుదియలు నుగ్గై
విరిగి పడన్ మొంటలగుచు వీరు లిరువురున్
స్థిరులై చేరువ యొఱలన్
గరవాలము లందికొనుచుఁ గదిసిరి మరలన్. ౮౪

చం. పెళపెళ కత్తితాకుడుల బింకము పొంకము నాల్గు వంకలన్
దళదళ నింపఁ జెంగున బెనంగియెసంగి కలంగి కంగునన్
జలజల రాలు ఘర్మజలసారము వీరుల బీర సారెముల్
దెలుప ననన్యమాన్య గతి ధీరతఁ బోరిరి ఖడ్గధారులై. ౮౫

కం. కరవాలంబులు నుఱుమై
దురమున దొరలుటయునరసి దోర్దర్పములన్
దఱుగక పిడికిలి పోటుల
నిరువురుఁ గయ్యం బొనర్చి రేర్చి కడువడిన్. ౪౭

కం. గబగబ రభసంబున నా
సబలు లిభం బిభముఘోర శరభము శరభం
బభయమున మారుకొనునటు
లుభయులు ఢీకొనిరి ముష్టియుద్ధ నిపుణులై. ౪౮

కం. తడయక జడియక విడివడి
పిడికిలి కయ్యమున నొచ్చి వీర లిరువురున్
గడఁగిరి మాయారణమున
కెడమీక రవంత దడవు నెడనెడఁ గడఁకన్. ౪౯

చం. దనుజుఁ డదృశ్యుఁడై చదల దాఁకి మెలంగ రతీశుఁ డభ్రమున్
జెనకి తదుత్తమాంగమునఁ జిందులు ద్రొక్కు భుజంగరూపమై
పెనగొన శంబరాసురుఁడు భీషణ గారుడ రూప మూని తు
త్తునియ లొనర్పఁ బూనికొనఁ దోమరమై కనిపించి దైత్యుఁడున్.

చం. తనుమఁ గడంగఁ గృష్ణసుతుఁ దోఁచి యుదగ్రదవాగ్నిరీతి సం
హనన మొనర్ప బూన హరినందనునా యసురేశ్వరుండు, నా
ర్పెను పెనునగ్నికీల లతివృష్టిపరంపర వాసుదేన నం
దనుండుఁ జెలంగి యాఁపెజలధార వివస్వతమంత్రసమ్మతిన్. ౫౧

ఉ. మింటికి మంటికిన్ బెరిగి మ్రింగిన మన్మథు శంబరుండు ము
క్కంటి వరప్రభావమునఁ గంటికొనం గృమియై గమించి వె
న్నంటె యసంగుఁ డంతట ఘనాహివికారమునన్ బెనంగి బల్
గంటకమై యెసంగ నకులంబయి యేచె నిశాచరేశుఁడున్. ౫౨

కం. ఇటు లటవీ మృగముల బలె
మటుమాయంబయి యదృశ్య మాయాగతులన్
జటులాహవ మొనరించిరి
జటిలంబుగ శంబరుండు, చక్రిసుతుండున్. ౫౩

ఉ. ఎంతకు దైత్యనాథుని వధింపగ శక్యము గాక యున్న నా
యింతియుఁ గ్రొత్త తెన్నొకటి నెంచి మనోజున కీసమస్త వృ
త్తాంతము గనుసన్న విశదం బొనరించి పసిండి బొమ్మయై
చెంతకుఁ జేరి నిల్చి వరశీధు వొసంగి సురారి నేతకున్. ౫౪

మ. కరపద్మద్వయి సాఁచి కాళ్ళకు నమస్కారంబు గావించి వా
తెఱఁ బల్ముత్తెపుఁ జాలు సోయగము నల్దిక్కుల్ ప్రకాశింప, సుం
దర చంద్రానన చంద్రికల్ మొలువ కందర్పాంశులా స్వచ్ఛ భా
సుర గండమ్ముల నాతి యిట్టులని యెన్ జూడ్కుల్ ప్రకాశింపఁగన్.

శా. "మాయాయుద్ధ విశారదా! తలఁప సామాన్యంబె నీలావు! నీ
ధ్యేయామేయబలాఢ్యతన్ దెలిసి స్వాధీనాత్మనై రా, మహా
న్యాయం బేర్పడె నీమహాత్ము డెవరో యాంతకమై నిల్వ నా
పాయం బే? కలనన్ నినున్ జనక నాబ్రహ్మేంద్రరుద్రాళికిన్." ౫౬

కం. అను దీనాలాపంబున్
విని శంబరుఁ డెడద నమ్మి నిజమని యనియెన్
"వనితా! భీతిలఁ బోకుమి
యణఁగించెద వాని త్రుళ్ళు నని మొన నిపుడే". ౫౭

మ. వినువీధి న్నగ్రబాఁకె నండ వికృతిన్ వెన్నంటి ప్రద్యుమ్నుఁ డా
య్యన శూలాకృతినండమున్ దగిలె ప్రయ్యేల్ చేయ, వర్షించె నా
దనుజుం డగ్నిశిఖల్, రతీసతి యుమాదత్త ప్రభావంబునన్
దనుజాగ్నిన్ మటుమాయమున్ సలిపె నంతర్భాగమం దే త్రుటిన్

గీ. శాంకరీ దత్తమహిమాతిశయము వలన
శాంబరీ తేజ మడిగి యాశంబరుండు
సమసె నిజగతియే గతి సవ్యాగతిని
క్షితిని జేరక మధ్య నశించి యుంట. ౫౯

ఉ. శంబరుఁ డీల్గుటన్ దెలిసి సారసనాభ కుమారుఁ డంబికా
త్ర్యంబకుల న్నుతించి వికచాంబుజనేత్ర రతీసమేతుఁడై
యంబరయాన పద్ధతి మహాంబునిధిన్ బయనించుచుం బరీ
తాంబుధి ద్వారకాపురి రయంబున డిగ్గెఁ బ్రియం బెలర్పఁగన్.

మ. దిగి తోడ్తో పితృదివ్యమందిరము సందీపింపఁగాఁ జొచ్చినన్
మృగనేత్రోత్తరుఁడై భటాళియును సందేహింపఁబోరైరె గా
దిగ వీక్షించి మురారి యీతఁడని యాదృశ్యంబు వేద్యంబుగాన్
దిగివచ్చెన్ హరియాత్మజున్ గదియఁ బ్రీతిన్ గూర్చ వైదర్భితోన్.

చం. నిజసుతు నాత్మబంధులకు నెమ్మి నెఱుంగ వచించి శ్రీరతీ
నిజకథఁ గూర్చి చెప్పి తరుణీమణి శీలముఁ బారిశుద్ధ్యమున్
బ్రజలకుఁ జాటి యుత్సవము ద్వారవతిన్ జరిపించెఁ దన్మహా
విజయముఁ జాటి నాట యదువీరుఁడు పుత్రచిరాయురాప్తికై.

చం. గదుఁ డుదయించె జాంబవతి గర్భమునందున, సాంబనామకుం
డుదయము నొందె సత్యకుఁ బయోరుహనాభ పదారువేల స
మ్మదగజయాన లెల్లరుఁ గుమారులఁ గాంచిరి భాగ్యభోగ్య సం
పద లభివృద్ధి నొందెను గ్రమంబుగ దామరతంపరల్ బలెన్. ౬౩

కం. హాలివలనన్ రేవతికిన్
గలిగెను శశిరేఖ యనెడు కన్నియ ముఖజి
ద్విలసిత జలరుహయై, ని
స్తుల శోభారేఖయై, మధుర భాషిణియై. ౬౪

ఉ. అంతకుఁ బూర్వమే పొడమె నర్జున పుత్రకుఁడై సుభద్రకున్
గంతు, వసంతు రూపకలనన్ దలక్రిందొనరింపఁ జాలు ధీ
మంతుఁడు కీర్తివంతుఁ డభిమన్యుకుమారుఁ డుదారమూర్తి శ్రీ
కాంతుని చెంత నుండె చెలికాఁడయి యా శశిరేఖ కీడుగాన్.

కం. ఈడై జోడై నెఱి చెలి
కాఁడై యాటాడు వాని కలయిక గని యీ
రేడు జగంబుల నీడగు
వీఁడే శశిరేఖకనిరి వృద్ధులుహితులున్. ౬౨

ఉ. పాండవు లోడి రాజ్యమును బాసి వనంబులనుంట వైభవా
ఖండల సన్నిభుం డఖిల ఖండధరాధిపుఁడై సుయోధనుం
డుండుటఁ గాంచి బోటికి సుయోధను సూనుఁడు లక్ష్మణుండు యో
గ్యుండని యెంచి హాలిసుముహూర్తముఁగూర్చె స్వతంత్రయుక్తుఁడై.

చం. తనయుని కీక కోడలి నధర్మముగా నరిసూనుఁ గూర్చ మం
తనము సుభద్రఁ గాంచి తలిదండ్రులు నాప్తులు నెంత చెప్పినన్
విన కటవిన్ గమించి యటవీస్థలి ద్వైతవనంబుఁ జొచ్చి చే
రెను సుతుతోఁ గిరీటి, వివరించె నుదంతము వేద్యమాగతిన్.

చం. వినుచు వృకోదరుండు పిలిపించె ఘటోత్కచు నాత్మజాతు యో
జన మొనరింప, నెట్టు లపచార ప్రతిక్రియ నిర్వహింపఁగాఁ
జనునొ యటంచు, నంత జలజాక్షుఁడు ద్వైతవనంబుఁ జేరి చె
ప్పెను సరుఁజేరి తాను గనుపింపక యేరికి మాయమై చనెన్.

ఉ. అంత ఘటోత్కచుండును భటావళితో నరుదెంచ సర్వ వృ
త్తాంతము భీమసేనుఁడు నిజాత్మజుతో వివరింపఁ, గ్రీడి కం
సాంతకు రాకయుం దెలిపి యాతఁడు తోడ్కొని పోవునట్లు సి
ద్ధాంత మొనర్చె ద్వారకకు నాత్మజు గుహ్యగతిన్ సుభద్రతోన్.

వ. అంత – ౨౧

ఉ. తానే మావటియై ఘటోత్కచుఁడు భద్రానేకపం బెక్కి నె
త్తైనంభారిఁ దగిల్చి తమ్ము నభిమన్యాఖ్యాతుఁ జిన్నమ్మ న
త్యానందంబునఁ జేర్చి ద్వారవతి సత్యాదేవి హర్మ్యస్థలిన్
గానల్ భూధరవంక్తులన్ గడచి మార్గశ్రాంతిఁ బోఁద్రోలుచున్

ఉ. ఎవ్వరుఁ జూడకుండ గనిపించి మురారియు సత్యభామ యిల్
చివ్వన జొచ్చి యంతట వచించి రహస్యములన్ ఘటోత్కచున్
గవ్వడి సూను దోడ్కొని యెకాయెకి లోనికి గొంచు నేఁగి యే
సవ్వడి లేక యుంచికొని చక్రి తిరోహితుఁడై చనెన్ వెసన్.

వ. ఇంతలో – ౨౪

మ. శశిరేఖన్ గురురాజపుత్రకునితో సంబంధమున్ గూర్ప రా
ట్చ్ఛశిపాళిన్ బిలిపించి, హస్తిపురికిన్ సందేశ మంపించి యా
కసమంటందగు పందిళుల్ ప్రభలు సింగారించి సర్వంబు సం
తసమౌ భంగి నొనర్చె హాలి హరి సంధానించి తోడ్పాటుగాన్.

శా. దోర్వీర్యుల్ నిజ సోదరుల్ బలసిరా దుర్యోధనుం డుద్ధతిన్
గర్వాంధుం డయి రాజరాజునని యానందాత్ముఁడై లక్ష్మణుం
డార్వన్ భానుమతీయుతుండయి శతాంగానేకముల్ ముట్టి రా
నుర్వీనాథులు సైనికుల్ గదల నుద్యోగించి చేరెన్ బురిన్. ౨౬

కం. రారాజు సుయోధనునకుఁ
బేరెన్నిక గన్న గీము విడిది నొసఁగి యే
తేరి కుశస్థలిఁ జేరిన
వారికి వసతుల నొసంగె వార్ష్ణేయుండున్. ౨౭

కం. పారావార నదీనద
వారములను దాఁటి వచ్చి ద్వారకలోనన్
జేరుట స్నాతక మచటఁ గు
మారునకు సుయోధనుఁడు ప్రమదగతి జరిపెన్. ౨౮

కం. శశిరేఖను గై సేసిరి
విశదమ్ముగఁ బెండ్లికూఁతు విధమున భూషా
భృశగతి నొక్కొక దివసము
వశమున నుంచి కొని శౌరి పత్నులు వరుసన్. ౭౯

వ. కతిపయదినములకు శశిరేఖఁ గైసేయుటకుఁ దనవంతునకురా — ౮౦

శా. సత్రాజిత్తి హలాయుధాత్మజ మనస్థాయిం బరీక్షించి త
త్పాత్రం దాల్చిన కామరూపుని హిడింబాపుత్రకున్ రేవతీ
పుత్రీరూపముఁ గూర్చి పంపి వెలి కంభోజాక్షు నాజ్ఞాగతిన్
జిత్రించెన్ బహుగుప్తసంగతులు సన్వేషించి గూఢస్థితిన్. ౮౧

కం. మాయా శశిరేఖను నా
మాయాజాలకు ముకుందు మహిళలు భూషా
శ్రీయుత నొనర్చి పెండిలి
సోయగమును దీర్చి రెలమి సుభగత మీరన్. ౮౨

కం. రారాజు లక్ష్మణునితో
నూరేఁగి శతాంగతురగయుక్తి నలు దెసల్
బోరన మంగలరవములు
చేరెను కళ్యాణవేది స్త్రీనుతి హితుఁడై. ౮౩

మ. పరివేష్టించిరి పెండ్లిపందిరి శుభధ్యానంబు లొప్పార నం
బరవీధిన్ గురురాజభోజయదురాట్ప్రాముఖ్యశుద్ధాంత సుం
దరు లిర్వంకల భాసితాభరణనూత్నానవస్త్రద్యుతుల్
బరివేష్టింప దిగంతముల్ మసలి బుగ్వాదంబ మోఘంబుగాన్.

కం. ఆత్మజు లక్ష్మణు చెంగట
నాత్మీయసతీనియుక్తుఁడై కురునాథుం
డాత్మఁ గల గూఢరాగము
సాత్మ్యముగాఁ గూరుచుండె సరభసపరుఁడై. ౮౫

కం. హాలి రేవతీయుతుండై
బలసి కొలువ యదుకులంబు వార్ష్ణేయుండున్
నిలిచి సహకార మొసఁగఁగఁ
దిలకించుచు నదను సభ నధిష్ఠితుఁ డయ్యెన్. ౮౬

కం. అల్లున కర్ఘ్యం బొసఁగెను
గాళ్ళు గడిగి రతనములను గనకాంబరముల్
గొల్లగఁ గట్న మొసఁగి తెఱ
సెల్లాలును దీరిపించి సీరి ముదితుఁడై. ౮౭

శా. మంత్రధ్యానము లంబరాధ్వమున నై మంత్ర్యంబులై క్రాల బు
గ్గంత్రజ్ఞుల్ సురలాగమింప బహుళధ్వానార్భటానేక స
ద్యంత్రారావము లుల్లసిల్లి పిలువన్ ద్వారావతీ పౌరులన్
మంత్రాంగం బొనరించి తేఁ బనిచెఁ గన్యారత్నమున్ హాలియున్.

ఉ. బోరని వాద్యసంచయము భూగగనంబులు జుట్టిముట్టి రాఁ
దీరని వేదమంత్ర సముదీర్ణ రవంబులు మేళవింపఁ గాఁ
బౌర నినాదముల్ చెలఁగి పర్వ దెసల్, వధు రూపు నున్న యా
మాపతిపుత్రు నెత్తికొని మండప మందునఁ జేర్చి రెట్టులో. ౮౯

చం. కితవ వధూస్వరూపుఁడగు కీచకమర్దను సూను వేదిపై
జతన మొనర్చి చేర్చిన నిశాచర మాయజనాంతికంబుగన్
జతురత నైకృతాకృతిఁ గనంబడి లక్ష్మణు భీతిఁ గూర్చె లా
లిత నవసాలభంజికవలెన్ గనుపట్టె సదస్యపాళికిన్. ౯౦

సీ. కలికి కటారి కన్వొలఁదమ్మి సలరించి
కలఁచు దృగ్విస్ఫులింగములఁ బఱచి
చల్లని మోము జాబిల్లి వెన్నెల లీని
వెఱపించు భ్రూతటీ వికృతకృతుల

వసలీను సొగసుఁ గుప్పలఁ బాదుకొల్పి క్ర
　　　　క్కదలించు భీషణాకారగతులఁ
బలుము త్తియముల సొంపులు గురిపించి భీ
　　　　ప్రదదంష్ట్రికావళి భయముఁ గొలుపు

గీ. గురుల చక్కందనమ్మున మురియఁజేసి
వేణి సర్పముఁ జూపి కంపింపఁ జేయుఁ
గామరూపిణియై నెగడు నా భీమసుతుఁడు
సభ్యుల సుయోధనాత్మజు సక్రమమున. ౯౧

వ. అంత — ౯౨

సీ. తెఱ సడలించినఁ దెలవోయి వెఱఁడింది
　　　　నలుదిక్కులకుఁ జూచి యులికి పడును
గన్యకా వదన పంకజముఁ గన్గొను మన్నఁ
　　　　గటకటంబడి మోడ్చుఁ గన్నుగవను
వధువు శిరంబునఁ బాణిఁ జేర్పించిన
　　　　బొబ్బరిలి తలంకి పోరు వెట్టుఁ
గన్నియ కాల్దొక్క సన్న చేయ గురుండు
　　　　"భయముభయం"బని బయలు పఱచు

గీ. బాణితలముఁ బట్టఁగ బలవంత వెట్టఁ
జేరగిలి నేలపైని మూర్ఛిల్లు నంత
రాజరాజకుమార వీరాధివరుఁడు
లక్ష్మణాఖ్యుండు నాఁడు కల్యాణవేది. ౯౩

కం. ఈ దుర్నిమిత్తములకై
వేదురు వడి రాజరాజు విదురాదులచే
నేదో పలికించి యాపుట
భేదనమును వీడి చనియెఁ బెండ్లి జరుపకే. ౯౪

కం. బలరాముఁడు క్రుద్ధుండై
పొలియుంగాఁ గౌరవులను బూనిన హరి యా
బలి నోదారిచి మెల్లనఁ
బలికెను మృదుమధురఫణితి వాక్చతురతమై. ౯౪

శా. "అన్నా! కన్న నొసంగఁగా నగునె రాజ్యంబున్న శౌర్యప్రభా
స్కన్నుండౌ సబలాసమానునకు? నీసర్వంసహాధీశ్వరుం
డెన్నన్ విక్రమశాలి యొక్కరుఁడె యీ యేర్పాటదృష్టంబ లే
కున్నన్ దుర్భగుఁ డల్లుఁడై తగుల మీకుల్లాసముం గూర్చునే?"

కం. అనిన నగి హాలి యిట్లనె
వనమాలిని గని "ముకుంద వడఁతి సుభద్రా
తనయున కీనెంచితి నా
తనయును నీగతి ఘటింపఁ దరమే నేఁడేన్". ౯౬

చం. అనిన మురారి యిట్లనియె "హాలి! మఱిప్పటి కేని యీగతిన్
బొనరుతు వేని చేరి వనయుంగని ధర్మజుఁ జెప్పి సర్వమున్
బొనరఁగఁ జేతు నిశ్చయము మూఁడుదినంబులలో" నటంచు బం
పిన బలరాముఁడుం గినుక వీడి చనె న్నిజధామ మంతటన్. ౯౭

ఉ. మూఁడవ నాఁడు హాలి గృహమున్ హరి సొచ్చి వచించె నిట్లు నే
నాఁడ యుధిష్ఠిరుం గని వనంబున సమ్మతిఁబొంది వచ్చియు
న్నాఁడను వారు రారు ప్రతినన్ బరిపాలనచేయు కృత్యమే
పాడిగ నెంచుటం దనయుఁ బంపిరి వాయుసుతాత్మజాతుతో.

కం. అని సత్యామందిరమునఁ
గనుపింపక డాఁగి యున్న కవ్వడి సుతునిన్
ఘనతను ఘటోత్కచునిఁ జూ
పిన బలి నిశ్చయ మొనర్చెఁ బెండిలి దినమున్. ౯౯

శా. కావించెన్ శశిరేఖ ముత్సుకతతోఁ గల్యాణకార్యంబు నా
నావాద్యంబులు మ్రోయ నర్జునసుతున్ గన్యాయుతుం జేసి సం
భావోక్తిన్ గురువృద్ధు లంగనలు సంబంధమ్ము శ్లాఘింప సం
భావంబున్ ఘటించి బాంధవహితాప్తశ్రేణి మోదింపఁగన్.

వ. అంతటఁ గొంత కాలము చనునంత — ౧౦౦

కం. శ్రీరుక్మిణీ సహోదరుఁ
డౌ రుక్మికిఁ గలిగి యెదిగె నబలామణి, క
న్యారత్నము రుక్మవతీ
నీరజపత్రేక్షణ సుమతి నెయ్యపు సుతయై. ౧౦౨

ఉ. ఆకె యతీతమౌ సొగసు, నందము నల్గడ లందుఁ బర్వ న
స్తోక మనీషులౌ భుజజశూరకుమారులు మారరూపులౌ
శ్రీకరసుందరాంగి వనజేక్షణ పొందిక నాసఁజేసి ము
క్కాంక్షల కోర్చి వేచునెడఁ గన్నిక పొందెను యౌవనప్రభల్.

కం. తన చెల్లెలు రుక్మిణికిం
దనయుఁడు ప్రద్యుమ్నుఁడుంటఁ దలఁచియు హరిపైఁ
గినుక వహించుటఁ దలపఁడు
తనయకుఁ బ్రద్యుమ్నుఁ గూర్పఁ దన చిత్తమునన్. ౧౦౪

శా. ప్రద్యుమ్నద్యుతి, రూపరేఖలును శ్రోత్రద్వారపేయంబులై
హృద్యంబై యలరించె రుక్మవతినా కృష్ణాత్మజుం బొందఁగా
నుద్యోగించుచు నొక్కదూతికను ప్రద్యుమ్నున్ గనం బంపి భా
వద్యోతంబొనరించె రుక్మిణివలెన్ భావించి యాచారమున్.

మ. దురహంకారవశుండు రుక్మి, సుత కుద్యోగించి చాటెన్ స్వయం
వరకార్యంబుఁ, గుమారమార సములాభామాకరగ్రాహత
త్పరులై వచ్చిరి రుక్మి పట్టణముఁ దత్స[illegible] మాశించి సుం
దరి కర్పింపఁ బణంబ దేదియయినంగాని [illegible]ప్రీతిమై. ౧౦౬

మ. తనకై నిత్యము వేగుచున్న, మదమాత్సర్యాంధ చేతస్కుఁడై
తనయున్ గీడ్పడఁ జేయు రుక్మి కొక నూత్నప్రాప్తిఁ జేకూర్ప రు
క్మిణినూనుండు స్వయంవరమ్మునకు నేఁగెన్ సైన్యసంయుక్తుఁడై
జననాథుల్ గలగుండు పొంది సకలాశాగాములై పర్విడన్. ౧౦౭

చం. మూయు నృపాలసంచయము ముక్కలొనర్చుచు నుక్కడించి నా
పాయముగా విదర్భపతి బంధితుఁ జేసి రథంబునన్ బలో
పాయనమైన రుక్మవతిఁ బట్టి కరంబున స్యందనస్థగాఁ
జేయుచుఁ జేరె ద్వారక విశిష్టత రుక్మికిఁ నీతిఁ గొల్పుచున్.

కం. పిలిపించి ద్వారకకు మా
తులు బంధునియుక్తి, గురులు తోషింపగఁ బెం
డిలి నాడె రుక్మవతి సం
ధిలగా శుభలగ్న కరణతిథు లొక నాఁటన్. ౧౦౯

వ. ఇట్టియెడ – ౧౧౦

శా. కలఁడొక దానవుండు పరిఘావృత వజ్రపురంబు ధామమై
వెలయఁగ వజ్రనాభుఁ డను పేరున నిర్జిత వజ్రియై విధిన్
గొలిచి వరంబులొలిఁ గొని క్రూరత నెవ్వరికే నజేయుఁడై
మెలగుఁచు సర్వలోకుల కమేయ దురంతవిపత్ప్రదాయియై.

కం. అతఁ డొసఁగు కష్టములకున్
వెతలొంది సురాధిపాది విబుధవరులుఁ దా
పిత తాపసవరులున్ శ్రీ
పతి, ద్వారావతిని జేరి పలికి రిడుమలన్. ౧౧౨

ఉ. వారిజనాభుఁడున్ బలికె "వజ్రపురంబు కరం బభేద్య మా
క్రూరుఁడు వజ్రనాభుఁడు, నకుంఠ బలాఢ్యుఁడయాట నేఁడె యే
పారదు మీ యభీష్టగతి యారసి నే ననువైన కాలమున్
దీరుతు నిక్క"మంచు మునినిర్జరనాయకులన్ మరల్చెన్. ౧౧౩

కం. కలదు ప్రభావతినాఁ దో
య్యాలి వజ్రపురాధిపతికి సంభావర స
త్ఫలమైన యనుఁగుఁ గూఁతురు
లలనామణి బోల రెవరు లావణ్యమునన్. ౧౧౫

ఉ. ఆకె విలాససంపద యనన్యము నై కకుబంతమైన స
త్ప్రాకలచిత్తుఁడౌ వికసితాబ్జదళాక్షి కరంబుఁబట్ట న
స్తోకబలాఢ్యుఁడున్ దనుజుతోఁ గలహింపఁగ శక్తిలేమికై
యా కమలాక్షియున్ గిరిజ నర్చనలన్ బరితుష్టఁ జేయుచో. ౧౧౬

కం. ఒక రేయి స్వప్నమందునఁ
బ్రకటించి ప్రభావతికిని బ్రద్యుమ్నుని "బా
లిక ! నీవతి యీతఁడు ద్వా
రక శౌరికుమారుఁ"డని ధరాధరసుతయున్. ౧౧౭

ఉ. ఉదయము మేలుగాంచి మది యోచన చేసి రవంత గౌరి స
మ్మదమునఁ బూజలన్ దనిపి మాంద్యగతిన్ శయనించియున్న యా
ముదితకుఁ దర్శనంబొసఁగి మోహనరూపు మురారిపుత్రు న
భ్యుదయ మనోహరాకృతుల నుత్సుకతన్ గనిపింపఁ జేసినన్.

కం. ఉలికిపడి మేలుకని యా
యలివేణి మురారిసుతుని యాకృతి హృదిలో
మెలఁగిన తెఱఁగున లేఖినిఁ
గులికించెను జిత్తరువునఁ గొనిగొని యెలమిన్. ౧౧౯

ఉ. అచ్చట ద్వారకాపురము నందున నా నిసి స్వప్నమందు వా
రిచ్చెను గానిపించి యుమ రుక్మిణిపుత్రునితోఁ బ్రభావతీ
సచ్చరితం బనన్యగుణసంపద, రూపవిశేషసంగతుల్
నిచ్చలుఁ దన్నె కోరి తరుణీమణి శోషిలు చొప్పు మెప్పుగన్.

మ. విని ప్రద్యుమ్నుఁడుఁ దాపితాంగుఁడయి తన్నిబద్ధచేతస్కుఁడై
కనలెన్ మన్మథకీలికీలలను, గాకన్ సెజ్జపైఁ గూర్కి నం
తన కాత్యాయని కానిపించి "నటపాత్రంజేరుమీ వజ్రనా
భుని యావాసము సాంబుతోడ" ననుచున్ బోయెం దిరోధానయై.

ఉ. ఈ సకలాంశముల్ దెలిసి కృష్ణుఁడు మారుని జీరి "మీకు నే
బాసటగా నొకింత భటవర్గము నంపెద దానిఁ జేరువన్
మూసి పురంబుఁ జొచ్చి నినుముట్టిన సాంబునిఁ బంప మీకుసం
త్రాసముదీరు మీఁదుగతిఁ దద్దయు నేనొడఁగూర్తు సర్వమున్."

మ. అనఁ బ్రద్యుమ్నుఁడు సాంబుడున్ నటకవేషాకారులై వజ్రనా
భుని దుష్ప్రాప్యపురంబు సొచ్చి జనసమ్మోహప్రదత్త్వాతి తో
షణముం గూర్చిరి నాటకంబులను వేషానూనగానప్రస
క్తిని రాణ్మార్గములం బ్రదర్శమిడి సంకీర్తింపఁ బౌరుల్ బుధుల్.

ఉ. ఈ విషయం బదెట్లో వినిపించి రెవారలో వజ్రనాభుతో
నా వసుధేశుఁ డర్థి భటు నంపి సభాస్థలినాడ రుక్మిణీ
దేవికుమారు వేఁడఁ దన దేవులముందట నా ప్రభావతీ
దేవియు నాఁడు చూడ నరుదెంచె నట ప్రకటప్రదర్శనల్. ౧౨౪

ఉ. చూచి ప్రభావతీసతి త్రిశుద్ధిఁ బ్రధాననటుం డనంగుఁ గా
దూఁచి గ్రహించుచున్ హృది యదుప్రవరోజ్జ్వల రూపరేఖలన్
దాఁచి మనఃపుటంబున సదా తలపోయుచు మంచికాలమున్
వేచి నిరీక్ష సేయ రజనీచరనాథుఁ డదృష్టసంగతిన్. ౧౨౫

కం. నటకుల నాటక కుశలత
జటిలతకును ముగ్ధుఁ డగుచు సంతుష్టుండై
నటులను రాణ్మందిరమున
దిటముగ వసియింప నిలిపెఁ దీర్చి వసతులన్. ౧౨౬

శా. ప్రద్యుమ్నుండు ప్రభావతీప్రియసఖీవారంబులో నొర్తు కన్
సద్యస్స్నేహ మొనర్చి లోఁగొని ప్రసూనక్షిప్త లేఖార్థముల్
హృద్యప్రస్ఫుట భంగి పంప, సుదతీ ప్రేమోత్తరం బంపఁగా
నుద్యోగించి గమించె భామగృహమున్ ద్యోవీథి భృంగాకృతిన్.

చం. ఇటు సనఁ గొన్నినాళ్లు గమలేక్షణ కేర్పడెఁ జూలు దెల్లమై
భటులును జెప్పుకున్న యెడఁ బ్రాణభయంబును శంక చేసి సం
కటపడి వజ్రనాభునకుఁ గంపమునన్ శ్రుతమున్ ఘటింప న
క్కుటిలకనుమాని యాదనుజ కాంతుఁ డెఱింగి రహస్యవృత్తమున్.

ఉ. చొచ్చి ప్రభావతీ గృహము సుందరిఁ జేరి సుఖించు పూరుషున్
బచ్చనివిల్తుఁ గన్గొని గభాలునఁ గ్రమ్మిన వజ్రనాభునిం
గ్రుచ్చి ధనుర్విముక్త శరరోచుల దిగ్భ్రమ నింపుచున్ వెలిన్
జొచ్చి భటాళిఁ ద్రుంచె మధుసూధన పుత్రుఁడు విక్రమించుచున్.

చం. సమయ మెఱింగి సాంబుఁడును సర్వము దెల్ల మొనర్చి పొంతనే
సమయ నిరీక్షచేయు భటసంఘముఁ దెచ్చి మురారి కంతలో
సమరము వార్త బంపినను జక్రి గరుత్మతు నెక్కి వచ్చి వేఁ
గుమరుని బాసటన్ నిలువ ఘోరరణం బొదవెన్ దురంతమై.

శా. మాయాయుక్తుల ద్వంద్వయుద్ధగరిమన్ మార్మ్రోఁగ లోకాళి దై
తేయుండున్ హరి పోరి రయ్యెడల నుద్దీపోగ్ర విస్ఫూర్తి వా
లాయం బొప్పఁగ బోర్లి పోవ దినముల్ లక్షించి యీక్షించి దై
తేయధ్వంసి సుదర్శనంబుఁ గొని యాదేవాంతకుం గ్రమ్ముచున్.

ఉ. "చేటొడఁగూర్చి లోకములఁ జేడ్పడఁ జేసితి వజ్రనాభ! నీ
ధాటియు విక్రమక్రమణ తద్దయు దుస్సహమాట నోఁవ నీ
యాటలుగట్టె" నంచును రథాంగము వైచి గళంబుఁ ద్రుంచి యా
పాటలగంధి మన్మథుని పాణి గ్రహింప ననుగ్రహించినన్. ౧౩౨

కం. అల వజ్రపురిఁ బ్రభావతి
కలికికిఁ బ్రద్యుమ్నునకును గల్యాణము ని
స్తులవిధిఁ బ్రవర్తిలెను మం
గల వాద్యము లుల్లసిల్లగాఁ బ్రజలలరన్. ౧౩౩

శా. శ్రీప్రద్యుమ్నుఁ డపూర్వ శక్తి బలనిర్జేయుల్ త్రిలోకాపకా
రప్రాధాన్యుల వజ్రశంబరుల గర్వంబూడ్చి ప్రమందించి త
ద్వప్రాప్రాప్యపుర ప్రవేశుఁడయి దోర్దర్పంబునంగూర్చె సౌ
ఖ్యప్రాప్తిం భువనత్రయంబునకు దైవాంశోద్భవుండై తగన్.

కం. కావునఁ బ్రాముఖ్యంబని
యే వివరించుటయుఁ గలిగె నీగ్రంథమునన్
దేవ వరప్రభవుం డగు
నావరదు కుమారు నాఖ్య ఖ్యాతమొనర్పన్. ౧౩౪

రమానాథ శ్రితపాల క్రమశిక్షణా!
భ్రమాలోల పరిపంథి భయకారణా!
క్షమాధర్మపరిపాల! పరమేశ్వరా!
నమో ద్వారవతినాథ! నయరక్షణా! ౧౩౫

## గద్యము

ఇది శ్రీమదిందిరానాథప్రసాదలబ్ధ సహజకవితా విరాజమాన శ్రీమద్గౌతమసగోత్ర దివిపంశోద్భవ నరసింహాచార్యపౌత్ర వేంకటాచార్య రంగమాంబికాతనూజ రంగాచార్యప్రణీత శ్రీకృష్ణాతిమానుషతత్త్వ తృతీయఖండాంతర్గత చతుర్థాశ్వాసము — సంపూర్ణము.

శ్రీ ర స్తు

శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీ కృష్ణాతి మానుష తత్త్వము



## పంచమాశ్వాసము



కం. శ్రీయుత ! సర్వజగన్నుత !
న్యాయోర్జిత నిగమకథిత ! యానందరతా !
ధ్యేయచరిత ! దేవస్తుత !
మాయామోహిత ! పవిత్ర మంగళ చరితా !

వ. అవధరింపుమా —

కం. సోదరుఁ జైద్యుని మృతి దా
మోదరుచేఁ గలుగు కతన మురహరు నెటులేన్
ఛేదించి దంతవక్త్రుఁడు
శోధించుచుఁ దునుమ నదనుఁ జూచుచు నుండన్. ౧

మ. శివభక్తుం డగు సాల్వు, నాప్తుఁ గని “నీస్నేహంబు వ్యర్థంబ మా
ధవుఁ డుగ్రుం డయి యన్న చైద్యుని సభాస్థానంబునం ద్రుంపఁ గం
టివిగా నీవును వాని దుండగము, ధాటిం బొల్చు నీ బోటి భూ
ధవుఁడున్ సైచునె? యీవరాభవము మిత్రత్వంబుఁ బాటించినన్”,

వ. అనిన విని — ౩

కం. వికలితుఁడై సాల్వుఁడు త్ర్యం
బకుఁ గూర్చి తపం బొనర్ప బహుహాయనముల్
సకలంబు విడిచి ప్రత్య
క్షకుఁడై శివుఁ డిట్టు లనియె సాల్వున కెలమిన్. ౪

ఉ. "ఏమి తలంచి సాల్వపతి! యిట్టి తపం బొనరించి యుంటి నీ
కేమిటి కావలెన్ ? బలుకు మేఁ బరితుష్టుఁడ నైతి" నన్నఁ గ
న్నామర లందు సాల్వుఁడు ముదంబుకణంబుల నింపి యిట్లనెన్
'స్వామి! యజేయ యానమునభంబునఁ గ్రుమ్మర నాకొసంగుమా!'.

కం. అన మయుని జీరి పలికెను
ద్రిణయనుఁ డా మయుని తోడఁ ద్రిజగత్సం చా
రణయోగ్యసౌభకము వా
హనముగ రచియించి యొసఁగు మని వీడుకొనెన్. ౬

చం. మయుఁడు రచించి యిచ్చెను విమాన మమానుషమై జగత్త్రయిన్
రయగతిఁ జుట్టు నట్టిది ధరానలనీరసమీరశక్తులన్
వ్యయపడఁ బోని దాని నసురామర చారణ సిద్ధకోటి కే
భయ మొడఁగూర్పు దానిఁ బరభంజక సౌభకనామ యానమున్.

చం. శివ వరదత్త యాన మటు చేరిన సాల్వుఁ డఖర్వ గర్వియై
భువనచతుర్దశంబులను బోయి పురంబుల నుగ్గు సేయు మా
ధవపరమాప్తులం జెనకి దంభమునం గలహించి కూల్చు యా
దవపతి శౌరి నెట్లయినఁ దార్కొనఁగాఁ దలఁ జూచుచున్నెడన్.

కం. మురహారుఁడు హాలి తనయా
పరిణయ మొనరంగఁ గూర్చి పదపడి సుదతిన్
నరసుతుతో ద్వైతవనిం
గురుపుత్రుల కడకుఁ జేర్చి కుతుక మెలర్పన్. ౭

చం. కతిపయ వాసరంబు లటు కాలము పుచ్చి మురారి రేవతీ
సుత నభిమన్యుల న్నిలిపి సుందరి ద్రౌపది పాండవేయులన్
మతిఁ దనియంగఁ జేయుచు సమార్ద్రవ భాషలనీతి సూక్తులన్
ధృతిసమకూర్చి వారలయభీష్టముమీఁద నిజేచ్ఛ వీడ్కొనెన్. ౧౦

వ. ఇంతలో — ౧౧

ఉ. సాంభ పురీశ్వరుం డయిన సాల్వుఁడు శౌరి కుశస్థ వీడు సం
రంభము నాలకించి "తఱిరమ్మ"ని ద్వారక ముట్టడింపఁ గా
దంభ మెలర్ప సైనిక వితానముతో హితరాజిఁజేరి యా
డంబర సౌభయానమున డాసి మురారి పురంబుఁ జుట్టినన్. ౧౨

ఉ. సౌభక యాన యుద్ధగతి చండగతిన్ గడుసంభ్రమప్రదం
బై భయదాయకం బగుట నచ్యుతుఁడూరికి దూరమౌటఁ దో
డై బలభద్రుఁడున్ జనరథాశ్వమదేభభటప్రయుక్తి నా
సౌభము రుక్మిణీసుతుఁడు చయ్యనఁ దాఁకెఁ బరాక్రమించుచున్.

ఉ. అంతట సౌభకంబు పురహర్మ్యతలంబులనుగ్గొనర్చి యా
శాంతములం జరించి వియదంతర మందున నిల్చి యబ్ధి ని
శ్చింతఁ బ్లవించి మున్ని జలశీకరముల్ గురిపించి లేచి దు
ర్దాంతశిఖల్ వెలుంగఁ దనరారె నజేయ మభేద్యమై దివిన్. ౧౪

వ. ఇంతలో — ౧౫

ఉ. సాంబ గదాది ముఖ్య యదుచంద్రుని పుత్రకు లుగ్రులై శతాం
గంబుల నెక్కి సైనిక నికాయముతోఁ బ్రకటించిలావుఁ గ
య్యంబున నండదండలయి యాదుకొనం జనుదెంచి యున్న సై
న్యంబుల దంతవక్త్రముఖనాయకులం జెనకం బ్రచండమై. ౧౬

కం. చెలరేఁగ నఖండమ్ముగఁ
గలని ద్యుముఁడు సాల్వ మంత్రి కలయంగని సే
నల నుగ్గు సేయుటం గని
తలపడెఁ బ్రద్యుమ్నుఁ డతని ఘాటికి నెదురై. ౧౭

మ. ద్యుముఁ బ్రద్యుమ్నుఁడు దాఁక నాతఁడు ధనుర్ముక్తోగ్రనారాచవి
క్రమణాత్యుద్ధతి రుక్మిణీసుతుని మూర్ఛావస్థలో ముంచి దు
ర్దమభీమాకృతి హాలి సాంబ కృతవర్మాది ప్రశస్త ప్రధా
నమహాయోధులు దల్లడిల్ల శరవిన్యాసంబు సాఁగించినన్. ౧౮

కం. మరుఁడును మూర్ఛను దేరుచుఁ
బరసైన్య విజృంభణంబుఁ బరికించి వెఱం
బఱచు నిజసైన్య నాయక
వరులను బురికొల్పి ధృతిని బాదుకొలుపుచున్. ౧౯

శా. ప్రద్యుమ్నుండు ద్యుమున్ దలంపడి మహారౌద్రాశుగవ్రాత సం
రుద్ధోద్ధత్యముచేఁ గలంచుచు ధనుర్ముక్తాయుతేషూగ్రుఁడై
రథ్యంబుల్ దెగనేసి స్యందనము దర్పం బేర్పడం ద్రుంచుచున్
ఖద్యోతోపముఁడై మహాస్త్రతతిఁ దత్కంఠమ్ము ఖండించినన్.

చం. చెదరి వికావికల్ గనెడి సేనల సాల్వుఁడుచూచి క్రుద్ధుఁడై
చదలఁ దిరోహితుం డగుచు సౌభకయానమునం జరించుచున్
యదుభటవర్గముం గదిసి యాశుగముల్ గురిపించి నంత భీ
ప్రదమయి తోఁచె నిల్వ రణరంగమునన్ యదునాయకాళికిన్.

కం. ఇటు సంభ్రమపడి యాదవ
భటులెల్లను ధృతిని వీడి పరువిడు నంతన్
గ్రుటిలోన గరుడవాహనుఁ
డెటనుండియొ యరుగు దెంచి యెదురై సాల్వున్. ౨౨

శా. వెన్నున్ ముట్టిన సాల్వుఁడున్ బఱచి విన్వీథిన్ బ్రవేశించి, ప్ర
చ్ఛన్నత్వంబున దిక్కులం బఱచు, నాశావారముల్ చుట్టి రా
వెన్నుం డబ్ధిఁ జొఱంబడున్ వెఱచి యా భీరుండు సాల్వుండు, శ్రీ
మన్నారాయణుఁ డంబుధిన్ దుముకు భీమాకారుఁడై వానితో. ౨౩

చం. తొడిగి శరాళి శార్ఙ్గమున దుస్సహలీల నిరాకరించి యె
క్కుడకుఁ జరింపనీక కనకాశుగపంజర మల్లి సౌభము
క్కడనిలువంగఁ జేసినను, గంపమునం బెగడొందిసాల్వుఁడుర్
బుడమిని దూఁకినన్ జెనకె మూఁగి సురాసురలోలిఁ జూడఁగన్.

చం. చెనకి గదాయుధంబున విచిత్రగతిం బెనుఁగాడి యాడి తు
త్తునియ లొనర్చె సాల్వు తలఁదూలి తదీయ భటప్రకాండముల్
పసిచెడి పాఱిపోఁ గడఁగ లావు బయల్పడ దంతవక్త్రుఁడుర్
ముసికొనిసాఁగివచ్చిహరిఁ బోర నెదుర్కొనియాఁపె సైన్యమున్.

కం. నిలిపి పలాయిత నిజభట
వళులును, దలపడుచు దంతవక్త్రుఁడు హరితో
నలుకం గట్టెదుటం జని
పలికెం గనునిప్పు లురల భయదాకృతియై. ౨౬

మ. "తులువా! నీవొక క్షత్రియుండవగుదె! నాతోఁబుట్టువున్ జైద్యునిన్
గొలువుం గూటమిఁ గూల్చివైచితివి నిన్ దూలించియున్నట్టిదో
ర్బలు బార్హద్రథు యాచకుండవయి దుర్భావోక్తిఁ జంపించి ని
శ్చల మాయాగతి సంచరించుటయ నీచారిత్ర! నీచాత్మకా!"

ఉ. "ఎన్ని దినాల నుండియొ వధింపఁ దలంతును నిన్ను, నేఁడు నా
పున్నెము దక్కటం గలిగెఁ బోరు ముఖాముఖి, సాఁగిరావు నీ
తెన్నులు నాకడన్. దునిమి తీరుదు నిన్నిదె నేఁడ, పీడ నీ
బన్నమునుండి నిన్ గడుపువాఁ డెవఁడో కనుఁగొమ్ము దుర్మతీ!

కం. అని పెనుగదఁ గైకొని భీ
షణుఁడై తనపైకి వచ్చు చండమయూఖుం
డనిపించు దంతవక్త్రునిఁ
గని నవ్వుచుఁ జక్రి పూని గదకరయుగళిన్. ౨౭

గీ. దంతవక్త్రుని గదను జిత్రగతిఁ జూర్ణ
మును ఘటించిన నాతఁడు వూని పరిఘ
మీఁదికిని బారు హారి దాని బూది చేసె
వింటి శితశరములు గురిపించి మించి. 30

ఉ. అంతట దంతవక్త్రుఁడు ఖరాసిని దూసి మురారి పైకిఁ బోఁ
గంతుని తండ్రి సిల్వాడి యఖండ శరంబు లఖండఖండముల్
వింతగఁ జేయు ఖడ్గ మరవిందదళాక్షుని దాఁకెవాఁడు పెన్
గుంత మొకండు చేకొని వినోదగతిన్ విదళించి మించుచున్. 31

మ. ఒకకోలం గుడిచేతి ఖండములుగానూరుల్ మఱో యమ్మునన్
వికలంబున్ బొనరించి వామకరముర్విన్ ద్రుల్లగా నేసి వే
ఱొక కాండమ్మున వక్షమున్ జదిమి వేఱో బాణమున్ గూర్చుచున్
శకలంబుల్ బొనరించె శీర్షమును దత్సైన్యాలి భీతిల్లఁగన్. 32

ఉ. ఈ విధి సాల్వ భూధవు వధించి మదోద్ధతు దంతవక్త్రునిన్
జేవ యడంచి త్రుంచి పురిఁ జేరిన శౌరిని ద్వారకాపురిన్
భావనచేసి మెచ్చుచు నివాళు లొసంగిరి చల్లి లాజలన్
బూవుల, నిల్చి సౌధగతి మోదితులై పురవాసు లెల్లరున్. 33

వ. అంతఁ గొంతవడి నడచునంతలో నరణ్యవాసులగు పాండవులు —

చం. పదియును రెండు వర్షములు పాండవులేవు రరణ్యవాసులై
వదలక యొక్క హాయనము వారు విరాట్పురి నెట్టు లెట్టులో
నొదిగి వసించి యిర్వురును ద్యూతమునం దనుకొన్న నిర్ణయం
బది యెటోతీర్చి చేరికొని రంత నుపప్లవ పట్టణం బొగిన్. 34

చం. అది కురురాష్ట్ర మాపురికి నావలనుండుట ధర్మయుక్తమా
విధి నిజరాష్ట్రముం గొనక వేఱుగ రాజ్యమునందుఁ బాండవుల్
వద మిడ నిచ్చలేమికి, నివాస ముపప్లవమందుఁ జేసి వం
వఁదలఁచె రాయభారగతు బాండుసుతాగ్రజుఁ డచ్యుతున్ వడిన్.

కం. మాద్రేయుల నరదముపై
భద్రగతిం బాపి రాయబార మొనర్పన్
భద్రాత్మకు హరిఁ జేర స
ముద్రావృతద్వారవతికిఁ బోయి ముకుందున్. ౩౮

కం. కని విషయం బెఱిఁగించిన
వనమాలియు రాచపనులు బలభద్రునిపై
నునిచి నకుల సహదేవుల
వెనువెంటం జనియెఁ బాండవేయుల నరయన్. ౩౯

చం. అరిగి యుపప్లవంబునఁ బృథాత్మజులం గని యాదరించి సం
బరమున ధర్మసూనుఁడు సమంచిత భంగిని నర్ఘ్యపాద్యముల్
వరువడి నిచ్చి మజ్జన నవాంబరమాల్యసుగంధలేపమా
ధుర చతురన్నముల్ పొసఁగి తుష్టి నొసంగెను భక్తియుక్తులన్.

ఉ. నాఁటికి విశ్రమించి మఱునాఁ డుదయంబునఁ బాండవేయులన్
జాటునఁ జేరి యొక్కొకరు సంధి గుఱించి స్వకీయభావముల్
సాటఁగఁ బృచ్ఛఁ జేయు హరి సాఁగి యుధిష్ఠిరుఁ డేఁగుదెంచి ము
క్కోటిసురల్ జగజ్జనులుఁ గోవిదబృందము మెచ్చ నిట్లనెన్.

మ. "జగదాధార! ముకుంద! కృష్ణ! వరదా! సాక్షాజ్జగన్నాయకా!
పగయున్ మైత్రియు బంధసంగతులు దుర్భావంబు మాత్సర్యముల్
దగులున్ ద్వేషము లస్థిరంబులుఁ బరిత్యాగంబులై యుంట నే
పగిదిన్ దేల్చిన నాయభీష్టమగు నేభావింతు నీయిష్టమున్. ౪౧

శా. "కర్తృత్వంబు వహించి సర్వమును సంకల్పించి, సర్వావనీ
భర్తృత్వంబున రక్షచేయుదువు, నీభావంబు నందెట్లు ని
ర్వర్తిల్లున్ ఘటియిల్లు నాపగిది, నిర్వ్యాపార మేపారఁగా
హర్తింపన్ సకలాత్మ నీవనువ మాకాశీః ప్రదంబై చనున్.

ఉ. "ఐనను జ్యేష్ఠుఁడన్ గనుక నందఱి యిష్ట మభీష్టమౌఁ గదా!
దాన వచింపఁగా వలసెఁ దధ్యము నాఁచక పాండవేయులున్
గానలఁ గంత లందుఁ గలకాలము నిల్చుట రోసిరోసి భూ
దానముఁ గోరుకొందురు యథార్థము నైజముసూవె మాధవా!"

ఉ. "సంజయు రాయభారపుఁ బ్రసంగము విన్నను బెద్దతండ్రి మా
కుంజర రాజ్యభాగమునఁ గుంజము మోపు ప్రదేశమేని నీ
యం జనఁడంచుఁ దేలెను హృదంగము సంగరముం గడంగదో
కంజదళాక్ష! మాకుఁ జవిగల్గునె నెత్తుటికూటి బత్తెముల్." ౮౮

కం. "అన్నలుఁ దమ్ముల నఱదులఁ
బిన్నల బంధుగులఁ జంపి పృథ్వీశుఁడనై
యున్న రుచించునె రాజ్యం?
బెన్నఁబ్రియ దాయకాప్తహితులు నశింపన్." ౮౯

చం. "అయిన వచింపు నావినతి యయ్యకుఁ బో రొనరింపరాము మీ
భయమునఁ గాదు బంధుగుల భండన మందునఁగూల్చివేయు దు
ర్ణయముఁ దలంచికాని, యిదిన్యాయము యేనియనుగ్రహింపుఁడీ
యయిదు పురంబులైనను, సుతాళి కొసంగి విశిష్ట రాష్ట్రమున్."

చం. అన నగి వాసుదేవుఁడు యమాత్మజు నావల కంపి మారుతిన్
గనుసనఁ జీరి యిట్లనియె "గాదిలియన్న యుధిష్ఠిరుండు వా
క్కొనె నయిదూళ్లు సాలనుచు నంతె వచింతువా! వేఱ కోరెదో!
కనుఁగొన నెంతుఁ గొంచెము బకాసురమర్దన! నీ ప్రసంగముల్."

కం. "విని నాఁటి నిండుసభలో
ననిలాత్మజ! నీప్రగల్భ మనుదినమెదలో
గణియింతురు నిను దుశ్శా
సనదుర్యోధనులు నొక్క శక్తియుతునిఁగా. ౯౦

మ. అనినంతన్ బెనుఁ గిన్క వాయుసుతుఁ డుగ్రాకారుఁడై “నందనం
దన! మృద్భక్షణ చేసి లేదనను లే, తారొక్కన్న బార్హద్రథున్
గని వెన్నిచ్చి పలాయనంబు సలుపంగాఁబోను, బాలిచ్చు జ
వ్వనిఁ గూల్పం జన, నీక చెల్లెను మృషావాక్చేష్టితంబుల్ హరీ!”

ఉ. “ఆడిన మాటఁ దప్పను, యథార్థము, దుష్టులఁ గౌరవేయులన్
నేఁ డయినన్ బ్రతిజ్ఞ గమనించి వధింతును విస్మరింప నే
నాడిన దెల్లఁ జేయఁగల నన్న యొసంగననుజ్ఞ సుంత, నీ
వేడుకఁ దీర్తు నేఁగి యరవిందదళాక్ష! యిదే” యటంచనన్.

ఉ. భీముని దువ్వి శౌరి యనె “వీరవరేణ్యుఁడ వౌదు చాలు నీ
భీమపరాక్రమంబుఁ గనిపింపకు నేఁడు, ప్రతిజ్ఞమాటనీ
వే మఱి ధర్మజోక్తులు జంపింతు వటంచు భ్రమించి నాఁడ నీ
నేమము నన్న సామము గణించి తలంపు నెఱుంగఁ జేయుమా.”

ఉ. శాంతి వహించి యంతటఁ బ్రశాంతముగా ననిలాత్మజుండు కం
సాంతకుతో, వచించె “నిటులన్న వచించిననొక్క భంగి నా
పంతము సాఁకుగాఁ గొని నిబంధన మేను జ్యతింతునే? వృథా
భ్రాంతి సుయోధనుండు నొడఁబాటున కొగ్గఁడ దేమి చెప్పినన్.

మ. ఒకవేళం గురుసూను లగ్రజుని ధర్మోక్తుల్ జెవిం దూఱి సం
ధికి నీకొన్నను నాప్రతిజ్ఞ యెటులో తీర్తున్ బరీక్షించి యే
దొక వ్యాజాన దురాగతంబడఁగునే యూహింప భోజ్యంబు నేఁ
టికిఁ గాకున్న మఱొక్క నాఁటికిని ఘాటెన్ మీటి చూపింపనే?

ఉ. పుచ్చి సమీర పుత్రునగవుం దగవుం గనులందు నిల్పి వి
వ్వచ్చుని జీరి శౌరి యనెఁ “బార్థ! మఱేమి వచింప నెంచి నా
వెచ్చగ, రాయబారము ఫలించునె? కర్ణుఁడు పూనికొన్న మీ
కచ్చలు నామెఱుంగనివి గావుగదా! ప్రకటింపుమిష్టమున్.”

వ. అనిన సకల విదుండగు నరుండు ప్రణమిల్లి యిట్లనియె — ౫౫

శా. "ధర్మాధర్మ విచక్షణుండవగు నీ దాక్షిణ్యముం గోరి మా
ధర్మంబున్ బరపక్ష పాపగతి యాథార్థ్యంబు ద్యోతంబుగాఁ
గర్మప్రాప్తి నొసంగఁ గోరితిమి నీకర్తృత్వమున్ దేవ! యీ
మర్మం బీవ యెఱుంగవే! యెటుల సంభావ్యంబు సంధానముల్!"

కం. సంతుష్టిఁ గాంచి నరు సి
ద్ధాంతములకు మాద్రిసుతులతలఁపు దెలియ శ్రీ
కాంతుఁడు పిలిచిన వారలు
చెంతకు నరుదెంచి యిటులఁ జెప్పిరి హరితో. ౫౭

ఉ. "మాధవ! రాయబారము సమంజసమైనఁ దమోంధబుద్ధి దు
ర్యోధనుఁ డీకొనండు విధియోగబలంబున, మే మెఱింగియుఁ
సోదరుఁ డగ్రజున్ గడచు చొప్పవివేకముగాఁ దలంచి యా
మోద మెఱుంగఁ జేసెదము ముంచినఁ దేల్చిన మా కభీష్టమా!"

ఉ. అంత మురారి ద్రౌపది జనాంతిక మందున బిల్వనంపి నీ
స్వాంత మెఱుంగఁ జేయు మన సాధ్వికనుంగవ నీరు నిల్పి "దై
త్యాంతక! యంతకాత్మజుఁ డనాదరుఁడై నను ద్రోసిపుచ్చ సి
ద్ధాంత మొనర్పఁ గాదని తదన్యమువల్కవిరుద్ధ ధర్మమా!" ౫౯

శా. "నాకుం గల్గిన యాపరాభవము మన్నాథాఖ్యవిఖ్యాతులా
నీకౌంతేయుల కింత సోఁక నటు వర్తింపం గడుం జోద్యమా
లోకంబున్ మఱి లోకులన్ బరువు నాలోకింపఁగా బోనిచో
నా కేలా యభిమానమున్ వ్యథ? జగన్నాథా! విలోకింపవే!"

గీ. అను ద్రుపదపుత్రిఁ గని హరి యనియె నిటుల
"యింతి! నినుఁ బోలు సాధ్వి వేధించి యున్న
వెవటు లేనాఁటికేని నశింత్రు నిజము
నా వచోగతి తప్ప దేనాఁటికైన". ౬౧

చం. అని యరదంబుఁ బూనిచి హయాంకిత రింఖదభంగశృంఖని
స్వనములు గ్రాల నల్గడలఁ జండమయూఖ సమాన మాన్యమై
తనరు మణీంద్ర దీధితులఁ దాండవ మాడ వియత్స్థలిన్ మరు
ద్గణము విమానయానమయి కాంచ ముకుందుఁడు సాఁగె దూతయై.

కం. కృతవర్మయు సాత్యకియును
గతిపయ చతురంగబలముఁ గడకొని రాధ్వా
నిత తూర్యఢమరఘోషలు
వితతములై మిన్నుముట్ట వెడలె ముదితుఁడై. ౬౩

ఉ. మాగధ వందు లిర్గడల మాధవ కీర్తి నుతించుచుండ ను
ద్యోగులు ముందుగాఁ జని నియోగ మొనర్చిపథంబుఁ దీర్ప సు
స్వాగత మిచ్చి పౌరులును జానపదుల్ వినుతింప నెల్లెడన్
సాఁగెను దౌత్య సంగతి జనార్దనుఁ డూకొని శాంతదూతయై. ౬౪

ఉ. దౌత్య మొనర్ప శ్రీవిభుఁడు దంతిపురంబున కేఁగు వృత్తమున్
బ్రీత్యనుభోజ్యమై యెసఁగ శ్రీనిధి దర్శనభాగ్యయోగ్యసాం
గత్యముఁ గోరి యధ్వగత గ్రామనివాసులుఁ బౌరు లెందఱో
నిత్య మొకొక్కచోఁ గొసరి నిల్పిరి స్వాగత మిచ్చి చక్రికిన్. ౬౫

సీ. ఎదురేఁగి కొనివచ్చి మృదుల వాద్యములతోఁ
జెలఁగి వేదోక్తిఁ బూజించు వారు;
కోలాహలంబుగఁ గొనివచ్చి సభఁ గూర్చి
కొనియాడి వేఁడి వీడ్కొలుపు వారు;
మేళతాళములతో శ్రీలోలుఁ దోడ్తెచ్చి
కానుక లందిచ్చి పంపించు వారు;
వేదమంత్రముల గోవిందు నాహ్వానించి
ఋగ్యుక్తి నాశీర్వదించు వారు;

గీ. నగుచుఁ బ్రకటించుకొనిరి నిజాభిమాన
పరతఁ బౌరులు జనపదావాస జనులు
వ్రజులు మున్యాశ్రమావాస పరులు వరులు
నచ్యుతుఁడు దూతయై చను నవసరమున. ౬౬

ఉ. శ్రీపతి సంధిదూతయయి చేరఁగ వచ్చు నుదంత మెన్నఁడో
దాఁపయి సోఁక వీనులకు దంతిపురీశులు ధార్తరాష్ట్రు లెం
తో పరికించి వృద్ధగురుసూక్తులు మిత్రజనోక్తు లెల్ల ను
ద్దీపక లీల స్వాగతముఁ దీర్పఁ గడంగిరి వైభవోన్నతిన్. ౬౭

ఉ. నగరము సంతరించి భవనంబులఁ డెక్కెములన్ రచించి సో
యగమగు చల్వపందిళులు నందముగా వెలిమేలి కట్లు నే
ర్పుగఁబచరించి బోరుమని మ్రోఁగ సుమంగళవాద్యముల్ శతాం
గ గజతురంగసైనికనికాయము నిల్పి పురోపరిస్థలిన్. ౬౮

చం. తొలిమొన రాజరాజు సితతుంగగజంబున, దుస్ససేనుఁ డా
వల మదదంతిపై, నతనిప్రక్క రథంబునఁ దాళకేతుఁ డా
వల గురుఁడున్ గృపుండు, నిరువైపులఁ గర్ణుఁడు సైంధవుండు సౌ
బల విదురుల్ నిలంబడిరి స్వాగత మీయ రథాధిరూఢులై.

ఉ. దవ్వుల నభ్రసంపతితతారవలెన్ గనిపించి యంతలో
నవ్వడిఁగూడి యర్థ శశిసన్నిభమై మఱి యంతకంతకున్
నివ్వెరఁ గొల్పఁ బూర్ణరజనీచర బింబము, సూర్యబింబమై
నివ్వటిలెన్ మురారి రమణీయ శతాంగము కౌస్తుభ ప్రభన్.

మ. "ఇదిగో! జూఁడు సుదర్శనప్రభలు మీరీక్షింపుఁడీ! యల్లవే!
హృదయన్యస్తమణీంద్రదీధితు లివే! శ్రీపాంచజన్యాంశు వి
య్యదియే! మాలినిబద్ధపింఛగతహీరాంచిత్రప్రభాదీప్తియి
య్యదె! కృష్ణాంబుదమిట్టెవచ్చెననుమాన్యాలాపముల్ పర్వె చో."

మ. హయరింఖోద్ధత భూరజఃపటలి, సంధ్యారాగ విక్రాంతమై
రయరింఖద్రథకేతవజ్రరుచిఁ దారాదీప్తిఁ జిత్రించి ది
క్చయసువ్యక్త శిరోమణిద్యుతులు రాకాంశుచ్ఛటా భాతిగా
నయనానందమయం బొనర్చె యదుచంద్రస్ఫూర్తి సంప్రాప్తమై.

సీ. అతఁడు షోడశకళోన్నతుఁడగు నీతఁడో
సకలకళాపూర్ణ సన్నుతుండు!
అతఁడు క్షయామయ వ్యయుఁడగు నీతఁడో
యక్షయుఁ డక్షరుఁ డవ్యయుండు!
అతఁడు కళంకితాకృతియగు నీతఁడో
యమలుండు వితతకళ్యాణ మూర్తి!
అతఁడు క్షీరపయోధి కాత్మజుం డితఁడో
యుజ్జ్వల దుగ్ధ పయోధిశాయి!

తే. అతఁడు శ్రీసహోదరుఁ డగు నితఁడు భర్త!
కుముదినీ మిత్రుఁడు డాతఁడు కమలమిత్ర
జలజ నేత్రుఁ డితండు! నిశాచరుండ
తండి తండు నిశాచర దండనుండు! 23

ఉ. అంత నితాంత మంగళ మృదంగనినాదములున్ దిగంత వి
క్రాంతములై 'యదూద్వహా!' 'మురాంతక!' 'శౌరి!' 'ముకుంద!'
'కృష్ణ!' 'కం
సాంతక!' 'శ్రీక' రే తిపదజాలములున్ శ్రుతిపేయమైన శ్రీ
కాంతుఁడుదోఁచె నెట్టెదుటఁ గన్నుల పండువుసేతఁగొల్పుచున్.

ఉ. భద్రగజంబు వీడి నిలువంబడి స్వాగత మీయ సర్వతో
భద్రుఁడు రాజరాజు నిరువంకలఁ గర్ణుఁడు దుస్ససేనుఁడు
ద్యద్రమణీయ చామరము లోలి జవంబున వీవ డిగ్గె సం
పద్రజితాద్రి సన్నిభసుభద్రశతాంగముఁ జక్రి భద్రుఁడై. 24

చం. రయమున భీష్ముఁ డేఁగి పరిరంభ మొనర్పఁగ నమ్రుఁడై కర
ద్వయి విదురుండు మోడ్చె ముదబాష్పము పాద్యముగా భజింపఁ ద
ద్దయుఁ గృపకుంభసంభవులు దర్శనకౌతుకవార్ధిఁ దేల న
వ్యయజయనాదము ల్సుభగ వాద్యగణంబులు మిన్నుముట్టఁగన్.

మ. కురిసెన్ గొజ్జఁగి నీటి వాన త్రుటిలో గోవిందు గ్రీవంబునన్
గుటికైమె చిత్రవిచిత్రవర్ణగతులం బూదండ లెన్నెన్నియో
కురిసెం గుండలు గ్రుమ్మరించినటు పూగుత్తుల్ దదీయాంఘ్రులన్
విరిసెం బ్రాల్పడి రాలె ముత్తెపుసరుల్ పేలాలు శీర్షంబుపై. ౨౮

వ. అంత సుయోధనుండు —

సీ. వరుసఁ బేర్వేరునఁ బరిచయం బొనరించి
మాన్యసామంతరాణ్మంత్రి గణముఁ
బగటిదివ్వెటులు నివాళు లెత్తించి సా
లంకృత దివ్యపల్యంకమునఁ బ్ర
తిష్ఠితుఁ జేసి నిర్దుష్ట వేదాశీర్వ
చననృత్యగానరచన లెసంగ
బహువిధ మంగళ వాద్యముల్ మొరయంగఁ
దిరువీథులను ద్రిప్పిత్రిప్పి తుదకు

ఆ.వె. రాజమందిరమున రాట్సభాస్థలి దింపి
యర్ఘ్యపాద్యమజ్జనాదిగతుల
నర్చనం బొనర్చి యానంద వశుఁ జేసి
భోజనం బొసంగఁ బోవు నంత. ౨౯

చం. చిరునగు వెన్నెలల్ చెలఁగి చిందులువేయ మురారి యిట్లనెన్
“గురుపతి! పాండునందనులు గోరిన దైత్యము సమ్మతించి మీ
పురి కరుదెంచి యుంటి, నిదిపోలునె! మీకడ నే భుజించి మీ
కరుచికర ప్రసంగముల నాడుటఁ జూడక పాడి పోఁడిమిన్.” ౩౦

వ. మఱియు – ౧౦

కం. "మీయింట నేను గుడిచిన
నాయెడదం దీర్పు టరయ నాయము మీకుఁ,
జేయుదురే నానోడువుల
కీయకొని యెదే నొనర్చ ధృతరాష్ట్రసుతుల్." ౧౧

వ. అదియునుఁ గాక – ౧౨

ఉ. "కౌరవ! లీరు నూర్వు రొక కట్టడి చొప్పున నుంటఁ దాతలుఁ
గౌరవనీయులౌ గురు జనంబులు మీయనుయాయు లౌట నీ
భూరమణుల్ త్వదీయులయి, పొందిక మీవని చేయు నుంట నే
వ్వారిగృహంబులం గుడుచు వాఁడను గాను సుమీ! సుయోధనా!

చం. "సదయుఁడు ధర్మసంపదయ సంపదగాఁ దలపోయు వాఁడు నన్
హృదిఁ దలపోసి యీపుడమి నిర్వురు నేలిన సంతసించు నీ
విదురుఁడు పక్షపాతగతిఁ బ్రీతి నెఱుంగని ధర్మమూర్తిఁ గో
రెద నొక వట్టెఁ డోరెము భరించి యభీష్టముఁ దీర్ప సమ్మతిన్."

వ. అనిన విదురుండు సంతుష్టాంతరంగుండై పెన్నిధి తనకుఁదానై చేరికొన్నఁదనియు
నట్లు – ౧౫

కం. అభ్యాగతిగా శ్రీహరి
లభ్యమగుటఁ బూర్వకృతఫలంబని మదిలోఁ
దుభ్యం నమోస్తనుచు లో
కాభ్యంతరశుద్ధుఁ బసుని హరిఁ గొని చనియెన్. ౧౭

ఉ. మెచ్చునె? భోగ్యభాగ్యములమేయవిభూతులు లాంఛనంబులున్
మెచ్చునె? యానముల్ ధనము మెచ్చునె? యాగవిధుల్ వ్రతంబులున్
నచ్చునె యర్చనంబులు ననంత తపోజప కల్పనంబులే?
నచ్చపుభక్తి హత్తిన హృదంగ సమర్పణఁ దక్క నేమిటన్. ౧౮

చం. విదురుని యిల్లుసొచ్చి యరవిందదళాక్షుఁడు సస్మితాస్యుఁడై
సదయతమైఁ బెలంగి భటసంతతి సంతతి బాంధవాళితో
ముద మొడఁగూర్చి మైత్రి చనువున్ గొని వారి కుటుంబరాశిలో
నొదగి యొకండునై మెసవె నోరెము ముచ్చటలాడి మచ్చికన్.

మ. మఱునాఁడే వచరించె రాజసభ సన్మానించి యాహ్వానముల్
పఱపెన్ భృత్యులచే సుయోధనుఁడు నావార్ష్ణేయుఁడే దూతయై
వఱతెంచెన్ నిజభావముల్ దెలుప విద్వాంసక్షమాభృన్మునీ
శ్వరులం గూరిచి చాటఁ బంపుచు సభాస్థానంబు భవ్యాకృతిన్.

ఉ. భారము లాఘవంబు పరిపాటి గణింపక రాయభారపుం
భారముఁ బూని నొఁదలను భారములం దతిభారమై యసా
ధారణ లాఘవంబగు నుదార మనోహరమూర్తి లోక సం
చారి మురారి దర్శన విచారమునన్ జనుదెంచి రెల్లరున్. ౯౧

క౦. నారదుఁడును జాబాలియు
భారద్వాజుండు శుకుఁడు వ్యాసుండును దై
త్యారాతి రాయబారముఁ
గోరి యరుగుదెంచి రపుడు గొలువున కెలమిన్. ౯౨

మ. కొలువుం దీరి సుయోధనుండు సచివుల్ క్షోణీశ్వరుల్ మానులా
ప్తులు సంబంధులుసోదరుల్ హితులుమిత్రుల్ దివ్యులాచార్యులున్
బలియున్ గన్గొని దుస్ససేను, ననె “నాహ్వానించి శ్రీకృష్ణు ని
మ్ముల నాస్థానము రాజలాంఛనల సంబోధించి చేర్పింపుమీ”.

మ. అన దుశ్శాసనుఁ డేఁగి యావిదుర గేహం బందు గోవిందుఁ గ
న్గొని “శ్రీనాథ! రథంబుఁ దెచ్చితిని నిన్జూడన్ మునీంద్రుల్ సురల్
చనుదేర క్ష్మాతిమాలి నిల్పితిమి యాస్థానంబుఁ జేరంగ దే!”
యని ప్రార్థింప రథాధిరూఢుఁడయి రాజాస్థానమున్ డాయుచో,

ఉ. ముంగిట నిల్వఁడంగఁ గురుముఖ్యులు ప్రావయి యంగరక్షకుల్
పొంగి సమర్థమా ప్రజను బూనిక నాఁపఁ బ్రతిధ్వనించుచున్,
మంగళవాద్యముల్ మొరయ మాగధవంది జయేతి నాదముల్
నింగిఁ జరింపఁ, జేరికొనె నీరజనేత్రుఁడు రాట్సభాస్థలిన్. ౯౫

మ. దిగుచో స్యందనమున్ సుయోధనుఁడు ప్రీతిన్ గూర్చెఁ గైదండ, డి
గ్గి గమింప న్ధవళాతపత్రమును భక్తిం బట్టెఁ గర్ణుండు, సాఁ
గఁ గడంగన్ వెలఁజామరంబు లిరువంకల్ సింధురాట్బాహ్లికుల్
దగులన్ వీచిరి వాసుదేవునకు శ్రద్ధాబద్ధ సన్నద్ధులై. ౯౬

కం. శాంతనవుఁడు పథిఁ జూప ను
రాంతకు మున్ముందు నడచి, యధిపు లమాత్యుల్
చెంతఁ బిఱుందను వరుసై
శాంతంబుగ వెంబడింప సభ కరుదెంచెన్. ౯౭

మ. అది దుర్యోధన చక్రవర్తి సభ యందామూల నాసీనులై
పృథివీశు ల్గలరిందుఁ జారణులు మానీశుల్గలా రందు న
య్యదె సామంతు లమాత్యులున్ గురులు సౌఖ్యాసీనులై యున్నవా
రదె యాచక్కిఁ గలారు పండితులు మిత్రాప్తుల్ సుఖాసీనులై.

ఉ. అచ్చట నారదుం డాదిగి యచ్యుతు రాక నిరీక్షసేయు, న
ల్లచ్చట వ్యాసుఁ డత్రిఁ గని యాహరి పూనిక ముచ్చటించుఁ దా
రచ్చకు నేఁగుదెంచె భృగురాముఁడుఁ గూడ ముకుందుఁ జూడఁగా
నచ్చరు లొక్కచో నిగిడి యంబుజనాభుఁ బ్రతీక్షఁ జేయుచో.

ఉ. రాజ సభాంతరస్థ ధృతరాష్ట్ర మహీపతి యాసనంబు వి
భ్రాజిత దివ్యవేదిపయి రాజిలు నుచ్ఛ్రితమై కెలంకులన్
బూజిత హేమపీఠికలు పొల్పు నిజాత్మజ కోటి నింప; నీ
రేజదళాక్షు పీఠిఁ బచరించిరి వేదికపైని నొక్కచో. ౧౦౦

మ. ఒకచో దుష్టచతుష్టయం బొకట మాన్యుల్ ద్రోణభీష్మాదు లిం
కొకచో బాహ్లిక సోమదత్తకురువంశోద్ధారకుల్ వేఱ సా
త్యకి భూరిశ్రవముఖ్యయోధవరు లాస్థానాగ్రపీఠాళి వే
డుకఁ జూపట్టిరి యక్షిపర్వముగఁ దోడుందోడు వాఁదోడులై.

మ. ధృతరాష్ట్రాసన వామపార్శ్వగతచిత్రీభూత చంద్రాశ్మ ని
ర్మిత సోపాన వితాన భూరిమయ పారీంద్రాంక రత్నప్రభాం
చిత విభ్రాజిత పీఠిఁ జూపగ సమాసీనుండునై శౌరి స
స్మిత రోచుల్ వెలిగించి నల్గడలు జూచెన్ బీఠికా విష్టుఁడై. ౧౦౨

వ. అంత — ౧౦౩

ఉ. సంజయుఁ డచ్యుతాగమన సంగతి నంధనృపాలు తోడఁ జె
ప్పం జన నాథుఁ డిట్టులనెఁ "బంకజనాభ! యదృష్టమేమి! హృ
ద్రంజక మాయె నేఁడు దమదర్శన మబ్బుటఁ బుణ్యవంత మీ
కుంజర పట్టణంబును ముకుంద! భవచ్చరణాంకితంబుగాన్. ౧౦౪

ఉ. "అంజలి చేసి చెప్పెద నిరంజన! నీమహనీయ సత్కథా
పుంజము లాలకించి తమిఁ బొందెద నిన్నఁగోరి నేన యీ
నెంజలిఁ దక్క నెయ్యది గణింపను నాశ్రుతిపేయ సంగతిన్
మంజువచః ప్రసక్తి నసమాన ముదంబుధిఁ దేల్పవేఁడెదన్. ౧౦౫

ఉ. "తమ్ముఁడు పాండురాట్సుతులు దావక దివ్యకటాక్షవీక్షలన్
నెమ్మది నున్నవారలె? జనించి పితృవ్యుఁడనై యశక్తిమై
కిమ్మనకుంటిఁ గాదె పరికించి తదీయవియోగ కష్టముల్
బమ్మయుఁ జక్కఁ దీర్చునొకొ! ప్రాపితకర్మ విశేష దుర్గతుల్.

ఉ. "సంజయుఁబంపి యుంటిఁగద! సంధిని గూర్పఁగ నాత్మబంధువుల్
భంజన వాంఛ నెత్తురుల వాఁకలవాఁకలొనర్చుటే ప్రజా
రంజక యుక్తి కాదని వరంబున కేనియు దూర మంచు, నో
కంజదళాక్ష! రాజ్యరుచిఁ గన్న, రుచించు నెయ్యన్య సూక్తముల్,

కం. కౌమరులు బెడఁ గొయ్యాలుసా
మము మఱిభేదమునఁ గఱపు మాటవినర యు
త్తములని మత్సరముడుగుట
క్రమమున రుచికాదు పాండురాట్సూనులకున్. ౧౦౮

కం. అసమర్థుఁడ నంధుఁడ దా
మసబద్ధుఁడ రోఁతగలిగె మనుగడపై సా
హసగతికిఁ బోక విసమును
మెసవను నీవైనఁ గూర్పు మైత్రి సుతులకున్. ౧౦౯

కం. అని కంటనీరు నింపెడు
జననాథు నసహ్యాగతికి జాలిపడుచు శ్రీ
వనమాలి నిలిచి పలికెను
మును పాండుకుమార సూక్తములు వరుసవడిన్. ౧౧౦

ఉ. అంతటఁ బోక యిట్లనియె "ఐనను బాండుకుమారు లేకమై
కొంత స్వతంత్ర మిచ్చుటను గోరి వచించెద నాతలంపు భూ
కాంత! త్వదీయపుత్రకులు గాదన వచ్చిన దారిఁ బోదు మీ
పంతము సాఁగనిండు, మఱి పాడియొ మోడియొ చూడనేటికిన్.

ఉ. దౌత్య మొనర్చు వారికి విధాయకమౌ యజమాని యన్న సా
హిత్యము నొప్పగించుటయు, నిర్వ్యర మేలును గోరి వారి సాం
గత్యము నిల్పఁబెట్టు నుడికారము లల్లుట, వైరి వాక్యసా
పత్యములన్ సహించి హితభాషణ చేయుటయున్ మహీపతీ!

ఉ. "మున్నుగ బాండుపుత్రకులు పూజ్యుడు దండ్రికిఁ జెప్పుకొన్న క్రొం
దెన్నులు విన్నవించితిని ధీయుతులౌ గురువృద్ధు లీరు మీ
కన్న విధ బుసం దెలుపఁగాఁదగు మీమతమున్ హితంబు, నే
తెన్నగ నేని శక్తికొలఁదిన్ భువనప్రళయంబు మాన్పుడీ!"

వ. అంత – ౧౧౪

మ. హరి సంభాషణ మాలకించి యనియెన్ వ్యాసుండు బోధించి యా
కురుభూమీపతి యాంబికేయు, “నృపతీ! క్షోణీశితృత్వంబు నీ
కరసంస్థంబగు దాని నీవొసఁగినన్ గాదందురే? నీయనం
తరమే యెవ్వరికేని యా కతనఁ జిత్తంబేమిటో చాటుమీ!”

వ. అదియునుం గాక – ౧౧౬

మ. అయిదూళ్ళైకద! పాండురాజతనయుల్ యాచించియున్నారు నీ
వయినన్ వాని నొసంగి శిష్టమగు రాజ్యంబిచ్చి నీపుత్రులన్
దయసంతుష్టులఁ జేసికొమ్ము కృపణత్వం బీగతిన్ దాఁచి దు
ర్ణయ భావంబున కొగ్గబూది యగుఁబూర్వఖ్యాతి యోజింపుమీ.

కం. ఆ నుడులను విని సౌబలుఁ
డానసమున వెగడుఁ దనము నద్భుతరసమున్
గానఁబడ నిలిచి పలికెను
మానీశున కొసఁగి తొలినమస్కృతు లెలమిన్. ౧౧౮

చం. క్రమముగ సంక్రమం బయిన రాజ్యముఁ దమ్మునకిచ్చె తేఁడు, రా
జ్యము వశమయ్యెఁ బాండుపతి సచ్చిన దానిఁగురు ప్రజాళికిన్
సమముగ నీతఁ డిచ్చె నదినాకును జూదము నందుఁ దక్కె బం
దెమునఁ బృథాసుతుల్ వలన, దేకువఁబాచిక లొడ్డి యాడినన్.

కం. మేనల్లు రగుట నిచ్చితి
నే నొడిచిన రాజ్యరమను నీకును మఱియే
వాని కధికార మున్నది
భూనాథ! వచింపవేల పూర్వార్థములన్. ౧౨౦

కం. “మే మాపన్నిద మందున
సామి దయను జయము నొంద సరిపోయెను, వా
రే మాయది గెలిచినచో
నామాట లెటుండఁ దగునో యరయుఁడు సభ్యుల్”. ౧౨౧

మ. శకుని ప్రశ్నలకు న్నిరుత్తరులుగా సభ్యుల్ ప్రతీక్షించి వే
దికపై నిల్చి యెవారలేనియు నిజోద్దేశంబు నిర్భీకులై
ప్రకటింపం గలరేమొ వేచి యెవరున్ ప్రత్యుత్తరం బీయ ముం
దుకు రాకున్న మురారి పల్కె నిటు లుద్యోగించి ధర్మార్థముల్.

మ. "శకునీ! చక్కని పాడి పల్కితివి నీసామర్థ్యమున్ బుద్ధి సా
ర్థకముల్ నీవ జయించియుంటఁ దొలి రాష్ట్రంబెల్ల ద్యూతంబులో
సకలాధ్యక్షుఁడవైతి, దాని ధృతరాష్ట్రక్ష్మావిభుం డీయఁ గృ
ష్ణకు నేమోమున మిన్నకుంటివపు డీన్యాయంబు సంధింపదే!"

గీ. "జాలిపడఁ జేయు నీబుద్ధి జాడ్య మరయఁ
గరలి తార్కొన్న లచ్చిఁ దక్కించుకొనవు
గలుగు ధృతరాష్ట్రునకు నధికార మపుడు
నేఁడు లేదంట నెచ్చటి పాడి శకుని!" ౧౨౪

శా. నాఁడే జూదమునందు బేహరతనన్ గైకొన్న రాజ్యంబు నీ
తోడుంబుట్టు మగం డొసంగఁ గని సద్దుంజేసి వారింప నీ
గోడే యుండదు నేఁటి నిర్ణయము చేక్షోణీశితృత్వంబ యీ
రేడుల్ మాత్రముదక్కు హక్కయి సమర్థింపన్ వృథా సౌబలా".

మ. పదమూఁడేఁడులు రాజ్యమున్ విడిచి యావాసంబు సాగించుచో
విధి దౌష్ట్యమ్మున పాండవుల్ గనినఁ బృథ్వీచక్రవర్తిత్వముల్
బాదవుఁగాదె సుయోధనాదులకు సంపూర్ణంబుగా, దైవమీ
విధి సాయంపడ వారి నన్యగతులన్ వేధింపఁగాఁ జెల్లునే? ౧౨౬

శా. ఈవేమో వచియింతు గెల్చినటు సిగ్గేలాగు గోల్పోతివో?
యేవాసిన్ నిలువంగ నీడయును లేనేలేని నీతోడి నీ
బావే యగాడెడిఁగాక పందెము వృథా వ్యాసంగుఁడై, నాఁడు నీ
క్రేవన్ నిల్వనిచో సుయోధనుఁడు నిన్ గ్రీఁగంటఁ నేఁజూతురే.

కం. "నీజనకుని దుర్మృతికై
యోజించి కురుకుల మంత మొందించుటకీ
యోజన్ ద్యూతముఁ గూర్చితి
నీ జల్ప మెఱుఁగరైరి నృపతియుఁ గొమరుల్". ౧౨౯

ఉ. అంత సుయోధనుండును దురాగ్రహ మొప్పఁగ లేచి పల్కెఁ "గం
సాంతక! చెల్లె మాతులుని సంహరణం బొనరింప నీక మా
కంతల మేము ప్రొడ్డి కొనఁగాఁ గలవారము మా విచార మా
వంతయు మాని నీపని సాంత మొనర్చి గమింపఁగా దగున్.

వ. అని సుయోధనుండు గూరుచున్న — ౧౩౦

ఉ. కర్ణుఁడు లేచి పల్కె ననఘా! పదుమూఁడవ వత్సరంబు సం
పూర్ణముఁ జేసి పౌరజనముల్ బలెవారును రాజభక్తి సం
కీర్ణత సంచరింపఁ దగు; మేదిని బంచియొసంగు నట్లుగా
నిర్ణయమున్నదే? గెలిచి నిస్తుల రాజ్యముఁదిర్గి యిత్తురే?"

శా. "రాజ్యాభ్యాసము మాని పుష్కరములారణ్యస్థులై యుండుటన్
బూజ్యుల్ వారు ప్రభుత్వమంత్రగుణముల్ పూజ్యంబులై యుంటసం
త్యాజ్యుల్ రాజ్యభరంబు మోయుటకు నీధర్మస్థితిన్ మాని సా
మ్రాజ్యం బిమ్మని బోధ చేయుదువు ధర్మస్థాపకా! శ్రీహరీ!"

చం. అన నగి యచ్యుతుం డనియె నో, రథచోదకపుత్ర! బాగు నీ
యనుపమ రాజ్యతంత్రము బయల్పడె నీదగు రాజభక్తియున్
గనుపడె, జూదమాడు తరణంబున నిర్భర కున్న రాజ్యపా
లనములు సంక్రమించు మరలన్ సమయస్థితి నిర్వహించినన్.

ఉ. సూతసుతా యెఱుంగుమివసుంధర కేలిక రాజవంశ సం
జాతుఁడు విక్రముండు నయశాస్త్రపరుండును సర్వతంత్ర ని
ష్ణాత ప్రజాభిమాని కరుణామతికావలె నిన్ని యర్హతల్
నూతమజాతశత్రునకు నున్నదియొ మిన్నయొ యెన్నిపల్కుమీ.

కం. ఈ పలుకులు ములుకులుగాఁ
దోఁపన్ దుశ్శాసనుండు దొందరపడి యా
శ్రీపతి తో నిట్లనియెను
గోపాలా పొగడఁ బోకుఁ గొలువున రిపులన్. ౧౩౫

ఉ. "పాముల సెజ్జపై నునిచి ప్రాలి సుషుప్తిని దేలవచ్చునే
సేమము సౌఖ్యమున్ గనక జీవిత మెవ్వఁడు ధారవోయు నా
భీముఁడు మమ్ముఁ జంపు నటు భీషణమైన ప్రతిజ్ఞ చేయుటన్
మేము సహింపఁబో మొక నిమేషము వారి ప్రసంగ సంగముల్.

శా. ఔఁగా కీడిత రాజశేఖరులు దైవాంశుల్ మహాపండితుల్
త్యాగుల్ వారలు మమ్ముఁజంపఁగఁ బ్రతిజ్ఞాటోపులై యుండుటన్
సాఁగన్ నేరవు రాయభారములు మాశత్రుత్వమే పాదు దు
ర్యోగంబుండిన నీవు దీర్పఁగలవా? యుద్ధంబ సిద్ధంబగున్. ౧౩౭

కం. గాంగేయుఁడు దుశ్శాసను
భంగి యసహ్యంబుఁ గొలువ వారించి సభా
రంగము ముందఱ నిలిచి ప్ర
సంగించెను నయ మెలర్ప సామోక్తులతో. ౧౩౮

ఉ. "ఇంగిత మింతెఱుంగక వచించుట పోలదు దుస్ససేన! మీ
సంగమ మిచ్చగించుటఁ బ్రజాహితమున్ ధరణీ సుఖస్థితిన్
సాంగముగా ఘటిల్లుట జనార్దను నిష్టము కాన దౌత్యపుం
సంగతి నిర్వహించుటకు సమ్మతి వచ్చె నదృష్ట సంగతిన్." ౧౩౯

ఉ. మీరును మీరు లుబ్ధగతి మేదినికై కలహింప మధ్య మీ
కారణ మూని పెక్కుర యకారణ దుర్మృతి బొందు వారసా
ధారణ రక్తపాత మను ధానుణి దానినివారణక్రియా
భారము నూని యచ్యుతుఁడు వచ్చెఁ దిరస్కృతిఁ జేయఁవచ్చునే?

మ. అదియుం గాక మురారి సత్కృపను దౌత్యార్థంబు సిద్ధించినన్
బెదరం బోలదు పాండవేయులు దొలిన్ జేకొన్న యేర్పాటుగాఁ
దుదిముట్టింతు రటంచు బాండవులు బద్ధుల్ మాటకున్ నీతిక
య్యెద నేఁ బూటముకుందుసాక్షిగనుసంధింపన్ శుభంబయ్యెడిన్.

ఉ. ఈ వచనంబులన్ విని సహింపక లేచి సుయోధనుండు దు
ర్భావశాత్ముఁడై యనియె "బాగు! పితామహ! మే మబద్ధదు
ర్భావులమా పృథాసుతులుబద్ధులు నీతిపరుల్, త్వదీయ స
ద్భావముఁ బక్షపాతగతి ప్రాకటమై చనె నీ సభాస్థలిన్" ౧౨౭

ఉ. నీ వొక పూటగా నిలువ నేనును సోదరులున్ హితుల్ సుతుల్
నీ వశమై నినున్ బలసి నిల్చుట కల్ల! ముకుందుసాక్ష్యమే
భావనచేయనొల్ల, హరి వారవి పాండవపక్షపాతి, మా
త్రోవను మమ్ముఁ బుచ్చుట యథోచిత ధర్మము యేలవాదముల్.

మ. అయిదూళ్ళిచ్చినఁ జాలు నంచుఁ గద దౌత్యార్థంబ నేనీయ నొ
క్కయి దేగూళ్ళ ప్రదేశమేనియును, సూచ్యంతం బపేక్షించు నా
భయదాకారుల యున్కి సుంత సయిరింపంబోదు నే నేక్షణం
బయినన్? పాండవులో కురూద్భవులో రాజ్యంబేలు టర్హంబగున్

చం. "ముది మదిఁ దప్పియున్నపిత సూనసమెఱుంగకపుచ్చె సంజయున్
బదిలముగాఁ బృథాసుతుల వాసము భృత్యము లిచ్చి సర్వసం
పదలను గూర్తునంచు నిరపాయమె వారల యున్కి మాకు? నే
మొనవునొ యెల్లి గర్భరిపు లున్నసమీపమునన్ వచింపుఁడీ!"

ఉ. "తమ్మునిఱొమ్ముఁ జింపి, ననుఁదార్కొని యూరులను త్తరించి నా
తమ్ముల కంటె నాప్తుఁడు ప్రతాపధురీణుఁడు కర్ణజిహ్వా బా
ణమ్ములఁ జీల్చునట్లు ప్రతిసల్ ప్రకటించుట విస్మరించి గొం
తెమ్మ వరంబులన్ గొసరి తెమ్మన నెట్లు మొగమ్ము చెల్లెనో ?"

కం. జనకుం డనుమతి యిచ్చుటఁ
జనుదెంచి వసింత్రుగాకసామజపురి నా
జనుల ప్రసంగము పరిపా
లన సంగతిఁ బెట్టుకొన్న లంపట గలుగన్. ౧౪౭

కం. ఉభయులలోనే యొకరే
ప్రభువులుగా నుంట లెస్స బాహుబలుండే
ప్రభుఁడై కడతేరెడి, నీ
యిభపుర సామ్రాట్టతండ యేమనుదు హరీ! ౧౪౮

మ. అన దుర్యోధనుఁ డచ్యుతుండనియె నేలా కొల్వుకుం జీర వ
చ్చిను, మానేంద్రులఁబండితప్రకరముల్ బోధించు నూక్తుల్ చెవిం
గొనకున్నన్ సభ యేల? సంధిగొడవల్ గొం తెమ్మకోర్కెల్ గదా!
విను నీయీ పెడబుద్ధి మాలికొని సద్వృత్తిన్ బ్రవర్తింపుమీ.

మ. అన దైత్యారి సుయోధనుం డనియెఁ గృష్ణా! రాక రాకీవు వ
చ్చిన నీ గౌరవసూచకంబుగ సభం జేకూర్చితిం గాని సం
ధిని సంకల్ప మొనర్చి కాదుగద! నా నేమంబిదే నూపృథా
తనయుల్ గాని కురూర్వినాథుసుతులో ధాత్రీశులౌ టొప్పగన్.

కం. ముక్కంటి వచ్చి చెప్పిన
నిక్కము చేకొన్న రాజ్య నిష్ఠ వదల నూ
వెక్క సమగుచో మీ కిది
చక్కం జనవచ్చు మీ విషయములు మగుడన్. ౧౫౧

చం. ప్రతినయొనర్చి యుండుటను బాండుకుమారులు మమ్ములఁజంప, నీ
క్షితిని బృథాకుమారు లొసజీవులుగా ధృతరాష్ట్రసూనులో
బ్రతుకుట మేలుగాని యిరువాగులవారికి దారిలేదు నా
ప్రతిన యిదే పృథాసుతులు ప్రమ్గుటొ నేను నశించిపోవుటో."

కం. "మేనం బ్రాణము లుండఁగ
నీ నేలను బాలొసంగ నితరులకును నా
పైనిఁ బగ రణ మొనర్చిన
నే నందుకు సిద్ధ మెపుడు నీరజనేత్రా!" ౧౫౩

మ. అని మూర్ఖంబుగ నుత్తరం బొసఁగ నబ్జాక్షుండు వల్కెన్ సభా
జనులన్ జూచి "సదస్యులార! కురురాట్పుత్రుండు రారాజు ప
ల్కిన దుర్భాషల జాతశాత్రవుని భంగిన్ మీరు గన్నారు నా
పని యుం దీరదు సత్య ధర్మములు సంభాషింపకే యీసభన్."

మ. "ప్రజలం గోరక, వారి యిష్టగతికిన్ భంగంబుగాఁ బాలన
ధ్వజ సంస్థాపకుఁడొక్క రాజగునె? యత్యాచారుఁడౌఁగాని, యే
విజయుండేనియు దుర్జయుండయిన, దోర్వీర్యుండుగానీ ప్రజా
ప్రజసౌభాగ్యముసౌఖ్యముం గనక నిర్లక్ష్యంబుగా వించినన్."

ఉ. "మీకయి రాజుగాని మిము మీఱిన యాతఁడు రాజుకాఁడ యా
లోకన చేసి సర్వమును లోకుల సాకుట రాజధర్మమాఁ
గాక ప్రజాహితం బెడదఁ గానక మత్సరదుర్విదగ్ధుఁడై
యాకున కంద రాని నృపు నావలఁద్రోయుట పాడి చూడుఁడీ!"

చం. "ఎఱిఁగి ప్రజాహితంబుఁ దన యింగితముం బరికించి, ధర్మసం
కర మొడఁగూర్పఁ బోక యరికాఁపులఁగాపుల ప్రాపు పొంది భూ
సుర గురు పండితానుమతిఁ జొప్పడఁబాయక రాజ్యభారముం
గరమును రక్తిఁ దాల్పని యనాదరుఁ ద్రోయక నిల్పుటొప్పునే?"

శా. "నా విష్ణుః పృథివీపతీ యనెడుమాన్యార్యోక్తి యోజింపఁగా
దేవాధీనము సర్వకర్మముల కర్తృత్వంబు భోక్తృత్వమున్
దైవానుగ్రహ మంచు స్వార్థమునకుండా వీని సన్మార్గ స
ద్భావుం గూరిచికాని యన్యులకు నీ వాక్యం బపార్థంబగున్."

ఉ. "మల్లెకు మల్లెపుట్టునను మాటయె కాని తదీయ వృక్షపుం
బ్రుళ్ళు గతించు నాటికి నధోగతిఁ బొంది నికృష్టమైన నా
యుల్లి సమానమాటయును యుత్తమ క్షత్రియ వంశజాతుఁడై
చెల్లిన నేమి సద్గుణముఁ జేష్టలు బొందని నీచజీవికిన్ ?" ౧౫౯

మ. "సకలక్ష్మాజన సౌఖ్య మెంచక కురుక్ష్మాపాలుఁ డీనాఁడు గాం
కక స్వార్థమ్మును గోరి ధర్మగతులన్ గాల్దన్ని ముల్లోక బా
ధకమౌ యుద్ధముఁ జేయఁ జూచెడి జగత్సంతాప కుండై ప్రజాం
తకుడై మీరును బ్రోత్సహింతురె?దురన్యాయంబు సైరింతురే?"

వ. ఇదియునుఁ గాక — ౧౬౧

మ. "పుర సంరక్షకు నొక్కవాడయుఁ, గుటుంబోన్మూలనం బాఁప దు
ర్భర పాపిష్టులఁ గొందఱన్, సకలభూభాగాంతముం బాప ని
ష్ఠుర భూభాగము, దుష్టపాలనము సంశోధించి రక్షింపఁగా
నరపాలున్ విడనాడి తీరవలె నీన్యాయంబ పాటింపుఁడీ!" ౧౬౨

కం. శకునియు దుశ్శాసనుఁడును
వికలిత దుర్యోధనుసకువినఁబడఁ జెవిలోఁ
బ్రకటించి యేమొ వెనుకన్
సకిలించుచు జరిగి కన్నుసైగ యొనర్పన్. ౧౬౩

కం. కనుమూసి తెఱచులోనే
కనుసన్న భటప్రవరులు గనిపించిరి వె
న్నుని వెన్నుముట్టి యిరుగడ
లను గరవాలముల రజ్జులను గొని కడఁకన్. ౧౬౪

శా. ఈదృశ్యంబును గన్న ద్రోణ కృప భీష్మామాత్యాదివృద్ధుల్ మనో
బాధన్ బొందిరినారదుండు ముదమున్ వ్యాసుండుదిగ్భ్రాంతియున్
గ్రోధంబున్ భృగురాముఁడున్ వగపుపౌరుల్ పొంది రాదుష్టులా
రాధేయుండు సుయోధనాదులు ప్రహర్షస్వాంతులై రయ్యెడన్.

ఉ. ఏమనలేక క్రిందు పరికించెడు వారు నయోమయాత్ములై
యేమియుఁ దోఁచకుంట ముకుళించి కనుంగవ గ్రుంగువారు నిం
కేమగునో యటంచు గమనించి ప్రతీక్షణ చేయువారు ది
గ్భ్రామితులై సదస్యులు వివశ్యతఁ గాంచిరి యక్రమ స్థితిన్.

వ. ఇంతలో — ౧౬౭

శా. విద్యుద్రోచులు దుర్నిరీక్ష్యములుగా విక్రాంతఖద్యోతదు
ర్భేద్యాంశుచ్ఛవి యెల్లెడం బఱువ నుర్వీకంప ఘోరార్భటీ
పాద్యంబై ప్రళయోజ్జ్వలచ్ఛిఖి శిఖావారంబు వ్యాపించి సం
చ్ఛేద్యంబై కనుపట్టె వేదిపయి నాభీలోత్కటోత్తాలమై. ౧౬౮

కం. దేదీప్యమానమయి య
స్వాధీన మొనర్ప దృగ్విసరము సకలమున్
బోధవడక సంతమసం
బై దృశ్య మగోచరంబునై కనుపట్టెన్. ౧౬౯

కం. మిఱుమిట్లు గొలిపి యీగతి
నఱనిముసములోనె కనులకగపడె నొకచో
వెఱఁగొలుప దివ్యసుందర
తరమూర్తి చతుర్భుజుండు దరహసితుండై. ౧౭౦

ఉ. అందఱు వేయిగన్నులఁ దదాకృతిఁ గాంచి విముగ్ధచిత్తులై
వందనమాచరించు నెడ వందితుఁడై ధృతరాష్ట్రుచేత గో
విందుఁ డొసంగె దృక్కుఁ గనుపించెను గౌరవభూమిజాని కన్
విందగులీల దివ్యతరవిస్ఫుటరూప మగణ్యగణ్యమై. ౧౭౧

కం. నగవుం దళుకుల నడుమను
సొగసుం బలు ముత్తియముల సోయగ మడరన్
దొగతేని మొగము వెన్నెల
చిగురొత్తఁగ దివ్యమూర్తి చెప్పఁ దొడంగెన్. ౧౭౨

శా. "కన్నారల్గద! ధార్తరాష్ట్రుల యహంకార క్రియాకాండముల్
విన్నారల్గద! శుష్కవాదము! ద్రపావీశ ప్రసంగంబు వా
కొన్నారల్గద! మీరుఁ దోఁచిన హితోక్తుల్ మేలుయోజించియే
మన్నానో వినినారు దుర్మతికి నాహ్లాదించు నే పథ్యముల్!" ౧౭౩

శా. "భూమిన్నేనుదయించియుంటిని దమోభూతాత్ములౌ మిమ్ముఁబో
ల్భూమీనాథుల దుర్మదాంధులను నిర్మూలింప నేనైన నా
నేమంబుల్ గొనసాఁగి తీరవలె మీకుత్త్రింశ శస్త్రాస్త్రముల్
నాకైఁదాఁకియు వ్యర్థముల్ కురుసుతుల్ వ్యర్థంబులుద్యోగముల్."

ఉ. "చెప్పెద నొక్కమాటను రచించిన, సుప్రియమైన భూమికిన్
ముప్పగు సంఘటించినను బోరు పృథ్వీసకలంబు చేకయున్
దప్ప దసహ్యమా కలుపు దాడియు స్త్రీప్రపలసంకరంబులున్
దప్పవ, యేనిమిత్తమయి తార్కొను నీ విపరీత హేతువుల్?"

శా. "రాజ్యాకాంక్షితుఁడై యొకండు పెనుసామ్రాజ్యంబు నాసించుచున్
ద్యాజ్యుల్ దుష్టుల మంత్రసంగతిఁ బ్రజాధ్వంసక్రియాలోలుఁడై
పూజ్యాచార్య హితోపదేశముల దుర్బుద్ధిం బెడంద్రోయుచో
రాజ్యద్రోహి వధార్హుఁడౌ నతని మిత్రత్వం బనర్థంబగున్." ౧౭౬

ఉ. "ధర్మము నుద్ధరింప, నని తారుకొనంగ యదృచ్ఛకసిద్ధిన్
దుర్మదు లెత్తి వచ్చిన, సాతోద్ధరణంబున కేని, లోక దు
ష్కర్మ లడంప, సాధుజనరక్షణఁ గూర్పఁ బరార్థ చిత్తుఁడై
ధర్మము సార్వభౌమునకు దండననీతిఁ బరాక్రమింపఁగన్." ౧౭౭

మ. "తన ప్రాణంబులు గోలుపోయిన, బలిత్యాగంబుఁ గావించినన్
రణకేళిన్ బహుయుద్ధవీరు లసులన్ [illegible]జ్యచ్యుతిం బొందినన్
జ[illegible]వహంబై నిరం
[illegible]యోద్ధ[illegible]యంబులో." ౧౭౮

ఉ. "ఇప్పటికేని సుంతయు గ్రహింపక నానుడి ధార్తరాష్ట్రులే
యొప్పని కోర్కి సంగరముఁ బూనిన వారికి వారి వారికిన్
దప్పదు మృత్యువాతఁబడి నాశన మొందుట ధర్మబద్ధులై
యొప్పరికించు పాండుసుతు లొందుటకీర్తి జయంబు రాజ్యమున్."

మ. "ననుఁ గట్టం జనుదెంచి సంకెళులు బంధవ్రాతముం దెచ్చి ని
ల్చిన యీదుష్టుల పీడివై చెదను నే శిక్షింపకే దుర్మతిన్
గన నిర్ణీతమ వారి కెల్లి యగు సంగ్రామంబునన్, వీరునన్
జెనకం జాలుదురే చతుర్బలభటానీకంబుతో వచ్చినన్. ౧౮౦

చం. అనుచుఁ దిరోహితుండయి యథాకృతిఁ దోఁచి నిజాసనంబుపైఁ
గనఁబడె, అంబికేయునకుఁ గన్నులుచూపుడిగెన్ యథాస్థితిన్
గని కలఁగుండిమేల్గొనిన కైవడి దోఁచె సభాంతరంబు నం
గనఁబడె సర్వసుమన్ పగిడి కంటికిఁ దోంటివలెన్ విభేదమై,

ఉ. అంత మురారి యిట్లనియె "సాంతము చేసితి రాయబారపుం
దంతు, సుయోధనా! సెలవు దాతయుఁ దండ్రియు నీవు పొందు దు
శ్చింతల నాఁపఁ జాలమికిఁ జింతయు కాని మరేమి లేదు కా
సంత వివేకమున్నెడ దురంతము చేరదు మిమ్ము నేఁటికిన్."

చం. అని రాధేయునిఁ జేరి యిట్లనియెఁ "గర్ణా! నాపనుల్ దీరు ని
న్ననిభాషించిన సుంత; యెచ్చటికి నన్ రమ్మందువో చెప్పుమీ!"
యన రాధేయుఁడు "నేన వచ్చెదను మీయాజ్ఞానుసారంబ యెం
దునకున్ రమ్మన నాప్రదేశమునకున్ దోడ్తో యశోదాత్మజా!"

కం. అని దగ్గఱకుం జేరిన
యినసుతుకరమును గ్రహించి యిన నయనుండున్
గొని చనె రాధేయుని స్వం
దనగతుఁగావించి ముదమునన్ బ్రజలరయున్. ౧౮౪

చం. కొని చని హస్తినాపురి నిగూఢవివిక్తపదంబుఁ జేర్చి యం
దున డిగి కూరుచుండి యనెఁ దోయజనాభుఁడు దోయజాప్తపు
త్రునిగని "సూర్యనందన! నిరూఢవదాన్యయశోవిశాల! నీ
వనుపమకీర్తిఁ గోల్పడుదు వక్రమయుద్ధముఁ బ్రోత్సహించినన్."

ఉ. "నీ మదిలోనఁ గన్పడని నీతి రయొకం దును గానరాదు; సం
గ్రామమొనర్పఁగాఁ దగినకారణమున్నదె? యీ యధర్మముల్
సేమమ? దుష్టసంగతి వచించెడి నెవ్విధినీకు? సద్యశ
స్కాముఁడవైన నీకగునె కాని పనుల్ గమలాప్తనందనా!"

చం. "మఱియొక మాటఁ జెప్పెద సమంజసమౌట రహస్యమైన నీ
వరయఁగఁ గుంతిపుత్రుడవ; యాకె నినుంగనెఁ గన్నెనాఁట భా
స్కరుమదిఁ గొల్చి, కాంచి నిను సంశయ సంకటయుక్తి వీడినన్
బెరిగితి రాధయింటఁ వినిపించితి సత్య మదేమి చేయుదో!" ౧౮౭

ఉ. "ఈవిషయంబుఁ బాండవులొకింత యెఱుంగరు నేఁటికేని యీ
వావి వినన్ యుధిష్ఠిరుఁడు పాదములం బడికొల్చునిన్ను నీ
యేవురు తమ్ములున్ నిను భజింతురు ద్రౌపది నిన్నుఁ గూడు దు
ర్భావము లేక, కట్టెదరు పట్టము నీక జయించి రాజ్యమున్."

సీ. "సర్వ సర్వంసహా చక్రవర్తివి కాక
యంగరాజ్యాధి పత్యంబు దగునె?
పరిశుద్ధ భారత వంశజుండవు గాక
లాఘవ సూత కులాధిపతివె?
భూవసంపద్రాశి ద్రౌపదీపతివి గా
కనులోమ జాత యర్ధాంగి యగునె?
అనుసరణీయ దివ్యానుజుండవు గాక
పాలక భక్తి తత్పరుఁడవగుదె?

గీ. పూరువంశ మహాఖ్యాత పూరుషుఁడవు
కీర్తనీయ సుక్షత్రియాగ్రేసరుఁడవు
దానకర్ణాభిధాన! విద్యానిధాన!
సత్య మెఱిఁగింప వలసె నీ సమయమందు." ౧౮౯

మ. విని రాధేయుఁడు కొంతసేపు వఱకున్ విభ్రాంత చేతస్కుఁడై
కనుఁ గెందమ్ముల బాష్పముల్ దొరలనిర్ఘాంత భ్రమాలోలుఁడై
వనజాక్షాంఘ్రుల మీఁద వ్రాలి నతుఁడై భాషించె సద్భక్తి చిం
తన దీపింపఁగ నిర్భయంబుగ యథార్థంబు న్నిరూపించుచున్.

మ. "అవమానించినఁ బిన్ననాఁట నను ద్రోణాచార్యుఁ డీర్ష్యాళువై
స్తవనీయాశ్రయుఁడై సుయోధనుఁడు సద్భావుండు మన్నించి భూ
ధవుఁ గావించి పరాభవం బుడిపె; నిర్దాక్షిణ్యతావృత్తి మ
ర్భవుఁ గావించెను గుంతి యిందెవరి సంబంధం బవశ్యంబగున్?"

చం. "ననుఁ గనుచే దొసంగని నిరాదరవృత్తిఁ ద్యజించె నోర్తు! న
న్ననుఁగొని నంత వత్సలత గాదిలి సూనునికంటెఁ నెమ్మిమై
మనిచి స్వకీయ బంధముల మాఱె నొకర్తుక పెద్దఁజేసి—యిం
దనుసరణీయు లెవ్వరో యనాదరణీయులెవారో? పల్కుమీ!"

మ. "అగుఁ గాకేను వదాన్య సత్తముఁడ, నెట్లాఖ్యాతి వర్తించు నీ
జగతిన్? జేకొని ధార్తరాష్ట్రులు ననున్ సంధింప కేయున్న నా
మొగమెవ్వారికి ద్యోతమౌ? నెటుల సమ్మోదింతు రర్థార్థు లి
మ్ముగ దార్భాగుఁడనైన నావలన నంభోజాక్ష! యోజింపుమా!".

ఉ. "సూతకులంబు నందునఁ బ్రసూతుఁడనైన వదంతి ప్రాఁక, నా
జాతక రేఖఁ బర్వేను బ్రశస్తి స్వశక్తి యలంతియైన, వి
ఖ్యాతులు పెక్కురుండిన, మహారథుడంచును దానకర్ణవి
ఖ్యాతి తదన్యమౌఁగద! నిజాన్వయమింత బయల్పడన్ హరీ!"

ఉ. "నూతకులంబు నందుఁ బొడసూపి, తదన్నము నాహరించి సం
ప్రీతిని బోతరించి యరవిందదళాక్షి గ్రహించి పుత్రసం
ఘాతముఁ బొంది బంధుపరికల్ప వికల్పన ప్రోదిచేసి యే
రీతిఁ ద్యజింపఁబోలు? నలరెంచు నె తద్గతినన్న లోకముల్."

ఉ. "నామదినిశ్చితంబ, కదనంబున నోటమి సిద్ధమంచు మా
స్వామికి మేము దోడుపడి సాయ మొనర్చినఁ గాని ధర్మసం
గ్రామము గామిఁ, బాండవులు, రాజ్యముఁబొందుటయున్ స్థిరంబకా
నీ మరియాద మా కనుసరించు టసుల్ గలదాక నేలికా!" ౧౯౬

ఉ. "నేనొక మాటఁ జెప్పెదను నీరజనాభ! యుధిష్ఠిరుండు సుం
తేనియు నీయుదంత మగుపించిన-చో హృది యుద్ధయత్నముల్
మాని పదంబులంబడి క్షమాపణ గోరి త్యజించి పోవు నే
కానలకో నిజస్థితిని గయ్యము దీరినఁ జెప్పఁగాఁ దగున్." ౧౯౭

కం. అని ప్రమాన్పడి సాష్టాంగ
ప్రణామ మొనరించి యంటి పదయుగళిని నె
మ్మనమును బ్రకటించుచు నా
యిన సూనుం డిట్టు లనియె నిభవరదునితోన్. ౧౯౮

కం. "నీమాటల విన లేదని
కామజనక! కోపపడకుఁ గర్మగతిని నే
మేమున్నదో యటు లగుఁగా
యీమాటయు, నీవెఱుంగనదె కమలాక్షా!" ౧౯౯

చం. అన విని లేవనెత్తి కమలాక్షుఁడు వత్సలను సస్మితాస్యుఁడై
"యనుపమ నీతివర్తనకు హార్షముఁ జెందితి సూర్యపుత్ర! నేఁ
డనిసితి నీజగంబున వదాన్యుఁడ వంచు యశంబునీకు ని
ల్చు"ననుచుఁ గర్ణు వీడ్కొనెఁ జూచుచు నిల్వడ సూతపుత్రుఁడున్.

క౦. అరిగి యుపప్లావ్యము హరి
కరిపురమున జరిగినట్టి కథనంత యుధి
ష్ఠిరునకు వివరించి యనం
తరము కుశస్థలికిఁ జనియె స్యందనగతుఁడై. ౨౦౧

మంగళమహాశ్రీవృత్తము—

మంగళ మనంగపితి! మంగళచరిత్రా!
మంగళ మభంగయశ! మంగళ మనంతా!
మంగళ శుభాంగ! హృదయాంగ పరిశుద్ధా!
మంగళ మరుద్ధ! వినిబద్ధ వరబోద్ధా!
రంగద సురాంగ పరిభంగళ రథాంగా!
రంగ పురసంగ చరణాంగ గతగంగా!
సంగరజితాసుర! విహంగమతురంగా!
సంగరహితా! పరమమంగళ మహాశ్రీ! ౨౦౨

గద్యము

ఇది శ్రీమదిందిరానాథప్రసాదలబ్ధ సహజకవితా విరాజమాన శ్రీమద్గౌతమసగోత్ర దివివంశోద్భవ నరసింహాచార్యపౌత్ర వేంకటాచార్య రంగమాంబికాతనూజ రంగాచార్యప్రణీత శ్రీకృష్ణాతిమానుషతత్త్వ తృతీయఖండాంతర్గత పంచమాశ్వాసము — సంపూర్ణము.





దేవనాగరి పవర్ ప్రెస్, గుంటూరు - 2.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 14 | భాపంబుల్ | భావంబుల్ |
| 13 | 19 | సేసాని | సేనాని |
| 14 | 8 | సుద్యుక్తుడై | సుద్యుక్తుఁడై |
| 15 | 13 | తృళ్లి | త్రుళ్లి |
| 15 | 24 | ప్రియుని | ఁబ్రియుని |
| 18 | 21 | దృపుడై | దృప్తుఁడై |
| 19 | 8 | నాసంగు | నాసఁగు |
| 19 | 21 | దృ | ధృవకోకిల |
| 20 | 4 | భవత్ప్రియగాథ | భవత్ప్రియురాంద్ర |
| 25 | 8 | బద్దుఁడు | బద్ధుఁడు |
| 26 | 12 | దుర్భ్రలు | దుర్బలుం |
| 35 | 7 | దరు స్పృశించి | దరువు స్పృశించి |
| 39 | 1 | మెలంగెద | మెలఁగెద |
| 43 | 17 | బకితృప్తిగ | ప్రకటీకృత |
| 44 | 7 | గగ్గంబపో | భావింపుమా |
| 45 | 20 | సమ్మాన | మ్మాన |
| 47 | 23 | గానె | గాని |
| 48 | 7 | త్కృపసమదర్పిత | త్కృపసమామక |
| 52 | 13 | లోకించుక | లాకించుక |
| 64 | 5 | శుభోదయమంచు | శుభంబనియెంచి |
| 64 | 13 | నిమాలి | నిమీలి |
| 65 | 17 | సాస్త్రా | సాష్టా |
| 69 | 20 | మన్యముగా | మన్యముగానీ |
| 70 | 7 | మరుత్మ్ర | మరుత్స |
| 75 | 18 | యసంభ్యాక | యసంఖ్యాక |
| 76 | 8 | బరోక్షంటు | పరోక్షంబు |
| 77 | 5 | త్యుద్ధా | త్యుత్థా |
| 78 | 2 | పురుషోత్తముం | పురుషోత్తముఁ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 79 | 5 | దాఁపురించుటయుదార్థంబౌనుమా | దాఁపరంపమతినిర్మ్మూలంబగుఁ |
| 83 | 3 | ననంతరంబు | ననంతరంబునఁ |
| 83 | 24 | ద్వివిందునత | ద్వివిందుఁ డను |
| 85 | 7 | జ్వాలద్వృజ్మ్రాలి | జలద్ద్వజ్మ్రాలి |
| 86 | 3 | కమలభవా | కమలభవ |
| 86 | 8 | యోగేంద్రుండు | యోగీంద్రుండు |
| 86 | 8 | బోదింప | బోధింప |
| 87 | 3 | యాడుకొన | యాదుకొన |
| 87 | 4 | పొలురకైకొని | పొలురగెల్చి కైకొని |
| 87 | 7 | వ్యా | వా |
| 87 | 9 | మాగధ | మాగధ |
| 87 | 9 | బోనరించి | బొనరించి |
| 88 | 11 | ముల్గతో | ములతో |
| 89 | 14 | గరని | గరిని |
| 89 | 24 | రక్షకులకు | ఋత్వులకు |
| 92 | 11 | బారమయి | ఘోరమయి |
| 92 | 13 | బురోహితులుఁ సుహృ | బురోహితులన్ హితులన్ సుహృ |
| 92 | 27 | సమయవర్తిసూనుఁడు ధర్మజప్రవరుడు | శమనసూనుఁడు ధర్మరాజప్రవరుఁడు |
| 93 | 2 | ధామాధవుల్ | విస్ఫారులుఁ |
| 93 | 11 | న్మంత్రం | న్మంత్ర |
| 93 | 21 | ములకు | ములకును |
| 93 | 22 | డెలమఁ | డెలమి |
| 94 | 22 | కల్పనములు | కల్పనముల |
| 95 | 11 | నెవ్వాడు [illegible]నుతుండో | నెవ్వాడు ధీవినుతుండో |
| 95 | 12 | నొక్కడేని | నొకఁడేని, |
| 95 | 22 | కాటుఁడే | కాటుఁడై |
| 95 | 23 | సర్వోత్కృష్టుఁడై | సర్వోత్కృష్టుఁడై కృష్ణుఁడై |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 96 | 1 | సర్వ్రి | సర్వ |
| 96 | 1 | సూత్రాణుండు | సుత్రాముండు |
| 96 | 19 | నగుదాటుల్ | నగుబాటు |
| 97 | 3 | భూతుంబై | భూతుఁబై |
| 97 | 16 | వృథాప్రయాసముల్ | వృథాయాసముల్ |
| 99 | 3 | ప్రాజ్వ | ప్రాజ్య |
| 100 | 1 | బహు | బాహు |
| ,, | 6 | జాబాలినసదృశ | జాబాలి సదృశ |
| ,, | 11 | మేదు | మేది |
| ,, | 12 | జూడుండీ | జూడఁడీ |
| 101 | 12 | యుండి | యుంట |
| 102 | 10 | దేహాము | దేహముః |
| 102 | 21 | నెటికి | నేటికి |
| 102 | 22 | మంచికె | మంచికే |
| 103 | 2 | విబుదేంద్రు | విబుధేంద్రు |
| ,, | 3 | నొకరిం | నొకరిఁ |
| ,, | 8 | స్మగణియు | స్మగణీయు |
| 113 | 20 | వలచిన | దలఁచిన |
| 116 | 22 | నుండఁబతురతన్ | నే నిలువఁబడన్ |
| 118 | 4 | నాచిత్తవీథి | చిత్తవీథి |
| ,, | 11 | పోషకహాతున | పోషణకర్త |
| ,, | 21 | జనపదంబు | జనపదంబును |
| ,, | 22 | చ్చెరువుగ | నచ్చెరువుగ |
| 119 | 17 | తాద్భుతగుణ | తాద్భుతగుణా |
| 122 | 11 | దుర్గమబ్ధిలో | దుర్గమంబుధిన్ |
| 123 | 4 | ర్వం | త్వం |
| 124 | 1 | శంభగ | శంబగ |
| 126 | 3 | భోధతో | భోధిలో |
| 128 | 15 | రోద | రొద |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 130 | 15 | యాంతక | యాతంక |
| 135 | 2 | యుదుసలంబు | యదుసలంబు |
| 135 | 9 | క్రాలబు | క్రాలబు |
| 135 | 10 | గ్తంత్రజ్ఞాల్ | క్తంత్రజ్ఞా |
| 137 | 9 | ఆనిన | అనిన |
| 137 | 12 | తనయుసు | తనయను |
| 142 | 3 | క్షేమో త్తరం | ప్రేమో త్తరం |
| 146 | 12 | జన | జన, |
| 147 | 3 | ప్రశస్థ | ప్రశస్త |
| 150 | 3 | యాదరించి | యాదరింపు |
| 150 | 10 | అర్ఘ్యు | అర్ఘ్యుఁ |
| 152 | 24 | గావుఁగదా | గావుగదా |
| 153 | 23 | బెనటు | చెనటు |
| 158 | 9 | సుంట | చుంట |
| 163 | 12 | నద్భుత | నద్భుత |
| 165 | 20 | తరణ | తరుణ |
| 166 | 5 | ప్రాలి | ప్రాలి |
| 167 | 6 | భావశా | భావవశా |
| 168 | 21 | మమ్ములఁ | మమ్ముఁ |
| 170 | 11 | పాపిష్టు | పాపిష్ఠు |
| ,, | 11 | నిష్టుర | నిష్ఠుర |
| ,, | 12 | రక్షింపఁగా | రక్షింపఁగా |
| 172 | 6 | మధాంధుల | మదాంధుల |
| 172 | 24 | ధర్మప్రదాయ | ధర్మానుగుణ్యంబులౌ |
| 173 | 10 | అంబి | అంచి |
| 173 | 19 | యజ్ఞ | యాజ్ఞ |
| 177 | 3 | యుధిష్టి | యుధిష్ఠి |
| 177 | 3 | స్యందనగతి | చనె శతాంగ గతుండై |

# ప్రాణాచార్యులవారి గ్రంథములు



1. శ్రీకృష్ణాతిమానుషతత్త్వము 5-00
   (ప్రథమఖండము)

2. శ్రీకృష్ణాతిమానుషతత్త్వము 5-00
   (ద్వితీయఖండము)

3. స్తోత్రరత్నములు 0-75
   (యామునాచార్య కృతమున కాంధ్రానువాదము)

4. శ్రీకృష్ణాతిమానుషతత్త్వము
   (4, 5 ఖండములు అచ్చులోనున్నవి)



# శ్రీకృష్ణాతిమానుషతత్త్వము

( తృతీయఖండము )










దివి రంగాచార్యులు